# విద్యార్థులారా !

మహాత్మాగాంధీ రచనకు

శ్రీ తత్త్వానందస్వామి యనువాదము

# పరిచయం

శ్రీతత్త్వానందస్వాములు ఆంధ్రలోకమునకు చిరపరిచితులు. పూర్వాశ్రమమునందు, కొండిపర్తి వీరభద్రాచార్యు లను నామమున జీవితయాత్ర శాస్త్రవిధి ననుసరించి గడిపినవారలై బ్రహ్మచర్య గృహస్థాశ్రమముల అనంతరం భార్యావియోగమునొంది, కొన్ని సంవత్సరములు తన యిరువురు పుత్రికలను పెంచి చివరకు ఆ బిడ్డలను మాతృవశముచేసి చిరకాలమునుండి లోలోన బాధించుచున్న సన్న్యాసాశ్రమ దీక్షను అవలంబించిరి. తమ జీవితయాత్రను ఆశ్రమధర్మానుసరణముగా పలుపు కాలమునుగూడ వీరి పరాకాష్ఠచింత, సేవాతత్పరత, ఆంధ్రభాషాభిమానమును మున్నగు గుణపుంజము మిత్రులకే గాక ఆంధ్రలోకమునకెల్ల ప్రసిద్ధిగా తెలిసిన విషయము.

వీరు శ్రీ వివేకానందస్వామి భక్తులు. స్వామివారి యెడల వీరికిగల భక్తియే చివరకు వీరికి పరివ్రాజకాశ్రమమును అబ్బచేసిన దని చెప్పవచ్చును. స్వామివారి బోధనలను వివరించి తెలుగు పుస్తకములను ఏనాడో వీరు రచించిరి.

గృహస్థాశ్రమమునందు వీరికి పెద్దలయందు గల వినయ విధేయతలు, భక్తి గౌరవములు సంస్తవనీయములేగాక అపూర్వపరిమితి, పరిణామము గలిగి యుండెననిగూడ చెప్పగలము. వీరిని పెంచి పెద్దచేసిన మేనమామగారియందు వీరు చూపిన శ్రద్ధ, లక్ష్యములు నా ఎఱుకనున్న విషయము. ఆ కాలములో అనగా 1916 సం॥ పూర్వమే వీరియందు నాకు గల స్నేహ గౌరవములను పెంపొందించిన విషయ మది. 3 వత్సరముల చిన్న కుమార్తెను వృద్ధురాలైన తల్లి వశమున నుంచి, తాను స్వేచ్ఛగా సన్న్యాసాశ్రమమును గైకొనుట నా కప్పట్లో నంతగ రుచింపలేదయ్యె. కాని రానురాను మానవునకు జీవితములో గలుగు సంఘర్షణములు, పోటీభావములు, పరస్పర విరోధకములగు నుద్రేకములు బాగుగ గోచర మైనకొలది స్వార్థమును విడిచి, స్వకుటుంబాపేక్షను త్యజించి లోకసేవను చతుర్థాశ్రమమూలమున పూనిన వీరభద్రాచార్యులవారి ఉదాహరణ కేవలము సంస్తవనీయమేకాక అనుకరణీయమైనదిగూడ నని అవగాహన మయ్యెను.

ఇంక ఈ పుస్తకమునుగూర్చి ఇంచుక చెప్పవలెనుగదా! అధమము పాఠకులు పరిచయపత్రికయందు అట్టి యపేక్షను తీర్చుకొనగోరెదరు. కాని పరిచయము గ్రంథకర్తకా, గ్రంథమునకా ? అను విషయము వివాదనీయాంశము. గ్రంథకర్త లోకవిదితుడైనచో గ్రంథసమీక్ష అనావశ్యకము. గ్రంథము నూతనమైనచో గ్రంథకర్తయొక్క పరిచయ మనావశ్యకము కాకపోవచ్చును. కాని ఇపుడు అనువదింపబడిన గ్రంథములు గాంధీమహాత్ముడు అప్పుడప్పుడు స్త్రీల ధర్మములను గూర్చియు, విద్యార్థుల కర్తవ్యములను గూర్చియు వ్రాసిన వ్యాసముల సముదాయము. వీనినిగూర్చి వ్రాయుటకుగాని, అంతకన్న విమర్శించుటకుగాని అస్మదాదులకు అధికారము లేదు. శ్రీ తత్త్వానందస్వాములవారికే అధికారమున్నది. ఏత దధికారమును అనుసరించియే వీరు ఈవ్యాసములను తెనిగించుట తటస్థించినది. స్వామివారి భాషాపాండిత్యప్రకర్షనుగూర్చి చెప్పవలసిన పనిలేదు. ఈ గ్రంథమును ఆంధ్రులకు అందజేసి వీరి కృతజ్ఞతకు స్వామివారు పాత్రులయిరి. ఆంధ్రులకు అట్లే స్వామివారియొక్కయు, వారి గ్రంథముయొక్కయు పరిచయము గల్గించు భాగ్యము నాదైనది.

ఢిల్లీ
19 కానింగులేన్
10—1—48

(Sd.) భో. పట్టాభిసీతారామయ్య

# పీఠిక

జీవనచక్రము గిఱగిఱ తిరుగుచుండును. అందొక యంశమగు నరజీవనము పరివర్తనము సాగించుచు నెగుడుదిగు డగుచుండును. దాని నప్పుడప్పుడు సవరించి సవ్యమార్గమున నిలుపు టవసర మగును. ఇటుల చేయుటలో సంస్కర్తలు రెండు భిన్నమార్గముల నవలంబించుట గోచరించుచున్నది. వెనుకచూపు లేకుండ, జరిగిపోయినదేమో జరిగిపోయిన దని చెప్పి దాని గొడవ నెత్తికొనకుండ, నరిక్రొత్త పోకడల నెలకొలుపుట యొకటి. "మార్పేమో అవసరమే. జాగు చేయుటకును వీలులేదు. పూర్వ మేమి జరిగిననేమి, వర్తమానకాలమున లోకమునందు ప్రోన్నతి గాంచి వెలుంగు చున్న జాతులవారు గోచరించుచున్నారు గదా! వారి యాచార వ్యవహారముల ననుసరించుట లెస్స"యని వాదించు యువజనులు కలరు. "పూర్వాపరచింత లేకుండ ప్రపంచమున నేమి చేయుటకును సాధ్యముకాదు. నేలవిడిచిన సాముపోలిక యగును. ప్రాచీన వ్యవస్థల యాధారము లేనిది వర్తమానకాల చరిత్రను సవరింపజాలము. కార్యకారణ సూత్రబద్ధమై విశ్వము నడుచుచున్నది" అని వాదించు వృద్ధులు కలరు.

మొదటిరకమువారు గమనవేగమునే పాటించుచున్నారు. కొంతదూరము పోగా చిక్కు లేర్పడుచున్నవి. అక్కడనుండి క్రొత్త పుంతల ద్రొక్కు చున్నారు. గమ్యము కొలది దూరమున నున్నట్లు కాన్పించుచుండును. మార్గమును సరళముగ నున్నట్లే తోచును. కాని వాస్తవిక గమనమునందు తిరుగుళ్ళు తటస్థించుచున్నవి. వీరెంతయు సదుద్దేశముతో వర్తించుచున్నా రనుట నిర్వివాదము.

రెండవతరగతివారు గమనవేగమును సాగింపలేమని జాగుచేయుచున్నారు. పురోగమనము చేయు నవసరమును గుర్తించుచునే యున్నారు. అటుల చేయక యున్నచోటుననే నిలిచి యాలోచించుచ మనిన అది పొసగక వెనుకకు నెట్టబడునట్లు తెలిసి విచారపడుచున్నారు. వీరికి ముందుత్రోవ చిక్కులతో నిండి గోచరించుచున్నది. నిరాశాహతు లగుచున్నారు. కాని నిరంతరగమనము సాగించు ప్రకృతి యాగునా? ఎల్లఱను ముందునకో, వెనుకకో నెట్టుచున్నది. త్రొట్రుపడుచు వీరు ఆక్రోశించుచున్నారు.

భారతభూమియం దీ రెండు తెగలవారు పదు త్రిప్పలు ప్రస్ఫుటముగ గోచరించుచున్నవి.

మొదటితెగకు ప్రతినిధు లనదగిన విద్యార్థులు పాశ్చాత్యవిద్యల గఱచి యుద్యోగముల కెగబ్రాకుచున్నారు. వ్యక్తి స్వాతంత్ర్యమును పూని ధన రాసుల గడించి యిచ్చవచ్చినతీరున సుఖభోగముల ననుభవించవలయునని యువ్విళ్ళూరుచున్నారు. విద్యలకై దోసిళ్ళాది ధనమును గ్రుమ్మరించు చున్నారు. బీదలై యా ధనమును చేకూర్చజాలని తలిదండ్రులను, పోషకు లను పీడించువా రగుచున్నారు. పరభాషలో చదువు నేర్వవలసివచ్చుటచేత బుద్ధివికాసము లభించుటలేదు. వక్రోపాయములచేత నైనను యోగ్యతా పత్రముల గడింపబూని యిక్కట్టులపా లగుచున్నారు. ఉత్తీర్ణులై నవారికిని తగినన్ని ఉద్యోగములు చిక్కుటలేదు. నిరుద్యోగులు తమ కుటుంబము లకును, దేశమునకును భారమై తోచుచున్నారు. పేదదైయున్న మాతృ దేశము నింకను పేదదానిగా నొనరించిన దోషఫలము ననుభవించుచున్నారు.

ఉద్యోగములలో జొఱబడినవారికి సంపాదన చాలుటలేదు. లంచములకు చేజాచుచున్నారు. వీరి కేవి సమకూర్చిపెట్టినను పేదదగు భారతజాతియే గదా! మొన్నటివరకు దేశపరిపాలనమును నడిపిన విదేశీయులు నిర్విచార ముగా ప్రజలనుండి ధనము దోచి తామును, తమ క్రింది యుద్యోగిగణమును పంచుకొనెడివారు. వారిచే శిక్షితులైనవారో, వారి పంథానే యింకను ననుసరించువారే యైయున్నారు. ఇప్పటి యుద్యోగులు మాకు జీతములు హెచ్చుకావలెను; భత్యములు పెంపుకావలెను అని గగ్గోలుపెట్టుచున్నారు. సమ్మెల గట్టుచున్నారు. పొదుగు గోసి పాలుద్రావగోరువారై విఫలత నొందుచున్నారు. వీరు కోరు ధన మెవరివలన లభించును? ఆ ప్రజలు నేడు ప్రభువులే యైనను కడు దీనులుగ నున్నారు. వీరి సేవచేయు నేర్పును గడించుటే విద్యార్థుల ధర్మమై యున్నది. ఆ సేవల నర్పించుటే యుద్యోగు లకు విధి.

ఇది యిట్లుండ సాంసారిక విషయముల గూడ యువకులకును, పెద్దల కును పొత్తుకుదురుటలేదు. సుఖభోగములకై ఆతురపడు యువజనము సర్వ స్వతంత్రులు కాగోరుచున్నారు. సమష్టి కుటుంబ వ్యవస్థలను భిన్నము చేయుచున్నారు. పెండ్లిండ్ల సందర్భమున స్వేచ్ఛానురాగసూత్రమును ప్రతి

పాదించుచున్నారు, పెక్కు బాధలు పడుచున్నారు. ఆహారవిహారములందు హద్దుమీరి కుందుచున్నారు. విమర్శదృష్టితో చూచునెడల వీరిపోకడలును సహజము లనక తీరదు.

రెండవ తెగవా రగు పూర్వాచారపరాయణులు నూతన పరివర్తనమును పాటింప తిరస్కరింతురు. కాని, ఆ పడవలోనే ప్రయాణముచేయుచు వేఱుదిశ కెట్లుపోగలరు ? తమ సంతానమునకు ఆధునిక విద్యల జెప్పించినవారు తాము; విషమసహవాసముల గూర్చినవారు తాము; ప్రతికూల జీవితాదర్శముల జూపినవారు తాము; సంప్రదాయ భంగకరము లగు శిక్షణలకు లోనుజేసినవారు తాము; నిరాడంబర జీవనగతుల భంగపఱచుటకు బాధ్యులు తాము. అట్టి తామిప్పుడు శాపనార్థములకు బూనిన ఫల మేముండును ?

పూర్వాపరములకు సఖ్యతచేకూర్చి, ప్రాచీన సంస్థలు భగ్నము కాకుండ, నైతిక పతనము వాటిలకుండ, శాంతిమయ నిరాడంబర జీవనపంథాను జూపి జాతిని సంరక్షింపగల మహనీయుని సద్బోధ యీ కాలమున నెంతయు వాంఛనీయము, ఆ బోధలు సులభాచరణీయములుగ నుండవలయును. వినిర్మల ప్రేమపూరిత హృదయమునుండి వెలువడు నుపదేశములుగ నుండవలయును. ఆ యుపదేశముల గావించునతడు తా నాచరించి చూపువాడుగా నుండవలయును.

అదృష్టవశమున అటువంటి మహాపురుషుడు మనకు లభించి యున్నాడు. విశ్వాసపాత్రుడని భారతీయు లెల్లఱు మనస్ఫూర్తిగ నొప్పుకొనుచున్నారు. ప్రపంచమునందలి సకలసమాజ ప్రజలును వాని సరళస్వభావమును మెచ్చుకొనుచున్నారు. కాని, లోకమునందలి ప్రస్తుత వాతావరణమును మార్చుకొనకుండ, ఒకింత త్యాగము చేయకుండ, స్వార్థపరతను కొంత తగ్గించుకొనకుండ వానిబోధల నవలంబించుట కష్ట మనుచున్నారు. సత్యమే. ఈనాడు నరసమాజము నలముకొనిన చిక్కులనుండి తప్పించుటకు, వారి యిక్కట్టుల బాపుటకు, నీతి దప్పకుండ శాంతిమయజీవనము నలవఱచుటకు అర్హుడగువాడతడే.

అతడే గాంధీజీ !

పెక్కుసంవత్సరములనుండి గాంధీజీ వ్యాసములను "యంగ్ ఇండియా" లోను, హరిజన పత్రికలోను, తదితర పత్రికలలోను చదువుచుంటిని. ఆనం

దించుచుంటిని. దానిని తెలుగుభాషలోని కనువాదముచేసి ఆంధ్రసోదరులకు నివేదించు కుతూహలముతో చాల కాలమునుండి ప్రయత్నించుచునే యుంటిని. ముందు జాతీయనాయకులు కాగలవారును, జాత్యభ్యుదయమున కాధారులు నగు విద్యార్థులు, స్త్రీలు గ్రహింపదగినవానిని అనువాదముచేయ మొదలిడితిని. మధ్యమధ్య కొన్ని అంతరాయము లేర్పడుచు వచ్చునవి. ఇంతలో ఆనంద, టి. హింగోరాణిగారేర్చి **To the Students, To the Women** అను రెండు సంపుటములుగా ప్రకటించిన పుస్తకములు చూచుట తటస్థించినది. నా యుద్యమమునకు పునఃప్రేరణ గల్గినది. ఆ పుస్తకములును నాకు చాలగ తోడ్పడినవి. వారికి నా వందనములు. నే నేర్చి కూర్చిన వానికిని, హింగోరాణిగారి కూర్పునకును కొలదిగ భేదము కలదు. గాంధీజీయొక్క ఈ వ్యాసభాగములను పఠించు నెల్లఱకును తమ కర్తవ్యమేమొ సుస్పష్టమగుటేగాక, వారికి సర్వవిధముల ప్రోత్సాహోన్నతి కలుగగలదు. గాంధీజీవాఙ్మయమును తెలుగులో ప్రకటించు కుతూహలములో నున్న శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు రత్యంతోత్సాహముతో నే ననువదించు గాంధీజీ రచనలనెల్ల ప్రకటింతు మనుటేగాక శ్రీ కస్తూరిబా నిధి, హరిజనసేవకనిధి మున్నగు వానికి నా ద్వారమున విరాళములు చేకూర్చుటలో తోడ్పడినందుకు వారికి నా వందనములు. కాగితపు కంట్రోలు, రేషనింగులు మున్నగు నవరోధముల మూలమున వీని ప్రకటనయం దమిత మగు నాలస్యమైనది. పరిచయవాక్కుల రచించియిచ్చిన సోదరుడు శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారియెడ నెంతయు కృతజ్ఞుడను.

తత్త్వానంద

17-1-48

# వి ష య సూ చి క

## ౧. విద్యాధర్మము


| | | |
|---|---|---|
| ప్రస్తుతవిద్య | .... | 1 |
| సార్థకవిద్య | .... | 2 |
| వృత్తులు - విద్య | .... | 3 |
| నవనాగరికత | .... | 6 |
| రాజకీయము - అధ్యాత్మము | .... | 8 |
| స్వదేశ వ్రతము | .... | 12 |
| విద్యార్థులారా | .... | 16 |
| హిందీ - ఇంగ్లీషు | .... | 16 |
| త్యాగసాహసములు | .... | 20 |
| ఆంగ్లభాషావ్యామోహము | .... | 22 |
| రాజకీయములు - శీలము | .... | 24 |
| సైన్యములు | .... | 28 |
| నిరుద్యోగము | .... | 30 |


## ౨. వివాహధర్మము


| | | |
|---|---|---|
| సతీగౌరవము | .... | 33 |
| వివాహవ్యయములు | .... | 36 |
| వరాన్వేషణము | .... | 37 |
| దుర్వినీతులు | .... | 38 |
| అభినవబాలిక | .... | 40 |
| గీతాపరిచయము | .... | 42 |


## 3. సంతాన నిరోధము


| | | |
|---|---|---|
| సంతాననిరోధ సాధనములు | .... | 47 |
| విద్యార్థికుని సమస్య | .... | 51 |
| బ్రహ్మచర్యవ్రతమహిమ | .... | 55 |

## ౪. ధర్మవాదము


| | | |
|---|---|---|
| న్యాయవాదవృత్తి | .... | 65 |
| విద్యార్థిదశ ప్రారంభము | .... | 66 |
| ప్రార్థన యన నేమి ? | .... | 68 |
| ప్రార్థనయందు విశ్వాసము | .... | 72 |
| వ్యర్థ పతనములు | .... | 75 |
| మాటల పీడ | .... | 80 |
| ద్వంద్వ యుద్ధము | .... | 86 |
| అస్పృశ్యత | .... | 92 |


## ౫. ఆంగ్లవిద్యార్థులకు


| | | |
|---|---|---|
| ఆంగ్లవిద్యార్థులారా ! | .... | 94 |
| మా స్వాతంత్ర్యోద్యమము | .... | 96 |
| ప్రశ్నోత్తరములు | .... | 97 |


## ౬. విద్యార్థుల ధర్మము


| | | |
|---|---|---|
| విద్యార్థుల ధర్మము | .... | 101 |


•

# విద్యార్థులారా!

## ౧. విద్యాధర్మము

### ప్రస్తుత విద్య

ప్రస్తుత విద్యావిధానము మన దేశమున కేమాత్రము నుపయోగ పడునదిగ లేదు. ఉన్నత తరగతులలో సమస్తవిషయములు ఆంగ్లభాష ద్వారమున బోధింపబడుచున్నవి. అందువలన అల్పసంఖ్యాకులగు విద్యాధికులకును, బహుళ సంఖ్యాకులగు ప్రజాసామాన్యమునకును మధ్య పెద్ద అఖాత మేర్పడిపోయినది. జన సామాన్యములో విద్య వ్యాపించుట కిది ప్రతిబంధక మయ్యెను. ఆంగ్లమున కీవిధముగ అధిక ప్రాముఖ్య మీయబడుటవలన, విద్యాధికులు జీవితాచరణమునందు కుంటివారై పోయి, తమ దేశమునకు తామే దూరస్థులైరి. వృత్తివిద్య కొఱకగు శిక్షణ మేమియు లేకపోవుట వలన ప్రయోజనకర మగు ఏ కృషిని గాని చేయజాలక కాయకముగ గూడ దుర్బలురై పోవుట సంభవించినది.

ఇక ప్రాథమిక విద్యకై ప్రస్తుతము ఖర్చుపెట్టబడుచున్న ధనము కేవలము వ్యర్థ మగుచుండెనని చెప్పక తప్పదు. నేర్చిన విద్యయైనను ఇట జనపద జీవనమునకుగాని, అటు నగర జీవనమునకుగాని పనికిరా కున్నది. నేటి విద్యా విధానమువలన ఏమేని ఫలము కలిగినను అయ్యది ఎవరొసగు పన్నుల వలన ప్రభుత్వకోశము అధికముగ నిండు చున్నదో అట్టివారికి ఎంతమాత్రమును చెందుటలేదు. ఏలన వారి సంతా నము ఈ విద్యా ప్రయోజనమును ఇసుమంతయు పొందుటలే దనియే చెప్పదగును.

ప్రాథమికవిద్యా సంస్కరణను ఈ క్రింది విధముగ చేయవలయు నని నాకు తోచుచున్నది. ప్రాథమిక విద్య ఏడుసంవత్సరములలో పూర్తి యగునదిగ నుండవలెను. ఇంగ్లీషును మినహాయించిన మెట్రిక్యులేషను విజ్ఞానము ఈ ఏడుసంవత్సరములలో బాలురకు లభించునట్లుగా నుండ

వలెను. పైగా పైజీవనమున కాధారము కల్పించు ఏదైన వృత్తివిద్య యందు విద్యార్థి సమర్థుడై యుండవలెను.

## సార్థక విద్య

బాల బాలికలయొక్క సర్వతోముఖాభివృద్ధికి గాను వారి కిచ్చు శిక్షణ యంతయు ఏదైన లాభదాయక మగు వృత్తి విద్యాబోధ ద్వారము ననే సాధ్యమైనంతవరకు ఈయవలయును. అనగా ఈ పద్ధతి ద్వారమున రెండు కార్యములు సాధింపబడ వలయును : 1. వృత్తి విద్యచేత అయా వస్తువులు తయారుచేసి, తద్ద్వారా విద్యార్థి తన శిక్షణకగు ఖర్చును తానే భరించుకొనగలుగుట : 2. ఆ వృత్తి విద్య ద్వారముననే శారీరక మానసిక అధ్యాత్మికోన్నతిని పొందగలుగుట, విద్యార్థులు తయారుచేసిన వస్తువుల అమ్మకమువలననే పాఠశాలకు కావలసిన నివేశనస్థలము, భవనము, సామగ్రి అన్నియు సంపాదింపవలయు నని నా అభిప్రాయము కాదు. ఆ ఖర్చులు ప్రత్యేకము.

ప్రత్తి, ఉన్ని, పట్టు పరిశ్రమలు (వడకుపని, నేతపని, కలంకారి పని మొదలగున వన్నియు నిందులోనే చేరును.) కుట్టుపని, బైండింగు పని, ఆటవస్తువుల తయారుచేయుపని, బెల్లపు వంటపని యివన్నియు సులభముగా నేర్చుకొనదగినవి. ఎక్కువ పెట్టుబడి అవసరము లేకయే సాధింపదగినవి.

వృత్తిని నేర్పుటద్వారా విద్యాబోధ చేయుటయందు నాకు కొంత అనుభవమున్నది. దక్షిణాఫ్రికాలో టాల్‌స్టాయి ఫారమునందు నా కుమారులకును, ఇతరులకును నేను మొదట కాలెన్‌బాని గారివలన నేర్చుకొనిన వడ్రంగము, చెప్పులు కుట్టుట మున్నగువానిని నేర్పుచు తద్ద్వారా వారికి విద్యాబోధ చేసెడివాడను. ఇందువలన వారు చెడిపోయిన దేమియు లేదని నేను గట్టిగా చెప్పగలను. కాని నాకు తీరిక చాలతక్కువగా నుండిన కారణమునను, అనేకమైన ఇతర కార్యముల యందు దృష్టి నిగుడ్ప వలసినవాడ నగుటచేతను, నా చేసిన విద్యాబోధ నాకుగాని, వారికిగాని తృప్తికరముగ లేకపోయినది.

## వృత్తులు - విద్య

కేవలము వృత్తులు నేర్చుకొనుటే గాక ఆ వృత్తులు నేర్చుకొనుట ద్వారా విజ్ఞానమును బడయుట నా ఆశయము. సారస్వతము, చరిత్ర, భూగోళము, గణితము, భౌతికశాస్త్రము మొదలగున వన్నియు సమస్త విజ్ఞానము వృత్తివిద్య ద్వారముననే నేర్పవలయునని నా యభిప్రాయము. మధ్యయుగములో ఇదేకదా విద్యాపద్ధతియని కొంద ఱాక్షేపించ వచ్చును. అటులకాదు. అప్పుడు ప్రధానముగ వృత్తి విద్యాశిక్షణ మున్నను, తద్ద్వారా సకల విజ్ఞానమును బోధించుపద్ధతి లేదు.

తక్లీమీద నూలువడకు పనిని నేర్పవలసియున్న దనుకొనుడు. ప్రత్తిలో యెన్నెన్ని రకము లున్నవో, ఏయే రాష్ట్రములయందు ఏయే నెలలలో ఏయేరకములు పండునో, వడుకుపరిశ్రమ మన దేశములో యే విధముగ క్షీణగతికి వచ్చినదో, అనుపోయుట వగైరాలలో లెక్క లెట్లుండ వలయునో, ఎందు కట్లుండవలయునో యివన్నియు బాలురకు బోధింప వలయును. ఈ సందర్భమున ఇండియాలోని బ్రిటిషు పరిపాలనయొక్క చరిత్రనుగూడ నేర్పవచ్చును.

విద్యార్థులు చేసిన చేతిపనుల మూలమున ఉపాధ్యాయునికగు ఖర్చును రాబట్టవలయునని నా కోరిక. ఎందుకన కోట్లకొలదిగ నున్న మన బాలురకు, బాలికలకు విద్య నేర్పుటకు అంతకంటె వేఱుమార్గము లేదు. వైస్రాయి మిలిటరీ ఖర్చును తగ్గించువఱకు గాని, ఇతరత్ర మన కధికాదాయము వచ్చువరకుగాని వేచియుండజాలము. నేను సూచించిన ప్రాథమికవిద్యావిధానములో గ్రామపారిశుధ్య మెట్లుండవలెనో,ఆరోగ్యము నెట్లు కాపాడుకొనగలమో, ఏది పుష్టికరమైన ఆహారమగునో, ఇతరులపై నాధారపడక కృషి సల్పుట యెట్లో, గృహములో తల్లిదండ్రుల పనులలో పాల్గొనువారికి తోడ్పడుట ఎట్లు? అను విషయము లన్నియు ఇమిడి యుండును. ఇప్పటి విద్యార్థులందు శుభ్రత, స్వయంసహాయము, దేహ దార్ఢ్యము శూన్యముగ నున్నవి. చిన్నచిన్న నాట్యవిధానముల ద్వారా పిల్లలకు శరీర వ్యాయామశిక్షణ మొసంగనగును.

సాహిత్య విద్యాభ్యాసమునకు నేను ప్రతికూలుడ నని కొందరపోహ పడుచున్నారు. అందెంతమాత్రము నిజము కాదు. ఆ సాహిత్యవిద్య

పరీతిగా అభ్యసింపవలయును అను విషయమును మాత్రమే నేను చెప్పితిని. పిల్లలను కష్టపెట్టి వారిచేత పరిశ్రమలు చేయించుట అధర్మము గాదా యని కొంద అందురు. పిల్లలచే పనులు చేయించుట వలన చాల సొమ్ము పాఱుపోవు ననియుగూడ అధిక్షేపింతురు. ఈ మాట సత్యము గాదని అనుభవము గలవారికి తెలియును. తక్లీవంటి క్రీడావస్తువులతో పిల్లలచేత పని చేయించుట వారిని కష్టపెట్టుట యగునా ? ఇండ్లలో పిల్లలు తమ తల్లిదండ్రుల పనులయందు తోడ్పడుట లేదా ? నేను చెప్పిన విధానమునందు పిల్లలు తలిదండ్రులకు సాయపడుటే గాక గ్రామమునెడను, దేశమునెడను తమకుగల బాధ్యతను గుర్తెఱుగుట నేర్చుకొనగలరు.

మనలో సాంఘిక కలహములు గలవు. అవి కేవలము మన మొగముననే వ్రాసిపెట్టబడినవి గావు. ఇంగ్లండులోగూడ వెనుక అంతఃకలహములు చెలరేగుచుండెడివి. ఇప్పుడు సామ్రాజ్యతత్త్వము లోకమునకు శత్రువై కూర్చున్నది. సాంఘిక కలహములను రూపుమాపవలెనన్న నేను చెప్పిన విద్యాపద్ధతి ద్వారమున మన పిల్లలకు బోధలు చేయించి రాబోవు తరమునకు మంచి పునాది వేయవలసి యున్నది. ఇది అహింసాత్మకమైన పద్ధతి. రెవిన్యూ నష్టమేమియు లేక ప్రభుత్వకోశము పూర్తిగ నిండియున్నను గూడ స్వయంపోషక విద్యాపద్ధతి అవలంబించ తగినది. మన సభ్యతకు, మన నాగరిగతకు, మన జాతియొక్క విశిష్ట ధర్మమునకు మన బాలురను బాలికలను ప్రతినిధులనుగా తయారుచేయవలసి యున్నది. యూరపు మనకు ఆదర్శము కాదు. అక్కడి పద్ధతు లన్నియు హింసాత్మకములు. రష్యా పెక్కు ఘనకార్యములను సాధించిన మాట నిజమే. కాని ఆ విధానమంతయు కేవలము హింసాదౌర్జన్యములమీద ఆధారపడి యున్నది. మన భారత దేశము అహింసను వర్జింపవలసి య్యున్న యెడల నేను చెప్పిన విద్యాపద్ధతి యొక్క నియమములను అనుష్ఠింప వలయును. విద్యకొఱకని ఇంగ్లండు కోట్లు ఖర్చుపెట్టు చున్నది. అమెరికా కూడ వ్యయపరచుచున్నది. కాని ఆ ధనమంతయు నితరుల నెత్తిని గొట్టి సంపాదింపబడిన దనుట మఱచిపోకూడదు. పర పీడనమునకు తగిన శాస్త్రములు వారు తయారుచేసి యున్నారు.

ఆ కారణమున వారు తమ బిడ్డల విద్యకొఱకు కోట్లకొలదిగ ఖర్చుపెట్టగలుగుచున్నారు. వారి పరపీడనపద్ధతి మనకు గ్రాహ్యముకాదు. కావున అహింసాత్మకమైన స్వయంపోషక విద్యాపద్ధతి తప్ప మనకు అనుసరణీయమగు పద్ధతి వేఱొకటి లేదు.

యథార్థముగ బుద్ధికి పుష్టినొసగు విద్య చేతులు, కాళ్ళు, చెవులు, కండ్లు మొదలగు సర్వేంద్రియములకు అర్హమగు వ్యాయామమును శిక్షణమును నొసగగల విధానము ద్వారమున మాత్రమే చేకూరగలదు. అనగా బిడ్డలు తమ శరీరావయవములను తెలివితేటలతో వినియోగము చేయుట వలననే వారికి బుద్ధి వికాసము లభింపగలదు. బుద్ధివికాసము శరీరసౌష్ఠవము రెండును కలసి ఆత్మయొక్క ప్రబోధమున కుపకరించుచుండిననే తప్ప కేవలముగ బుద్ధివిలసనము వలన మాత్రము ప్రయోజనముండజాలదు. ఆత్మప్రబోధ మనగా హృదయమునకు లేక యోచనకు నొసగబడు శిక్షణయని యర్థము.

శరీరము, మనస్సు, ఆత్మ వేర్వేఱై వికాసమును పొందగల వనెడు సిద్ధాంతముతో నడచు విద్యాపద్ధతియొక్క మహానర్థములు మన చుట్టును ఎక్కడ చూచిన అక్కడ గోచరించుచున్నవి. మన పాఠశాలలలోను, విశ్వవిద్యాలయములలోను గఱపబడు విద్యాబుద్ధిని విపరీతముగా వ్యర్థపరచునదిగా నున్నది. శరీరము క్షీణించుటగాంచి ఏవేవో అసహజములును కృత్రిమములును నగు వ్యాయామములను ఆటలను కల్పించినను వాని ఫలితములు ఘోరములుగ నున్నవి. మనలో నున్నతవిద్య గఱచిన వారికి ఒకింత శరీరశ్రమ తటస్థించుచో తలనొప్పి బాధించును. ఎండలో కొంచెము నడచినచో పైత్యవికారము, అలసట కలుగును. వారి హృదయ భావములు విపరీతములై విషమగతిని నడచును. నైతికముగను, ఆధ్యాత్మికముగను అరాచక మేర్పడి పోయినది. మఱియు నిదంతయు మహోచ్ఛదశయే యనెడు భ్రాంతి పట్టుకొనినది.

ఇందుకు మారుగా బిడ్డలకు నూలు వడకుటో, వడ్రంగమో, వ్యవసాయమో, మఱేప్రయోజనకరమగు వృత్తి అలవరచునట్టి విద్యావిధానమో యేర్పరచి ఆయా వృత్తి సిద్ధాంతములను, ప్రయోజనములను, వివిధోపకరణముల నిర్మాణములను, ప్రయోగములను నేర్పియుండిన

యెడల, పూర్ణవికాసమునొందిన పురుషవరులు తయారై యుండెడివారు. శ్రేష్ఠమగు వాఙ్మయము, సమర్థమగు వృత్తివిద్య, మనోహరమగు కళాభిజ్ఞత ప్రవర్ధనము గాంచియుండెడివి. నరు డనగా కేవలము బుద్ధి గాని, శరీరముగాని, ఆత్మగాని కాదు. వీని యన్నింటి సమ్మిళిత మూర్తియే నరుడు. ఈ త్రివిధాంశములను వికశింపజేయు విద్యా విధానమే మితవ్యయముతో, అత్యుత్తమ ఫలప్రదముగ సాగింపబడ దగి యుండును. ఈ తీరు విద్యయే లక్షలాది మన బాల బాలికలకు గఱపి యుండిన యెడల స్వాతంత్ర్యప్రాప్తి యింత ఆలస్యమై యుండెడిదికాదు.

## నవనాగరికత

నేను ఆధునిక నాగరికమునకు విరోధిననియు, దాని విధ్వంసములను కోరువాడననియు చెప్పగా వినియుందురు. మీ కండ్లను యూరపు వైపున కొకింత త్రిప్పి, ఆ ఖండము ఏ తీరుగ ఆధునిక నాగరిక భారము చేత కృంగి అణగారిపోవుచున్నదో మీరు గమనింప గోరెదను. ఆ యూరపుఖండము ఆధునిక నాగరికముయొక్క పాదములక్రింద బడి నలిగిపోవుచున్నటుల మీరు గ్రహించితిరేని, మీరును మీ పెద్దలును ఆ నాగరికతను అనుకరించుచు, దానిని భారతభూమిలోనికి దిగుమతి చేయుటను గూర్చి వివేకముగలిగి విచారింపవలసి యుండును. పాలకులు దానిని దిగుమతిచేసి, మన మాతృభూమిలో దానిని ప్రతిష్ఠింప బూని నప్పుడు మన మేమిచేయగలమని సమాధానము చెప్పుచు ందురేమో, అట్టి పొరపాటు నెన్నడును చేయబోకుడు. మీరు అంగీకారముచూపి స్వీకరించినతప్ప మీ పాలకులు ఏ సంస్కృతినిగాని మీపై బడవేయ గలుగుదురని నమ్మబోకుడు. పాలకులు అట్టి సంస్కృతిని మన యెదుట బెట్టినను, ఆపాలకులనే నెట్టివేయకుండను సైతము, వారి సంస్కృతిని తిరస్కరింపజాలు శక్తియు, బలమును మనకు లేకపోలేదు. మీరు మీ పూర్వ ఋషిసత్తముల ఆదర్శాదేశములను గుఱించి వినుచున్నారు, చదువుచున్నారు. ఆ వాణిని అనుసరించితిరా? మీరు మీ విజేతలగు పాలకులను జయింప గల్గుదురు. ఒక చుక్క నెత్తుటి నేని చిందింప బని లేదు. ఆత్మశక్తిచేత విజయమును సాధింప గలుగుదురు. సాత్వికశాసన విరోధినగు నేను చెప్పు సలహాను వినుడు. మిమ్ము మీరే భయపెట్టు

కొనకుడు. అంతర్ముఖులై పరిశోధన చేసికొనుడు. ఎక్కడ దౌర్జన్యము కాన్పించినను నిరోధించుడు. మీ స్వాతంత్ర్యమును లోబఱచకుడు. మిమ్ము పీడించువారి రక్తమును బలిగొనకుడు. మనది అహింసా తత్త్వమని మఱవకుడు. అహింసయు కేవలము ప్రేమమయ ధర్మము. మన మతము యొక్క ఆదేశ మిది. మీరు మీ పొరుగువానిని ప్రేమించుట చాలదు. మీ మిత్రులను ప్రేమించుట చాలదు. మీ శత్రువులను సయితము ప్రేమతో నాచరింపవలసి యుండును. మీరు సత్యాచరణపరులై యుండగోరినప్పుడు అహింసయు అందంతర్భాగమై యుండును. మీరు నిర్భయులై మెలగవలసి యుండునని తక్షణమే గ్రహింపగలుగుదురు. మన పాలకులు చేయునది తప్పని తెలిసి, వారికి మన సలహాలను తెలుపవలసి యున్నప్పుడు అట్టి సలహాలను వారు రాజద్రోహమని యెంచినను కూడ, నిర్భయముగా మన భావములను ప్రకటింప వలసియుండును. అందువలన గలుగు ఇక్కట్టులను సంతోష పూర్వకముగా ననుభవించ వలయును. ఫలితార్థములను అనుభవించుటకు మీరు సంసిద్ధముగా నుండిన యెడల, అక్రమముగా దెబ్బదీయుటకు మీరు పూని యుండని యెడల, పాలకుల సయితము మీ సలహాను వినిపించు అర్హతను మీరు సంపాదించుకొనినవారే యగుదురు.

నేను బ్రిటిషు దొరతనముతో మైత్రిసల్పువాడను. ఏమన బ్రిటిషు సామ్రాజ్యములోని ప్రతి పౌరునితోడను సమాన ప్రతిపత్తి గల భాగస్వామిగ నుండగలనని వాదించుట సాధ్యమేయని నా విశ్వాసము. నే నీనాడు సమాన భాగస్వామ్యము కలవాడనేనని వాదించుచునే యున్నాను. నేను లొంగిపోయిన జాతివాడను గాను. లొంగిపోయి యున్న జాతికి జెందినవాడ నని నే నెన్నడు ఒప్పుకొనను. కాని ఒక్క విషయము నిజము. బ్రిటిషు గవర్నమెంటు మనకిచ్చిన దేమియులేదు. ఏ దేని తీసికొనుట మనవంతే. మనమొక దానిని తీసికొన గోరుచున్నాము; తీసికొనగలము. మన బాధ్యతలను మనము నిర్వహించియే దానిని తీసికొన గోరుచున్నాము.

మాక్సుమిల్లర్ మహాశయుడు భారతీయుల మతము నా 'అధికారము' అనెడు ఐదక్షరములలోగాక, నా "స్వధర్మము" అనెడు

నాలుగశృగములలో నిమిడియున్నదని పలికియున్నాడు. ఆ మాటయందు మీకు విశ్వాసముగలదేని మన స్వధర్మమును నిర్వహించుట మూల మున మనకు గావలసిన దానినెల్ల సంపాదించుకోగలుగుదుము. కాబట్టి మీ స్వధర్మమును గుఱించి మీరు సదా చింతించుచుండుడు. ఆ పంథా ననుసరించియే మీ పోరాటముల సాగింపుడు. మీ రేమానవుని గుఱించి యేని భయపడనవసరము మీకుండదు. మీరు భగవంతునికి మాత్రమే భయపడవలసియుండును. నా గురు వననేల నీకును గురువేయగు. శ్రీ గోఖలేగారు నా కొసగిన హితబోధయు ఇదియే. వారి ఆదేశార్థ మేమి ?. అది వారి భారతదేశ సేవాసమితియొక్క నిర్మాణమునందు గలదు. నేను నా జీవితమున దానినే అనుసరించుచున్నాను.

## రాజకీయము - అధ్యాత్మము

మనదేశమున 'రాజకీయ జీవితమును రాజకీయ సంస్థలను అధ్యాత్మపరములుగ నొనర్పవలయును' అనుటే వారి ఆదేశము. మనము వెన్వెంటనే దాని నాచరణలో పెట్టుటకు పూనవలయును. విద్యార్థులు రాచకీయములకు వెలియై యుండజాలరు. వారికి మత మెట్టిదియో రాచకీయములును నట్టివే. రాచకీయములను మతమును వేఱుచేయ వీలుపడదు. నా ఈ అభిప్రాయము మీకు రుచింపక పోవచ్చును. అయినను నా హృదంతరాళముననున్న భావమును మీకు దెలిపెదగాక. దక్షిణాఫ్రికాలో నాకుగలిగిన అనుభవములను బట్టి నవనాగరికమెఱుగని మనదేశీయులు, అయినను ప్రాచీన ఋషిసత్తముల ప్రభావమునకును ఆ ఋషివరులు పలిపిన తపశ్చర్యకును వారసులైన మనదేశీయులు, ఆంగ్లభాషలో నొక్కమాటనైన నెఱుంగక పోయినను, నేటి నవనాగరికముం గూర్చి యిసుమంతయు తెలియనివారైనను, పూర్ణపురుషులై వెలయజాలిరి. దక్షిణాఫ్రికాలో నివసించు విద్యాశూన్యులును నిరక్షరాస్యులును నగు మనదేశీయులకు సాధ్యపడినది స్వదేశములోనున్న మీకును నాకును సుసాధ్యము కాగలదు. అందులకు మీరు అర్హు లగుదురుగాక. అందు నేను పాత్రుడ నగుదుగాక.

దేనికై మన మాతృభూమి ప్రఖ్యాతి బడసినదో, దేనిలో మన దేశము నిరుపమానమై పఱగునో అట్టి అధ్యాత్మికవిద్య పెదవుల ద్వార

మున ప్రసాదింప బడగలదని మీ రనుకొను నెడల చాల పొరబడినవా రగుదురు. ఏదో యొక కాలమున మన భారతదేశము ప్రపంచమునకు ప్రసాదింపగలదని నే నాకాంక్షించు మహోపదేశము పెదవులద్వారమున ప్రచారము చేయదగినదికాదు. నే నుపదేశములను, ఉపన్యాసములను చాలగా విని జీర్ణించుకొనియున్నాను. రెండుదినాలుగా అత్యాతురతతో మీ రాలకించుచున్న ఉపన్యాసములు ఆ రీతివి కావని చెప్పుచున్నాను. దాదాపుగా వాగాడంబరమున కాధారములు అంతరించిపోవు సమయ మాసన్నమైనది. నేత్రోత్సవములును చెవులకు పండుగులును తృప్తి గొలుప జాలవు. మన హృదయములు ప్రేరణ గాంచవలసిన అవసర మేతెంచినది. మన కాలుసేతులు చలనము సాగింపవలసిన తరుణ మాసన్నమైనది.

గడచిన అర్ధశతాబ్దమునుండి మన మాతృభాషలలో మనము విద్య గఱచి యుండినయెడల మన మేదశను స్థాపించి యుండెడివారమో! మన మిప్పటికి స్వతంత్ర భారతదేశమును బడసి యుండెడివారము! మన విద్యాధికులు తమ మాతృభూమిలో విదేశీయులై యుండుటకు మారుగా స్వజాతీయ హృదయమును ప్రకటింపగలుగువారై యుండెడివారు. వారు పేదలలోని నిరుపేదలతోగూడి పాటుపడుచుండెడివారు. వా రీ యర్ధశతాబ్దిలో సంపాదించినదానిని స్వజాతీయులకు పిత్రార్జిత సంపదగా నొసగి యుండెడివారు. ఈ నాడు మన సతులు సైతము మన యున్నతభావములను పంచుకొను భాగస్వాములు కాకుండు దురవస్థ తొలగెడిది. శ్రీ జగదీశ బోసుగారిని, ప్రఫుల్ల చంద్రరాయిగారిని చూడుడు. దీప్యమానములగు వారి పరిశోధనల గాంచుడు. వారి అన్వేషణా ఫలితములు మన ప్రజా సామాన్యమునకు సమస్త సంపదగా వెలయకుండుట లజ్జాకరముగాదా!

నేను కాశీ విశ్వనాథాలయములు దర్శించితిని. ఆ సందుగొందులలో తిరుగాడుతరిని ఇట్లు తలపోసితిని : పై నుండి ఏ దేశీయుడో యిచ్చటికి దిగివచ్చెనేని హిందువులముగా మన మెట్టివార మని అతడు భావించునో! అతడు మన నాక్షేపించుట న్యాయమేకాదా? ఈ మహాదేవు మందిరము మన శీలమునకు నిదర్శనమై యొప్పుటలేదా? ఇప్పట్టున నేను హిందువుడనుగా శంకించుచున్నాను. మన పవిత్ర దేవాలయ సమీపపు సందు

లిటుల ముఖుగుచుండుట సరియగునా ? ఆ చుట్టు పట్టుల యిండ్లు దారి తెన్ను లేక కట్టబడియున్నవి. సందుగొందుల త్రోవలు ఇరుకుగాను, వంకర టింకరగా నున్నవి. మన దేవాలయములు సయితము విశాలము గాను, వినిర్మలముగాను నుండనియెడల నిక మన స్వపరిపాలనము ఎటు లుండబోవునో ? ఇచ్ఛికముగ గాని బలాత్కారముగగాని బ్రిటిషు వారు మూటముల్లె కట్టుకొని రేపు భారతదేశమును విడిచిపోయిన తోడనే హఠాత్తుగా మన దేవ మందిరములు పవిత్రతకును, పరిశుద్ధతకును, ప్రశాంతతకును నిలయములై మారిపోగల్గునా ?

నిన్నటి దినమున మన సభ్యులలో అధ్యక్షత వహించిన మహా రాజాగారు భారత దేశపు దారిద్ర్యమును గురించి ప్రసంగించి యున్నారు. వైస్రాయిగారిచేత పునాదిరాయి వేయబడిన ఈ కాశీ విద్యా లయ మండపమున మన కేమి గోచరించినది ? యథార్థముగ అదొక మహాదివ్య దర్శనము ! ప్యారిసు నగరమునుండి వచ్చి దీనిని దర్శింప గోరు నే రతనాల వర్తకునికేని కండ్లకు గొప్ప విందుగొలుపజాలు ఆభరణ రాసుల దృశ్యమది ! ఈ దివ్యాలంకార సంశోభితులగు మహారాజులతో కోట్లాదిగనున్న నిరుపేదలను సరిపోల్చి చూడగోరుచున్నాను. ఈ ప్రభు సత్తములతో నే నిటులపలుక కుతూహలపడుచున్నాను. 'మీర లీ రత్నా లంకారముల తొలగించివేసి, విశాల భారతావనియందు వసించు మీ దేశ ప్రజలకొఱకు ఆ భాగ్యరాసులను ధర్మనిధిగా మీ రంగీకరింపరేని భారత మాతకు ముక్తి యనునది లేదు. చక్రవర్తియెడ యథార్థమగు రాజభక్తి చూపుకొఱకై మన నగలపెట్టెల నన్నింటిని గాలించి తీసి, ఆపాదమస్తకము తొడవుల ధరించి దర్శన మొసంగవలయు ననుట చక్రవర్తియొక్క గాని, హార్డింజి ప్రభునియొక్క గాని వాంఛకాదనుట నిస్సంశయము.'

స్వదేశసంస్థానమునగాని, బ్రిటిషు భారతదేశమున గాని ఏ నగరము నందైన రమ్య హర్మ్య మొకటి నిర్మాణ మైనటుల తెలిసినపుడెల్ల నేను తక్షణము అసూయాగ్రస్తుడనై 'అకట ! అదంతయు దరిద్రులగు కర్షకుల యొద్దనుండి గుంజుకొనిన ధనమే గదా !" అని వెఱగుపడుదును. దేశ ప్రజలలో నూటికి 75 వంతున వ్యవసాయదారులే. ఒక్క గడ్డిపోచ మొలచుతావున రెండు పోచలను మొలపించునది వారు. అట్టి వారి కష్ట

షలము నంతను మనము దాదాపుగా గుంజుకొనినను, ఇతరులను గుంజు కొన నిచ్చినను మనలో స్వపరిపాలనా దక్షత అంతగా గలదని చెప్ప లేము. ఈ కర్షకుల మూలముననే మన క్షేమైన ము క్తి రావలసియున్నది. లాయర్లుగాని, శ్రీమంతులగు ధరణీశులుగాని, డాక్టర్లుగాని మనకు స్వరాజ్యమును సంపాదించి పెట్టబోవుటలేదు.

మనదేశము ధనాఢ్యమగు కొఱకు పరదేశముల పీడించి శోషిల చేయుటకుగాని, మద్యవ్యాపారమును ప్రబలము చేయుటకుగాని వ ర్త కాధారములను విరవిగాపెంచుటకుగాని ఆశపడి దైవదూరమగు శీలమును, బలమును, ప్రతిష్ఠను సంపాదించి ఉద్ధతిబడయ నుంటి మనుకొనుడు. అపుడు మన మాతృదేశమునెడను దేవునియెడను భ క్తిప్రపూర్ణులమై మన మెట్లు ప్రవ ర్తించగలము; అట్టి సందర్భమున మనము దేశాభిమానమునే త్యజించి దైవభ క్తిపక్షమును వహింపవలసి యుండును. కాబట్టి మనము నిరంతరము దైవభ క్తిపరాయణులమై మెలగుటకే దీక్ష పూనవలయును. దేశభ క్తిగాని రాజభ క్తిగాని మఱే యితర భ క్తిగాని ఆ అర్థమున దైవ భ క్తికి విరుద్ధముగ గోచరించునెడల మనము వారిచే బంధింపబడదగదు. ఇవన్నియు భగవద్భ క్తికి అనుసరణముగా నున్నప్పుడే క ర్తవ్యము లగును. భగవద్భ క్తియు, రాజభ క్తియు, మానవజాతియెడ భ క్తియు అన్నియు అనుష్ఠానయోగ్యములు కాగలుగును.

సామాన్యభాషలో చెప్పుకొనునెడల మన కీనాడు అత్యవసరముగ కావలసినది దివ్యసరళమైన ధర్మానుర క్తి.

ఇది మనలో నిద్రాణమై యుండుటవలన మనము నిరంతరము భీతచేతస్కులమై జీవించుచున్నాము. పురోహితుని ఎదుటను, పండితుల యెదుటను మన మనస్సులలోనున్న భావములను తెలుప వెఱచు చున్నాము. అధికారుల ముోల భయకంపితులమై నిలుచుచున్నాము. అటుల వ ర్తించుటచేత వారి యెడలను, మనయెడలను కూడ అపచారము సలిపినవార మగుచున్నాము. నిర్భయత అనగా మర్యాదమీరి వ ర్తిం చుటగాని ఇతరుల భావములయెడ తిరస్కారభావము చూపుటగాని కాదు. మనమేదేని సుస్థిరమును యథార్థమును నగు ప్రయోజనమును సాధింప వలయుననిన మున్ముందుగా మనము నిర్భయత వడసి యుండవలయు

నని నా మనవి. మతధర్మ జ్ఞానము లేక దీనిని మనము సంపాదింప జాలము. మనము మాధవునకు వెఱతుమేని మానవునికి భయపడుట మానగలము. మన మేమిచేసినను ఏమి తలచినను మనలోపలనుండి కనిపెట్టుచు మనలను సదా అదుపులోనుంచి సవ్యమార్గమున నడుపు దైవము గలడని సత్యమును మనము గ్రహించిననాడు భగవంతుని భయముతప్ప లోకములో మఱెవ్వరినిగూర్చిన భయముగాని మనకుండ దనుట స్పష్టము. ప్రభులకెల్ల ప్రభుడౌ పరమేశ్వరునియెడ మనము పూను భక్తి ఏ ఇతరభక్తికైనను అతీతమై పఱగును. అది రాజభక్తికి వివేకయుతమగు పునాదిగా నుండగలదు.

## స్వదేశ వ్రతము

మన మీ అభయభావమును తగినంతగా సంపాదించిన యెడల స్వదేశీవ్రతము లేనిది మనకు మోక్షములేదని మనము గ్రహింప గలుగుదుము. స్వదేశీవ్రతమన వాటముగానున్న తఱిని పూనునదియు, వాటము తప్పిన విడచునదియు కాదు. నా అభిప్రాయములో స్వదేశీవ్రతమన మహా గంభీరమైనది. మత జీవితమునను రాజకీయ జీవనమునను మితవ్యయ సాధనమునను ఎల్లెడలను దానిని మీ రనుసరింప గోరెదను. అటులైన స్వదేశీ వస్త్రధారణము చేసిన మాత్రము చాలునని దాని కర్థము కాదు. దానిని సర్వకాలమును మనము అనుష్ఠింపవలయును. అటుల చేయుట ద్వేషభావముతోగాని మత్సరముతోగాని కాకూడదు. మన మాతృదేశమునెడల మననిధిని గుర్తించుటవలన మాత్రమే అటులచేయ వలెను. విదేశములలో తయారైన వస్త్రమును ధరించినపుడెల్ల మన స్వదేశీయదీక్ష భంగపడుటేగాక విదేశీయ వేషధారణమువలనకూడ అది భంగపడిపోవుచున్నది. మనము వస్త్రములను ధరించు పద్ధతికిని మన పరిసర పరిస్థితులకును పరస్పర సంబంధము గలదనుట తథ్యము. జాకెట్లు, ట్రౌజర్లు వేయుటకంటె అందచందములందు మన పద్ధతి వేయిరెట్లు శ్రేష్ఠతరమైనది. భారతీయుడు పైజమాను, దానిపై షర్టును, అపైని మెడపట్టీలేని వెస్కోటును వేసికొని వెనుకవ్రేలాడు పేలికలతో సౌందర్యముట్టిపడ గోచరించునని చెప్పలేము. మాననీయమగు మన పూర్వదశను గమనించుచు ప్రస్తుత మనుకరింపతగిన విధానమును మన స్వదేశీ

వ్రతము నేర్పుచున్నది. ప్రకాశ శక్తులకును తిమిరశక్తులకును మధ్య యూరపులో భీభత్సముగ సాగుచున్న పోరాటమే నవనాగరికమని వెల్లడి యగుచున్నది. ఇక మన పురాతన భారత సంస్కృతియో దైవీశక్తిని ప్రధానముగ ప్రకటించుచున్నది. నవనాగరికత ప్రధానముగా భౌతిక దృష్టితో పఱగునది. నవనాగరికత జడద్రవ్యశక్తులను కనిపట్టి ఉత్పత్తి మార్గముల నిరూపించుటకును, మారణ యంత్రజాలమును నిర్మించుటకు నుపయోగించుచుండ మన సంస్కృతి అధ్యాత్మధర్మముల వెదకి తెలిసి కొనగడంగుచున్నది. అపవాద మెఱుగని సత్యాచరణములును, బ్రహ్మ చర్యమును, సర్వభూతహిత వర్తనమును, అస్తేయమును, అపరిగ్రహ మును అనగా అనుదిన జీవనమున కత్యంతావసరమగు దానికన్నమించి సంగ్రహము చేయతగదను సూత్రమును మన శాస్త్రములు విధించు చున్నవి. ఇట్టి జీవనవిధానము అధ్యాత్మ సంసర్గమును లేనిది అసం భవము. అహింసాధర్మముమ పూర్ణముగ అచరణమున పెట్టుడని మన సంస్కృతి అసందిగ్ధముగ శాసించుచున్నది. ప్రవృత్తి పక్షమున అహింస యనగా వినిర్మలప్రేమ లేక దాక్షిణ్యాభావము అని అర్థము. పరిపూర్ణాహింసాచరణము ప్రపంచమును తన పాదాక్రాంతము చేసికొన గలదు. ప్రాణదానమునకు మించినదానము లేదని మన శాస్త్రములు ఘోషించుచున్నవి. మనపాలకుల ప్రాణములకు భద్రత చేకూర్పగలుగు నెడల వారితోడి మన బాంధవ్య మెట్లుండునో యూహించుకొనుడు. వారి చైదములయెడ మన అభిప్రాయ మెట్లున్నను వారి శరీరములను మన శరీరములతోపాటు పవిత్రములుగా పాటింతుమని వారు విశ్వసింప గలుగునెడల తత్క్షణమే వాతావరణము పరస్పర విశ్వాసముతో నిండిపో గలదు. ఈనాడు మనలను జీకాకు పఱచుచున్న సమస్య లనేకము సగౌరవముగను, న్యాయసమ్మతముగను పరిష్కార మగుటకు తగిన నిష్కాపట్యము ఉభయపక్షములందును నెలకొనును. అహింసాచరణ దీక్షను పాటించు బాధ్యత పరస్పరము నుండితీరవలయు నను నిర్బం ధము లేదనియు, ఐనను తుదిదశయందు పరస్పర ప్రేమబంధము స్వభావసిద్ధముగనే తనంతట వచ్చితీరుననియు విశ్వాసము మనకుండ వలయును. ప్రపంచమునకు మనమొక దివ్యసందేశము నొసగవలసి యున్నామని అనేకులు నమ్ముచున్నారు. నాకును అట్టివిశ్వాసముగలదు.

'మీరు చెప్పతగిన దంతయు చెప్పితిరి. ఎవరును మీమాట చెవిని బెట్టుటలేదు. ఖద్దరును గుఱించిన మీ ప్రసంగములను మానరాదా ?' అని కొందఱు నాకు సలహా నిడుచున్నారు. మరణము కంటెను దుర్భరములగు ఆపదలు తన్నెదుర్కొనినను, భగవన్నామ స్మరణను విడచి యెఱుగని ప్రహ్లాదుని ఆదర్శము నా యెదుటనుండగా, నా యభిమాన మంత్రమగు దీనిని నేనేల విడువ వలయును ? మఱియు నే నింక నట్టి ఘోర బాధల పాలుకాలేదే ! నా మాతృదేశము నా చెవులలో వినిపించుచున్న ఈ ఏకైకమంత్రమును నే నెటుల విడనాడగలను ? రాజుల నుండియే మనకొఱకై మాలవ్యాజీ పండితుడు లక్షలకు లక్షలుగా ధనమును ప్రోగుచేసియున్నాడు. ఆ సొమ్ము పైకిచూడ సర్వసంపన్నులగు ప్రభువులనుండి వచ్చుచున్నట్లు గోచరించుచున్నను అయ్యవి కోట్లకొలది పేదలనుండియే నిజముగా లభించుచున్నవి. యూరపునందువలెగాక మన దేశమున శ్రీమంతులు గ్రామవాసులను నెట్టివేసి, వారినుండి తమ సంపదలను కూర్చుకొనుచున్నారు. మన గ్రామవాసులలో ననేకులు దినమున కొక్కసారియైన కడుపునిండ తిండిలేనివారుగ నున్నారు. మీరు నేడు పొందుచున్న ఈ విద్యలకొఱకు కడుపు కాలుచున్న ఆ గ్రామవాసులు ధనము నొసంగుచున్నారు. వారికి మాత్ర మీ విద్యలభించు నవకాశము లేదు. పేదవారలకు సైతము లభ్యము గాజాలని విద్యలను మీరు సంగ్రహింప నిరాకరించుట మీ విధియై యున్నది. అటుల చేయుడని ఈ నాడు నేను కోరుటలేదు. ఆ పేదలకొఱకై ప్రతిదానసూచనగా వారిని గూర్చి చిన్న యజ్ఞము చేయుడని మాత్రము మిమ్ము కోరుచున్నాను. ఏమందురా, ఏ యజ్ఞమును చేయకుండ తిండితినువాడు దొంగ యగుచున్నాడని గీత మనకు బోధించుచున్నది. ఈ యుద్ధకాలమున నేడు బ్రిటిషు పౌరజనులు యజ్ఞముచేయ కోరబడుచున్నారు. ప్రతి కుటుంబమువారును తమ దొడ్లలో బంగాళాదుంపలు పండించుటయు, కొంత నేతపని చేయుటయే ఆ యజ్ఞము. ఈ కాలమున రాటము వడుకుటే మనకు యజ్ఞము. రేయింబవళ్ళు దీనిం గూర్చి నేను విన్నపములు చేయుచునే యుందును. ఈనా డింక దానింగూర్చి ప్రసంగింపను. భారత దేశపు దరిద్రజనుల మొఱ మీ హృదయముల కఱగించునేని, మీ రీ రేయి మీ పంచులను ఖాళీచేసి, రేపు కృపాళినీ ఖద్దరునిలయముపై బడి అక్కడ

మున్న సరకునంతను కొనివేయు డని కోరుచున్నాను. మాలవ్యాజీ పండితుడు యాచనకళను చక్కగ నభ్యసించినవాడు. నేను దానిని వాని నుండి నేర్చుకొంటిని. ఆయన రాకొమరులనుండి కానుకలను పరిగ్రహించుటలో ప్రత్యేక కౌశలమును చూపుచుండ, నేను పేదవారి జేబులను వారికన్న దరిద్రులగు ప్రజలకొఱకు ఖాళీచేయించుటలో లజ్జను విడనాడుట నేర్చుకొన్నాను.

మాలవ్యాజీ పండితుడు మీ కొఱకై యాచించి లక్షల కొలదిగ ప్రోగుచేయుటలోను, మహారాజ భవనముల బోలు ఈ మందిరముల నిర్మించుటలోను వారి ఏకైక లక్ష్య మేమన, మీ మాతృదేశమును సేవించు నిమిత్తము ఆరోగ్యవంతులును, బలసంపన్నులును నగు పౌరులనుగ తయారుచేసి వినిర్మల తేజోవంతములగు మాణిక్యములనుగ మీ మాతృదేశమునకు మి మ్మర్పించుటయే. నేడు పడమటి దిశనుండి వీచుచున్న దుర్గంధవాయువులచే నెగుఱగొట్టబడిపోవుటకు మీరు పాల్పడితిరా, ఆయన సంకల్పము భగ్నమైన ట్లగును. ఇచ్చటి పద్ధతు లన్నియు సామాన్యముగా యూరపువారి ఆమోదముతో నడచుచున్నవని నే నను కొనుటలేదు. ఆ విషవ్యాప్తిని నిరోధించుటకై పోరాడు మిత్రులు కొలది మందియైనను యూరపునం దున్నారు. సకాలమున మీరు మేల్కొనరేని, ఆదుర్ణయ తరంగము క్రమేణ బలముచేకూర్చుకొని మిమ్మావరించి దిగ్రమింగి వేయగలదు.

శ్రీ మాలవ్యాజీ పండితుడు నెలకొల్పిన ఈ సంస్థయొక్క విలువను, మహనీయములగు ఈ రమ్యహర్మ్యములను బట్టియు, అవి ఆక్రమించు వేయిన్ని మూఁడువందల ఎకరాల విస్తీర్ణమును బట్టియు గాక, మీ రెట్టివారుగ తయారగుచున్నారను విషయమునుబట్టి గణితము వేయబడును. మీ కర్తవ్యమగు పవిత్రశీలమును క్రియారూపమున చూపనెంచుచో, రాటముపై నూలు వడుకుటకన్న యోగ్యతరమార్గము లేదు. కొలదిమంది ధనాఢ్యుల భిన్నప్రతిరూపు లగు కోట్లాది బీదజనుల ప్రతినిధియని తెలుపును గాన, భగవంతుని అనంత నామములలో దరిద్రనారాయణు డను పేరు మిక్కిలి పవిత్రవంతమై పఱగుచున్నది. ఏదోతీరున దరిద్ర ప్రజాలోకముతో ఏకీభావముచూపు నుపాయము నేను సూచించిన త్రివిధమార్గ

ములలోనిదగు రాట్నచక్రము యొక్క సందేశమును మీరు వ్యాపింప చేయ గడంగుటయే. నూలువడుకుటలో నేర్పరు లగుటమూలమునను, ఖద్దరునే ధరించుటచేతను, ధనరూప మగు విరాళముల నొసంగుటవల నను ఆ సందేశమును మీరు ప్రచారము కావించినవా రగుదురు. శ్రీ మాలవ్యాజీ పండితుడు మీకు సమకూర్చియున్న దివ్యావకాశములకు, కోట్లకొలంది జనులు పాత్రులు కాజాలకుండిరని జ్ఞప్తినుంచుకొనుడు. అట్టి మీ సోదరీ సోదరులకు మీరొసగు ప్రతిదానమేమి ? శ్రీ మాలవ్యాజీ పండితుడు ఈ విశ్వవిద్యాలయోద్యమమును సంకల్పించిన తరిని ఆయన హృదయములో ఈ సమస్యయున్నది. మీ కొసగబడు శిక్షణమున కర్హ మగు తీరున మీరు వర్తింతు రనెడు ఆశయముతో ఆయన ఈ ఉద్య మము చేపట్టెనని దృఢముగ నమ్ముడు.

## విద్యార్థులారా

సామాన్యపు విద్యాలయములకును, కళాశాలలకును పోవువారు ఉద్యోగములకొఱకు వాని నాశ్రయించుచున్నారు. పరీక్షలకొఱకు పెక్కు గ్రంథములను చదువుచున్నారు. పరీక్షాభవనములనుండి వెలువడిన క్షణముననే తమ గ్రంథములను, తాము వానినుండి నేర్చినదానినిగూడ మఱచుచున్నారు. చాలమంది పట్టణములకొఱకై శ్రద్ధవహించు చున్నారే గాని విజ్ఞానము కొఱకుకాదు. హిందీలో విజయపత్రముల బడసినవా రుద్యోగముల కొఱకై చదివినవారు కారు. హిందీప్రచారకసంస్థ ఉద్యోగ మును సంపాదించుటలో మీకు తోడ్పడుట కేర్పడినది కాదు.

## హిందీ - ఇంగ్లీషు

ఈనాడు విజయపత్రముల నందినవారిలో అధికసంఖ్యాకులు స్త్రీలై యుండుట నా హృదయమున కెంతయు ఆనందముగ నున్నది. భారతదేశమునకును, హిందీప్రచారమునకును ఇదొక శుభసూచకము. ఏమన, భారతదేశమోక్షము స్త్రీజనముయొక్క త్యాగముమీదను, విజ్ఞా నముమీదను ఆధారపడియున్న దని నాకు గట్టి నమ్మకము గలదు. స్త్రీల సభలలో నే నుపన్యాసము లిచ్చునపుడు ప్రాచీనకాలపు మన వీర పురుషుల గూర్చియు, వీరవనితల గూర్చియు, దేవీదేవతల గూర్చియు

సంభాషించునపుడు స్త్రీలనే ముందుగా పేనుర్కొచుందు మను సంగతిని నొక్కి చెప్పుచుందును. సీతారాము, రాధాకృష్ణ అందుమేగాని రామసీత, కృష్ణా రాధా అనుటలేదు. ఈ ఆచారమునకు అర్థము లేకపోలేదు.

మున్ను స్త్రీలు మన్ననపాత్రలై యుండిరి. వారి చేతలకును, వారి ప్రయోజనములకును విశేష ప్రభావముకలదు. ఆ యాచారమును అక్షరాల భక్తిపూర్వకముగ అనుసరించుదుముగాక.

హిందీగాని, హిందూస్థానిగాని మాత్రమే మనకు సామాన్య జాతీయ భాషగా నుండగలదనుటకు కొన్ని కారణములను పేర్కొందును. మీరు కర్ణాటమువంటి ఒకే ప్రదేశమున నివసించుచు, ఆ హద్దులదాటి సంబంధము కలిగించుకొనని యెడల మీరు కర్ణాటకభాషను నేర్చినం జాలును. కాని మీ గ్రామములలో సైతము ఎవరి వైఖరినైనను చూడుడు. మీ దృష్టియు దృక్పథమును విశాలతరములై యున్నవనుట మీకు తెలియవచ్చును. మీ సంభాషణము లిప్పుడు కర్ణాటదేశముతో కట్టుబడియుండుట లేదు. అవి భారతదేశమున కంతటికిని సంబంధించి సాగుచున్నవి. మీ కభిరుచి గొలుపు నుదంతములు కర్ణాటమును దాటిపోవుచుండును. ఆ యభిరుచులు సామాన్య భాషయను ఉపాధి లేకుండ దూరము సాగిపోజాలవు. కర్ణాటప్రాంత వాసి సింధు ప్రాంతీయులతోడను, ప్రయాగ ప్రాంతీయునితోడను వ్యవహరింపజాలు టెట్లు ? అందుకు ఇంగ్లీషుభాష ఉపయోగపడునని కొందఱు తలంచెదువారు. ఇంకను అటుల తలచువారు ఉండనోపును. మనలోని విద్యాధికులౌ కొన్నివేలమంది సందర్భము ననే యగుచో, ఆంగ్లభాష తప్పక తోడ్పడగలదు. కాని అంతమాత్రముతో మీలో నెవరును తృప్తిపడియుండజాల రనుట నిశ్చయము. వేర్వేరు ప్రాంతములవారు లక్షలాది ప్రజలు పరస్పరము కలిసి వ్యవహరింపవలయు నని మీరును నేనును ఆకాంక్షించుచున్నాము. అట్టి దీ నాడు కొలది పాటిగా సాధ్యమైనను, తరములకొలది కాలము ఆంగ్లభాష ద్వారమున సాగదనుట స్పష్టమే కావున అందఱును ఇంగ్లీషు నేర్చుకొనవలయు ననుటకు హేతువు కాన్పించుట లేదు. మఱియు జీవనోపాధి గడించుకొనుటకును ఆదొక సాధన మగుటలేదు. అందుకొఱకగు దాని విలువ హెచ్చుమంది ఇంగ్లీషు నేర్చుకొనినకొలదిని, క్రమేణ తగ్గిపోవుచున్నది.

ఇక ఆంగ్లమును పఠించుటలోగల కష్టములు హిందీనిగాని, హిందూస్థానీని గాని నేర్చునపుడు ప్రత్యక్ష మగుటలేదు. నా హిందీ ఉపన్యాసమును కర్ణాటక భాషలోనికి అనువాదము చేయబడుచుండ, కర్ణాటు లెందరో వినియున్నారు. ఆ అనువాదములో ఉపయోగింపబడిన ప్రేమ, ప్రేమి, సంఘ, సభ, అధ్యక్ష, పద, అనంతభక్తి, స్వాగత, సమ్మేళన మొదలగు మాటలను మార్చకుండగనే సూరెల్లఋ గ్రహింపగలిగి యున్నారు. ఈ శబ్దము లన్నియు హిందీభాషకును కర్ణాటక భాషకును సామాన్య భాషా పదములే. కాని ఎవరేని వీనిని ఆంగ్లభాషలో అనుపదింప దలచిన యెడల, ఈ పదములలో వేనినైనను, మార్పులేకుండ ఆ అనువాదమున ప్రయోగింపజాలి యుందురా ? అసాధ్యము. ఈ పదములలో ప్రతిదాని ఆంగ్లభాషాంతరీకరణము వినువారికి క్రొత్తదై తోచక తప్పదు. కాబట్టి మన కర్ణాట సోదరులు హిందీనేర్చుట కష్టమనునెడల నాకు విస్మయముతోచును. మీలో ఆంగ్లము నెఱుగనివారు ఆంగ్లభాష నభ్యసించుటకు పూనుదురేని, హిందీని నేర్చునప్పటివలె, దానికై దినమునకు నాలుగు గంటలు వినియోగించి, ఆ ఆంగ్లభాషను నెల దినములలో నేర్వగల్గుదురా ?

పూర్వకాలమున దక్షిణాదివారును, ఉత్తరాదివారును సంస్కృత భాషామూలమున పరస్పరము వ్యవహారవిషయములను తెలుపుకొనుచుండెడివా రనుట చరిత్రప్రసిద్ధము. ఈనాడు సయితము దక్షిణాది పండితులు ఉత్తరాది పండితులలో సంస్కృతమున సంభాషింప జాలుచున్నారు.

ఆయా మనదేశీయభాషల కుండు భేదము వ్యాకరణ సంబంధమైనదియే. అందఱమును విశేషముగా సంస్కృత పదములను వాడుక చేయుచునే యుందుము.

ఇక ముసల్మానుమిత్రులసంగతి విచారింతము. వా రేప్రాంతమున వసింతురో ఆ ప్రాంతీయ భాషను ఉర్దుతోపాటు సహజముగానే నేర్చుకొనుచుందురు. హిందీ హిందూస్థానీ ఉర్దూభాషలమధ్య భేదమేలేదు. వ్యాకరణభేదమును లేదు. లిపిలోమాత్రము కొంత వ్యత్యాసము కలదు.

లిపిభేదమును సులభముగా పరిష్కరింపగలుగుదుము.

ఇంగ్లీషుభాష మనకు సామాన్యభాష కాజాలదని తెలిపియున్నాను. ఇంగ్లీషుభాష యనిన నాకు ద్వేషములేదు. జాతికి జాతికిమధ్య జరుగు వ్యవహార నిర్వహణమునకును, పాశ్చాత్యుల శాస్త్రముల నేర్చుటకును ఇంగ్లీషుభాషా జ్ఞానము కొందఱు విద్యార్థికులకు అవసరమే యగును. కాని ఆ భాషకు అర్హతలేని స్థానమును దానికొసంగు ప్రయత్నము సాగించుట చూచునపుడు మాత్రము నాకు బాధగా నుండును. అట్టి ప్రయత్నములు నిష్ఫలములుకాక తప్పదు. ప్రతిదియు దాని అర్హా స్థానమున మాత్రమే ప్రకాశింపగలుగును.

ఒక భయభ్రాంతిని మీ మనస్సులనుండి పారద్రోలవలసియున్నది. ప్రాంతీయ మాతృభాషకు మారుగా హిందీని నేర్వవచ్చునా? అది మాతృ భాషను నెట్టివేసి, దానిస్థానమును ఆక్రమింప గలుగునా? అను సందే హము గలదు. హిందీని ప్రచారములోనికి తెచ్చినకొలదియు ప్రాంతీయ భాషలకు హెచ్చుప్రోత్సాహము లభించునని నా వాదము. వివిధ ప్రాంత ములలో నాకుగల అనుభవముతో మాట్లాడుచున్నాను. ప్రాంతీయ భాషల ప్రయోజనము వాని సమర్థత వృద్ధిగాంచ గలుగుచున్నవి.

అజ్ఞానము తోడను, మూర్ఖపు పట్టుదలతోడను, ఆంగ్ల విద్యా వ్యామో హముతోడను మనము పోరాడినగాని స్వరాజ్యయుద్ధమున మనకు విజ యము చేకూరునటుల లేదు. ఈ ఆంగ్లవిద్యాపద్ధతి దుర్నివారణమగు అనర్థముగా నున్నది. నా శక్తికొలదిని ఈ విధానమును రూపుమాపప్రయ త్నింప గోరెదను. ఈ ఆంగ్లవిద్యా ప్రణాళికవలన ఇంతవఱకు ఏపాటి ప్రయోజనము గాని కలిగినదని చెప్పజాలకున్నాను. మనకు చేకూరిన ప్రయోజనములుగా వక్కాణింపబడునవి, మన కీ విధానమున్నను దానిని తప్పించుకొన గలిగిన ప్రయోజనములే కాని, ఈ విధానము మూలమున ప్రాప్తించినవికావు. ఆంగ్లేయులు భారతదేశమునకు వచ్చియే యుండలే దనుకొనుడు. అప్పుడును ఇతర ప్రపంచ ప్రజలతోపాటు మనము పురోభి వృద్ధి గాంచియే యుండెడివారము. మొగలుసామ్రాజ్యము క్రిందనే యుండి యున్ననుకూడ, మనలో చాలమంది ఆంగ్లభాషను నేర్చుకొనియే యుందురు. ఆ వాఙ్మయమును గ్రహించియే యుండెడివారు. వివేక పూర్వకమగు ఆంగ్లవాఙ్మయ వినియోగమునకు మన ప్రస్తుతవిధానము

సాయపడునదిగాలేదు. అది మనలను బానిసీయులుగా చేసివైచుచున్నది. కొందఱు తిలకు, రామమోహనరాయలను, నన్నును నిదర్శనముగా జూపగడంగుచున్నారు. నా విషయము విడిచివేయుడు; నే నత్యల్పుడను.

తిలకు రామమోహనరాయ లనువారలకే ఆంగ్లవిద్యా సంపర్కము లేక యుండినచో, వారింకను ఎంతయో ప్రతిభాశాలురై ప్రకాశించెడివారు. ఆంగ్లవిద్యను ఇలువేల్పుగ వర్ణించు టన నాకు గిట్టదు. ఐనను నేను ఇంగ్లీషు వాఙ్మయమును ద్వేషించువాడను కాను. నేను ఆంగ్ల పరిపాలనా విధానమును తొలగింపగోరుపట్లను, ఇంగ్లీషుభాషనే నాశముగావింప వాంఛించువాడను కాను.

భారతజాతీయ వాదిగానుండియే, నే నా ఇంగ్లీషుభాషను నేర్చుకొనగోరుదును. నా మాట దూరముగ నుంచుడు. తిలకు రామమోహనరాయలు సైతము చైతన్యుడు, కబీరు, నానకు మున్నగు వారితో పోల్చిచూచిన యెడల స్వల్పులై చూపట్టుదురు. ఈ మహనీయుల యెదుట తిలకు రామమోహనరాయలుకూడ అల్పులే. శ్రీ శంకరు డొక్కడు సాధింపగలిగిన దానిని ఆంగ్లభాషను నేర్చిన మన బృందమెల్ల కూడినను సాధింపజాలము. ఇట్టి నిదర్శనముల నెన్నిటినో చూపగలుగుదును. శ్రీ గురు గోవిందసింహుడు ఆంగ్లవిద్య గఱచిన ధీవరుడేనా ?

## త్యాగసాహసములు

త్యాగసాహసముల పరిగణించుచో. విశిష్ట సంప్రదాయ నిర్మాతయగు నానకునకు సరివచ్చు ఆంగ్లభాషావిశారదు డగు నొక్క వ్యక్తినైనను పేర్కొనగలుగుదుమా ? రామమోహనరాయలు, దిలీపసింహునిబోలు ఒక్క శూరునైనను సృష్టింప జాలినాడా ? తిలకు, రామమోహనరాయలన నా కెంతయో పూజ్యభావము కలదుసుడి. ఈ తిలకు, రామమోహనరాయలు ఆంగ్లవిద్యనే గఱచియుండని యెడల, తమకు సహజమౌ శిక్షణమునే బడసియుండినచో చైతన్యునివలె వారును మహత్కార్యముల సలిపి యుండెడివారు. చైతన్యునిబోలు సుధీమణుల జాతి మనకు తిరిగి లభ్యము కావలయునన్నచో, ఈ ఇంగ్లీషు విద్య నభ్యసించిన వారినుండి జనింపజాలదు. హిందూస్థానీ సంస్కృతభాషలను నేను నేర్చి

యుండని కారణమున ఎటువంటి సంపదరాసులను పోగొట్టుకొంటినో నాకు తెలియును. విద్య యొక్క విలువను దానియొక్క యథార్థమగు ప్రయోజనమును బట్టి గణనచేయుడని మిమ్ము కోరుచున్నాను. ఆంగ్ల విద్య మనలను నిర్వీర్యులగావించినది. మన బుద్ధిని కుంచించినది. ఈ విద్యను గఱపు విధానము మనలను నిష్పౌరుషుల నొనర్చినది. స్వేచ్ఛారశ్మిలో విహరింప వాంఛించు మనలను బానిసలు గావించు నీ పద్ధతి నిస్త్రాణుల జేసివైచినది. బ్రిటిషువారి రాకకు ముందున్న కాలము దాస్యయుగము కాదు. మొగలుల పరిపాలనము క్రిందనుగూడ, ఒక రీతి స్వరాజ్యము మన కుండెడిదియే. అక్బరుని కాలమున ప్రతాపుడు పుట్టుట సంభవమైనది. ఔరంగజేబుని కాలమున శివాజీ ప్రభవింప గలిగినాడు. ఒకటిన్నర శతాబ్ది గడిచినదిగా; ఒక్క ప్రతాపుడో ఒక్క శివాజీయో తల జూపజాలెనా ?

మన సంస్థానాధీశ్వరు లున్నారు. వారిలో ప్రతియొక్కరును పొలిటికలు ఏజంటుమ్రోల మోకరించి దాస్యమును అంగీకరించుచున్నారు. ఈ స్వదేశ సంస్థానాధిపతుల గుఱించి మొఱలిడు యువకుల గాంచిన నాకు వారిపై జాలి కలుగుచుండును. వారు ద్విగుణముగ పీడింపబడుచున్నారు. వారిని స్వదేశసంస్థాన ప్రభువే బాధించినను, నే నాపీడను బ్రిటిషువిజేతకు ఆరోపింతునుగాని, సంస్థానాధీశునకు కాదు. వారటువంటి దాస్యస్వామ్యపద్ధతికి అలవాటుపడిపోయినారు. కాబట్టి ఈ పెనుభూతము నుండి పారిపోం డనుటే మీ కందఱకును నా మనవి. మీరిల్లిల్లు తిరిగి తిరిగి తిరిప మెత్తుకోవలసివచ్చినను లెక్కచేయకుడు. బానిసతనమున మునిగి మనుటకంటె బిచ్చ మెత్తుకొనుచు చచ్చుటయు మేలే. ఈ క్షణమున బ్రిటిషువారు మనల వదలిపోయినను, నేనొక్క కన్నీటిబొట్టునైనను విడువను, సేవకులవలెను సములలీలను నెయ్యులవడువునను మనకు సాయపడుడని నేను వారిని కోరుచున్నాను. మన సమ్మతిలేకుండ వారు మనపైని ప్రభుత్వము చేయుట నే నొల్లను.

ఆకాశవిమానములను, సైన్యములను, నావికాబలములను వారు ప్రయోగింతురుగాక. మన సమ్మతిని మాత్రము వారు పడయజాలరు. భారతభూమి బందిపోటువాండ్ర కెఱయగుగాక, అప్పుడును మీరు మీ

సమర్థతను గుర్తింతురుగాక. మీ స్వధర్మమును మీరు నిర్వహింపుడు. స్వతంత్రభారతీయులుగా మరణించుటకంటె మాన్యతరమైనదేముండును?

## ఆంగ్లభాషా వ్యామోహము

నేడీ ఆంగ్లభాష దానికిగల వ్యాపారపు విలువనుబట్టియు, రాజకీయ ప్రయోజనమును బట్టియు నేర్చుకొనబడుచున్నది. ప్రస్తుత పరిస్థితుల కనుగుణముగ, ఆంగ్లభాషరానిది దొరతనపు టుద్యోగము దొరకదని మన బాలకులు తలంచుట సమంజసమేకదా. వివాహమున కుపకరించు యోగ్యతాపత్రములకొఱకై బాలికలకును ఆంగ్లభాష నేర్పబడుచున్నది. ఆంగ్లేయులతో ఆంగ్లభాషలో మాటలాడు నుబలాటము గలిగి స్త్రీలు ఇంగ్లీషు నేర్చుకొనగోరిన సందర్భములు నేనెఱుగుదును. తమ భార్యలు తమతోడను, తమ మిత్రులతోడను ఇంగ్లీషులో ముచ్చటలాడ జాలమికి విచారము చెందు భర్తలను నే నెఱుగుదును.

ఆంగ్లభాషను స్వగృహములలో మాతృభాషగా వాడుకొనుచుండిన కుటుంబముల నెఱుంగుదును. ఆంగ్లభాషాజ్ఞానములేనిది భారతదేశమునకు స్వాతంత్ర్యప్రాప్తి అసంభవమేనని భావించు వందలకొలది యువకులు గలరు. అనేక సందర్భములలో విద్యయనిననే ఆంగ్లభాషాజ్ఞానమని తంలచునంతగా ఈ జాడ్యము సంఘమున వ్యాపించిపోయినది. ఇవన్నియు మన బానిసతనమునకును అథఃపతనమునకు నా దృష్టిలో నిదర్శనములుగ నున్నవి. దేశభాషలకు పోషణ కఱవై అణగారిపోవుట చూడ నా కెంతయు దుర్భరముగ నున్నది. బిడ్డలకు ఉత్తరములువ్రాయు తలిదండ్రులును, భర్తలకు ఉత్తరములువ్రాయు భార్యలును తమ మాతృభాషలలోగాకుండ ఇంగ్లీషుభాషలో వ్రాయుట చూచి నేను సహింపజాలక పోవుచున్నాను. నలువైపుల నా కొంపను గోడలతో మూసిపెట్టి కిటికీలను చెత్తచెదారములతో గట్టిగ క్రుక్కివేయుట నాకు హితవు కాజాలదు. వివిధ దేశముల సంస్కృతి యథేచ్ఛగా వచ్చి నా గృహముచుట్టును ప్రసరించుట నాకు వాంఛనీయమే. అయినను నన్నది నెట్టి పడద్రోయుటను సహింపజాలను.

హిందూస్థానీని గుఱించి నే నొసగు ప్రోత్సాహముతోపాటు నీచ పదవినుండి సమత్వదశకు అనగా పరప్రభుత్వ దాస్యమునుండి స్వరాజ్య ప్రాప్తికి నిస్సహాయదశనుండి స్వయంసహాయ స్థితికిని చేరుకొను ప్రయత్నము సాగించు నీ సమయమున విద్యార్థులు ఆంగ్ల విద్యాభ్యాసమును మానవలయునని నా సలహా. మనము స్వరాజ్యమును సాధింప వాంఛింతుమేని దానిని ప్రోత్సహింపజాలనట్టియు, దాని గతిని మందగింప జేయునట్టియు దేనినిగాని మనము త్యజింపవలయును. ఇప్పుడు ఇంగ్లీషు విద్యార్జనము మన గమ్యమును చేరుటలో మన గమనమును పెంపు చేయజాలదు. మఱియు దానిని వెనుకకే నెట్టును. ఈ రెండవ ఆపద చాలమంది విషయములో యథార్థముగ మూపట్టుచునే యున్నది. ఆంగ్ల భాష పదగానము మన చెవుల సోకకుండ అది మన పెదవులందు శబ్దించనిది స్వాతంత్ర్య భావప్రేరితులము కానే కాజాలమని కొందఱి విశ్వాసము. ఇదొక మహావ్యామోహము. ఈ మాటే తథ్యమగు నెడల మనకు స్వరాజ్యమనునది గ్రీకు దేవరాజ్య మంతదవ్వున నుండునన వచ్చును. నానాజాతుల మధ్య జరుగు వ్యాపారములకు పనికివచ్చు భాష ఆంగ్లభాష. రాజ్యతంత్రమున కనువగుభాష ఆంగ్లభాష. అందు చాల సాహిత్య రూపసంపద యున్నది. పాశ్చాత్యుల భావములను, సంస్కృతిని గ్రహించుట కది తోడ్పడును. కావున మనలో కొందఱు ఇంగ్లీషు భాషను నేర్చు టావశ్యకమే.

భాషాభిరుచిగల యువకులును, యువతులును తమ కిష్టము వచ్చినంతగా ఆంగ్లభాషను, ఇంక నితర ప్రపంచ భాషలను ఎన్నేని నేర్చుకొనుట నా కిష్టమే. ఆ పిమ్మట వారు జగదీశ చంద్రబోసువలెను, ప్రఫుల్ల చంద్రరాయలవలెను, రవీంద్రనాథ ఠాకూరువలెను తమ విజ్ఞాన ఫలితములను భారతభూమికిని ప్రపంచమునకును పంచి ఇడుదురుగాక యని ఆకాంక్షింతును. ఐనను భారతీయులలో ఒక్క పురుషుడుగాని స్త్రీ గాని తన మాతృభాషను మఱచుటయు, ఉపేక్షించుటయు, తన మహోన్నత భావములను తనతల్లి భాషలో భావన చేయజాలకపోవుటయు, ప్రకటింపజాలక పోవుటయు నేను సహింపజాలను. నా మతము జైలుఖానా మతము కాదు. ఈశ్వరసృష్టిలోని అత్యంత దీనునకు సయితము అందు తావుగలదు. జాతిమత వర్ణముల పురస్కరించుకొని చెలరేగు

అహంకారమునకును, పరజన ధిక్కారమునకును అందెంతమాత్రమును తావులేదు.

## రాజకీయములు - శీలము

మనము నడుపునది ఆత్మపారిశుద్ధ్యమున కేర్పడిన యుద్యమము. నీతి వర్తనమునకు రాజకీయములతో జోక్యము లేదని తలచువారు కొంద ఱున్నారు. మన నాయకుల నీతివర్తనముతో మనకు ప్రమేయమే లేదని వారి వాదన. యూరపు అమెరికా ఖండము లందలి ప్రజాస్వామికసంస్థలందు రాజకీయములకును, నీతివర్తనమునకును సంబంధముండవలయు నను భావ మేమాత్రమును లేకుండగనే నడుపబడుచున్నది. దుర్వినీతులు తఱచుగా మనీషావంతులై పఱగుట చూచుచున్నాము. వారు తమ శేముషివలననే వ్యవహారములను చక్కబెట్టగలుగుచున్నారు. నిజమే. మనము సైతము అదే తీరున మన రాజకీయ సంస్థలను నడిపియున్నాము. కాంగ్రెసు నాయకులయొక్క గాని, ప్రతినిధులయొక్కగాని నైతిక వర్తనముతో జోక్యము పెట్టుకొని యుండలేదు. కాని 1920 వ సంవత్సరములో పూర్తిగా క్రొత్త మార్గము త్రొక్కియున్నాము. సత్యము, అహింస అనునవియే గమ్యమును చేరుటకు కాంగ్రెసునకు మధ్యసాధనము లని ప్రకటించియున్నాము. రాజకీయ జీవనమున సైతము ఆత్మపారిశుధ్యము అవసరమని చాటియున్నాము.

నీతి వర్తనముతో రాచకీయములకు ఏలాటి సంబంధము నుండరాదని రహస్యముగ నమ్మువారు చాలమంది యుండనగును. అట్టి భావమున కీనాడును బహిరంగ మగు ప్రతివాదన బయలుదేరియుండలేదు. కావుననే మన పురోగమనము మందముగ నున్నది. కొన్నిపట్ల నిలిచిపోయినదికూడను. 1920 వ సంవత్సరమునాటి ధర్మసూత్రమును మన మాచరణలోపెట్టియుండిన యెడల ఈ ప్రస్తుతస్థితికి వచ్చుటకు సైతము తొమ్మిది దీర్ఘవత్సరములు పట్టియుండెడిది కాదు.

మన ధర్మసూత్రముయొక్క పరివ్యాప్తిని గమనింపు డని కోరుచున్నాను. సత్యము, దౌర్జన్యరాహిత్యము అనునవి కాంగ్రెసుయొక్క తంత్రవిధానములోనివే గాని ధర్మసూత్రాంగములు కావని మీ రెంచు నెడల నా స్థితి ఎట్లుండునో నాకు తెలియుటలేదు. మీరు వానిని వ్యక్తి

పరమగు ధర్మసూత్రములుగ గ్రహించునెడల నేను వానినిగూర్చి వివరణము చేయనక్కఱ యుండదు.

నిర్మాణ కార్యక్రమము 'సత్యాహింస' లనెడు ధర్మసూత్రమునందు పుట్టినదియే. దానియందలి ప్రతియంశమును పరిశీలింతుముగాక. హిందువు ముసల్మానునెడను, ముసల్మానుడు హిందువునెడను దౌర్జన్యభావము పూనునంతకాలము హిందూ మహమ్మదీయ సఖ్యత అసంభవమగును. లాహోరులో సాంఘిక సమస్యపై చేయబడిన తీర్మానము ఆ సూత్రానుగుణ్యముగనే చేయబడినది. శిఖ్కులు కేవలము న్యాయమునే కోరియున్నారు. మీరు తెలిసికొనియే యుందురు. ఆ తీర్మానము అంతకంటెను ఒక్క యడుగు ముందునకే పోయినది. ఒక్క శిఖ్కుల కొఱకేగాక అది సకల సంఘముల కొఱకును ఉద్దేశింపబడియున్నది.

అస్పృశ్యతా నివారణ విషయమును విచారించుదము. ఈ సమస్యను గూర్చి ప్రసంగించునపుడు కొందఱు శారీరకముగ అంటరానితనమును గుఱించి ఆలోచించుచున్నారు. కొందఱు బావులు, బడులు, గుడులు మొదలగువాని కడకు పోవుసందర్భమున అస్పృశ్యులకు గల ఆటంకములను తొలగించుటను గుఱించి తలపోయుచున్నారు. కాని మీ రింకను ముందుకు పోవలసియున్నారు. అస్పృశ్యులు మిమ్ము చూచినంతనే మిమ్ము‌ను వారు తమవారినిగ నెంచగలుగు తీఱున, మీరు మిమ్మును ప్రేమించునంతగ వారిని ప్రేమించవలయును. అప్పుడు మాత్రమే నిర్మాణ కార్యక్రమమందు వారి సహకారము మీకు లభింపగలదు. మద్యపాన నిషేధ సందర్భమునను, ఖద్దరు సందర్భమునను ఇటులనే యుండును.

నేనింతవఱకు మీ రేమిచేయవలసియుండునో తెలిపితిని. ఇక మీ రేమి చేయతగదో కొంత తెలిపెదను. వాఙ్మయ శిక్షణము, పాండితీ పరిశోధనలు, సాహిత్య వ్యవహారములు, సంస్కృత ఆంగ్లభాషా పఠనములు, లలితకళలు మున్నగు వానిని కొంతవెనుకకు పెట్టవచ్చును. మన జాతీయ సంస్థల నన్నింటిని నిర్మాణ కార్యక్రమ మనెడు జాతీయ రణ సన్నాహము కొఱకగు కర్మాగారములుగ మార్చివేయవలయును. భారత దేశములో ఈనాడు ఏలాటి విద్యను నేర్చు సదుపాయములు లేని బిడ్డలు,

లక్షలాదిగ నున్నారు. అది లేక మనకుమాత్రము గడవదా ? నేను ప్రస్తావించి యున్న జాతీయ విద్య మొదలగు ఘనతర విషయములను గుఱించి మఱల చెప్ప నవసరముండదు. 'సౌందర్యము ద్వారమున శిల్పులు సత్యమును దర్శింపజాలుదురుగదా ! దానికి ప్రాధాన్యత లేదా ?' అందురు. సౌందర్య సందర్భమునను ఇతర విషయములందు వలెనే లక్షలాది సామాన్యజనుల ప్రయోజనమునుబట్టి దానిని పరిగణింప వలయును. ఇప్పుడు లక్షలాది ప్రజలకు సౌందర్యద్వారమున సత్యమును దర్శించులాగున శిక్షణ గఱపజాలము గదా ! మునుముందు సత్యదర్శన మననేమో వారికి తెలుపుడు. అప్పుడు వారలే సౌందర్యమును గుర్తింప గలుగుదురు. మనదేశమున పీడితప్రజ నా కనులలో మెలగుచున్నారు. వారి కుపకరించు సర్వమునందును నా మనస్సునకు సౌందర్యము గోచరించుచుండును. మన మీనాడు వారి ప్రాణముల రక్షించు వస్తువులను సమకూర్తుముగాక. ఆ పిమ్మట అందచందములు అలంకారములు సౌందర్యము వాటంత టవియే లభించును.

మీ రెట్టివారుగా నుండవలయునని నా యాకాంక్షయో సంక్షేపముగ తెలిపెదను. మనము నిష్కళంకజీవులుగ నుండవలయు తీరుననే మరణ మనిన భీతి లేనివారమునై యుండవలయును. "ఇంగ్లీషువారు ఇండియాను వదలి పోయిన యెడల నష్టమేమియు లేదని గాంధీజీ తలంపవచ్చునుగాని, ఆంగ్లేయు లీ దేశమును వదలిపోయిన మఱుక్షణము నుండియు ఒక్క శ్రీమంతుని ఆస్తికైనను భద్రత యుండజాలదు. ఒక్క కన్యయైనను చెఱను చిక్కకుండ తప్పించుకొనజాలదు." అని ఇటీవల నొక ఆంగ్లేయుడు మనను హెచ్చరించి యున్నాడు. ఆయనకు భారతీయు లనిన ఎంత నీచాభిప్రాయమున్నదో దీనింబట్టి తెలియుచున్నది. అంత కన్న భిన్నాభిప్రాయ మెట్లుండగలదు ? మన సంపదను, మన గౌరవమును రక్షించుకొనుటకై డబ్బిచ్చి కావలివాండ్రను పెట్టుకొనవలసినంత భయభ్రాంతులముగ ఈనాడు మన మున్నాము. మరణ భీతిని తొలగించుకొనిన తత్క్షణము మన కీ దురవస్థ తొలగగలదు. ఏ దుర్మార్గుడేని తాకినను గూడ నిగ్రహింప జాలునంతటి నైతికబలమును, మన విద్యాపీఠములందు చదువు ప్రతిబాలికయు తనయందు పురికొల్పుకొని సమీకరణము

గావించుకొనుగాక యని నే నాకాంక్షించుచున్నాను. స్వాతంత్ర్య చరిత్ర వ్రాయబడు కాలమున, మన జాతీయ పాఠశాలలందును, కళామందిరము లందును శిక్షణబడసి బాలురయు, బాలికలయు నామములు తమ కెవరి వలన దౌర్జన్యము సంఘటిల్లినను నిగ్రహింపజాలి, తాము మాత్రము స్వీయప్రాణముల నర్పించిన నరుల నామములుగ పేర్కొనబడజాలునంత మరణభీతిని మీ రెల్లఱు పాఱద్రోలుదురుగాక యని నే నర్థించుచున్నాను.

ఆత్మరక్షణముకొఱకై యెదిరిని సంహరించు సమర్థత ఘనమైనది కాదు. తన ప్రాణముల నర్పించు సాహసము వాంఛనీయము. ఒక పురుషుడు తాను మరణించుటకు సిద్ధపడు సమయమున పరహింసగావించు తలంపునైనను దరిరానీయడు. ప్రాణార్పణము చేయు కోరిక ఎంత హెచ్చుగ నుండునో, ప్రాణముల దీయు సంకల్ప మంత తగ్గియుండును. ప్రాణార్పణము చేయుకోరిక ఎంత తగ్గియుండునో, చంపవలయునను కోరిక అంతహెచ్చుగ నుండును. ఈ సూత్రమునకు ఇతరుల సాక్ష్య మవసర మని నేను నొక్కి చెప్పుచున్నాను. సాహసము వహించి పెదవులతో దీవనల పలుకుచు తాము మరణించుటవలన దౌర్జన్యపూరితులగు జనుల హృదయములందు పరివర్తనము కల్పింపజాలిన మహనీయుల పవిత్రనామములతో మన చరిత్రలు నిండియున్నవి. మనము క్షుద్రజంతువులను చంపదగునా, తగదా ? యను విచిత్రప్రశ్నల వేసికొనుచు ప్రధాన ధర్మ సూత్రములు తఱచుగా విస్మరించుచుందుము. ఘాతుకజంతువుల సంహరించు సమస్య ప్రతిదినము ప్రతివానిని ఎదుర్కొను సమస్యకాదు. అపాయకరములగు సర్పములయెడ సైతము అహింసాభావమును చూపజాలునంతటి సాహసమును, ప్రేమను మనలో చాలమంది అలవఱచుకొని యుండలేదు. మన హృదయములందలి అసూయ, క్రోధము మున్నగు సర్పములను పరిమార్పబూనని మనము ఘాతుకజంతువుల జంపుటయందలి న్యాయాన్యాయములను గూర్చిన వ్యర్థపు వాగ్వాదములకు దిగ సాహసించుచున్నాము.

ప్రాథమిక సామాన్యధర్మములను నిర్వహింప చేతగాని స్థితిలో క్రూర జంతువులను మేము చంపము అనుచు ఆత్మశాంతిని బడయుటకు ప్రయత్నించుచున్నాము. అహింసా సాధనము పూనగోరు నరుడు

పాములు మొదలగువాని గొడవ పెట్టుకొనతగదు. చంపుట తన కనివార్యా మగు సందర్భముల గొడవను దూరముననుంచి, సర్వభూతహితచర్యను అనుష్ఠించుటలో మొదటిమెట్టుగా సహనభావము పూని, నరులనుగూర్చిన అశుభసంకల్పములను, క్రోధమును జయించుటకొఱకై యావచ్ఛక్తితో అతడు ప్రయత్నించునుగాక. మీ కిష్టమైనచో ఉర్లగడ్డలను, వంకాయలను తినుట నిరభ్యంతరముగా మానవచ్చును. కాని ఇంతమాత్రము చేతనే మహాయోగ్యుల మని గర్వించి అహింసానిరతుల మని ఆత్మస్తుతి చేసికొన గడంగకుడు. ఆమాట స్మరణకు వచ్చినను సిగ్గగును. అహింసావ్రతము కేవలము తినుబండారములకు సంబంధించినది కాదు. అంత కెంతయో మించిన అతీత ధర్మ మిది. ఒక నరు డేమి తినునో, ఏమి త్రాగునో యను విచారణ కడుస్వల్పవిషయము. ఆత్మనిగ్రహము స్వార్థత్యాగము వానిని ప్రేరేపించునా యనునదే ప్రధానాంశము. ఆహారపదార్థముల సందర్భమున మీ కిష్టమున్నంతగా సర్వవిధముల నిగ్రహము పూనుదురుగాక. అట్టి నిగ్రహము మాననీయమును, అవసరముగూడను. కాని అందువలన అహింసాధర్మ స్పర్శమాత్రమే మనకు కలుగుచున్న దనవచ్చును. ఒక మనుజుని హృదయము కరుణారసపూరితమై, అన్యుల బాధల జూచిన కఱగిపోవునదై, ఎట్టివ్యసనములు లేనిదగునెడల ఆహార విషయమున నతడు విచక్షణ లేనివాడేయైనను అహింసాధర్మమూర్తియై వఱగగలడు. అట్టివాడు మనకు పరమ పూజ్యుడు. అటులగాక తిండి విషయములో కఠిననీమముల పాటించువా డైనను స్వార్థపరతకును, దుర్వ్యసనములకును దాసుడై నిర్దయహృదయుడై వర్తించు మనుజునకు అహింసాతత్త్వ మిసుమంతయు తెలియనట్లె.

## సైన్యములు

భారతదేశమునకు సైన్యము లుండవలయునా, ఉండతగదా, సాయుధమైన ప్రభుత్వమును ఎదుర్కొనదగునా, ఎదుర్కొనతగదా? అను నిట్టి మహాసమస్యలను మన మెప్పుడో యొకనాడు పరిష్కరింపవలసియే యుండును. కాంగ్రెసు కొంతవఱ కా సమస్యాపరిష్కారమును తన ధర్మసూత్రమునందు సూచించియే యున్నది. కాని ఈప్రశ్న లెంత గణనీయములైనను వారితోటి ప్రసక్తి జనసామాన్యమునకు లేదు. ప్రతి

విద్యార్థికిని, ప్రతిఉపాధ్యాయునకును ప్రమేయముగల అహింసా దృక్ప థమును అవి స్పృశించునవియుగావు. ఇట్టి ఘనతర రాజకీయములనుండి విద్యార్థిజీవనమునకు సంబంధించిన అహింసావ్రతము వేరువిధముగా నుండును. అహింసాసౌరభముతో ఘుమఘుమ లాడుచుండు వాతావర ణమునందు కలసిచదువుకొను బాలబాలికలు సోదరసోదరీల తీరున స్వేచ్ఛగా మనగలుగుదురు. అట్లయ్యును స్వయముగ నియమించుకొనిన నిగ్రహమునకు లోబడి వర్తింతురు. విద్యార్థులు ఉపాధ్యాయులయెడ గురుభక్తి భరితులై మెలగుదురు. పరస్పర గౌరవము, పరస్పర విశ్వా సము వారియందు వెలయుచుండును. అట్టి పవిత్రవాతావరణమే అహిం సాచరణమున కొక గుణపాఠమై యొప్పును. అట్టి వాతావరణమున పెరిగిన విద్యార్థులందు ఉదారభావము. విశాలదృష్టి, సేవా నిపుణత విశిష్టలక్షణ ములై సదాప్రకాశించుచుండును. సంఘదురాచారములు వారి నేవిధము నను చిక్కుపఱచవు. వారి సాంద్రప్రేమవహ్నియే అట్టిదోషములనన్నిటిని భస్మీపటలము చేసివేయ సమర్థమై యుండును. ఎట్లన, బాల్యవివాహ ములు వారికి వెగటుగొల్పును. వధువుల జనకులనుండి వరకట్నముల గోరి వారిని పీడింపబోరు. అట్టివారు తమ సతులను బానిసీయులుగ నెంచి, కామ నివృత్తి కుపకరించు సాధనములుగ జూచుట కెట్లు సాహ సింప గలుగుదురు ? అటువంటి అహింసా సంసర్గమున మెలగు యువ కుడు స్వమతస్థుడు గాని, అన్యమతస్థుడుగాని యగు నొక సోదరునితో పోరాటములకు దిగ నెటుల సహింప గలుగును? ఏదెట్లున్నను తానొక అహింసాపరుడనని చెప్పుకొనగల పురుషుడు ఇట్టి కానిపనులలో ఏయొక్క దానిని గాని, అన్నింటినిగాని చేయుటకు పాల్పడడు.

మొత్తముమీద అహింసయను నాయుధము అసమాన ప్రభావము గలది. అది సజ్జన జీవనసార మనందగును. అది ధీరపురుషుని లక్ష ణము. వాని సర్వస్వము నవచ్చును. అది కరుడుగట్టిన నిర్జీవ ధర్మ సూత్రముకాదు. అది సజీవమై ప్రాణదాయినియగు దివ్యశక్తి విశిష్టమగు ఆత్మప్రభావము. అందువలననే 'అహింసా పరమో ధర్మః' అనుట కలిగి నది. అది అధ్యాపకుని చేతిలో నిష్కళంకప్రేమ స్వరూపమును తాల్చ వలసియున్నది. జీవనస్రవంతికిమూలము; సదా నూత్నము. సకలజీవిత

చర్యలందును ప్రత్యక్షమై పఱగును. దానియెదుట ద్వేషమనునది తల చూపజాలదు. కామ, క్రోధ, మదమాత్సర్యాది తిమిరశక్తులు అహింసా సవిత్రుని జాడ గాంచగనే పర్వులిడి వెడల వలసినవే! విద్యాప్రచారమున అహింస సర్వత్ర తన దివ్యకాంతుల ప్రసరింప జేయును. దానిప్రకాశ మును ఎట్టి యుపాయములచేతను కప్పిపుచ్చ వలనుపడదు. అహింసా వాతావరణములో వెలయు విద్యాపీఠమునందు శిక్షణ బడయు విద్యార్థుల కేలాటి క్లిష్ట సమస్యలును చీకాకు పఱచజాల వనుట తథ్యము.

## నిరుద్యోగము

నా చేతికి విరాళముల నొసగి అంతటితో మీచర్ఖాభిమానము పూర్తి యైనట్లు మీరు తలచునెడల నన్ను చిక్కులో పడవేసినవా రగుదురు. ఆకలితో మలమల మాడుచున్న లక్షలాది జనులకు ఈ ధనమును పంచి యిచ్చినను, వారు తయారుచేయు ఖద్దరును మీ రుపయోగించుకొనని యెడల ఈ డబ్బుతో నాకు ప్రయోజనము లేనట్లేయగును. ఏదెట్లున్నను చర్ఖాయుద్యమమును గుఱించి పెదవులతో మాత్రము సానుభూతిని ప్రకటించుటవలన గొప్ప దయాదాక్షిణ్యములు చూపినటుల కొలది రూప్య ములు నాపై బడవేయుటవలనను స్వరాజ్యము సిద్ధించునదికాదు. చెమట నోడ్చి పాటుపడుచును ఆకలిమంట తీర్చుకొనజాలని లక్షలకొలది పేద వారి దారిద్ర్యమును నిరంతరము పెంపొందించుచున్న సమస్య పరి ష్కారము కాబోదు. నా కొఱపాటును సవరించుకొందుగాక. పాటుపడు చును ఆకలిమంట తీర్చుకొనజాలని లక్షలకొలంది జనులని పలికితిని. ఆ వర్ణన యథార్థమగునెడల నాకు సంతోషమే. దురదృష్టవశమున మన దుస్తులను గుఱించిన అభిరుచులను మనము మార్చుకొన జాలకున్నాము. ఆ కారణమున ఆ ఆకొన్న లక్షలాది జనులు సంవత్సరము పొడవునను పాటుపడ గలుగుట అసంభవముగా చేయుచున్నాము. సంవత్సరములో కనీసము నాలుగు మాసములు వారి కవసరములేని విరామమును బలాత్కారముగా వారిపై బడవేయుచున్నాము. ఇయ్యది నా భ్రాంతిజనక మగు మాటకాదు. ప్రజాసామాన్యముతో కలిసి పనులుచేయు మీ దేశీ యులు తెలుపు సాక్ష్యమును మీరు త్రోసిపుచ్చజూచినను ఆంగ్ల పరిపాల కులే యనేకులు పెక్కుసారులు ప్రవచించియున్న యథార్థమే ఇది.

కాబట్టి మీనుండి ఈ సంచిని తీసికొనిపోయి 'అన్నమో రామచంద్రా' యని అలమటించు స్త్రీజనమునకు నేను పంచియిచ్చినను సమస్యా పరిష్కారము కాబోదు. అంతియేగాక ఈ దానము వారి ఆత్మలను పతితము గావించును. వారు యాచకు లైపోదురు. ఇతరుల కారుణ్యముమీద నాధారపడి బ్రతుకు అలవాటునకు లోబడిపోదురు. కావున ఈ మన సోదరీలు తమతమ గృహములలో సురక్షితలై నివసించుచుండ వారికి పనిగల్పించుట మీరును, నేనును కోరవలసిన యుద్యమముగా నున్నది. వారికి మీరు సమకూర్ప తగినపని చర్ఖా త్రిప్పుపని యొకటియే. ఆ పని గౌరవప్రదమైనది; నీతివంతమైనది. వారికి అర్హమైనది. మీ కొక అణాయన లెక్కలోనిది కాకపోవచ్చును. రెండు మూడు నాలుగు మైళ్ళు నడచి పరిశ్రమ చేయుటకు మారుగా ట్రాంబండిలో నెక్కి సోమరిగా కాలక్షేపము చేయుటకై తృణప్రాయముగా ఆ అణాను మీరు పారవేయగలరు. కాని ఒక పేద సోదరి చేతిలో పడుచో, ఆ అణాయే అధిక ఫలదాయిని కాగలదు. ఆమె దానికొఱకై పరిశ్రమచేయగలదు. తన పవిత్ర హస్తములతో వడికిన నాణ్యమగు నూలును నా కొసగగలదు. ఆ దారమునకు వెనుక చరిత్ర గాథ యొకటేర్పడును. రాతనయులు, మహారాజులు ధరించుటకు యోగ్యమగు వస్త్రము ఆ నూలుతో నిర్మాణము కాగలదు. మిల్లులో తయారగు డ్రిల్లుగుడ్డకు వెనుక అటువంటి చరిత్రగాథ ఏమియు నుండజాలదు.

మీరు అర్థశాస్త్రమును చదువుదురుగదా! కావున మీ చదువుల కొఱకై దొరతనమువారి కోశమునుండి చేయబడు వ్యయములో స్వల్ప భాగము సైతము మీరిచ్చు జీతములవలన భర్తీయగుటలేదని మీకు తెలిసి యుండవలయును. బుద్ధిమంతులైన యువకులు గదా మీరు. మిగతా సొమ్మంతయు నెక్కడనుండి వచ్చుచున్నదో ఎన్నడైనా ఆలోచించితిరా ? అది నిరుపేదలవలన లభించుచున్నది. ఒరిస్సావంటి దరిద్ర రాష్ట్రములలో కేవలము యెముకల పంజరాలై జీవితముల గడపుచున్న దీనజనములనుండి వచ్చుచున్నది. వారి నేత్రములలో తేజస్సు లేదు. వారి ముఖములపై నిరాశ పెద్ద అక్షరములతో ముద్రితమై యున్నది. సంవత్సరాదినుండి సంవత్సరాంతమువరకు తినమెతుకులేక కడుపు మాడుచుండ పస్తైడు పాసిపోయిన మెతుకులను, చిటికెడు మట్టి కొట్టుకొని పోయిన ఉప్పును చీకొట్టు మహౌదార్యముతో శ్రీమంతులగు గుజరాతీయులును,

మార్వారీలును వారి జోలెలో పడవేయగా, ఎట్టెటులో తమ ప్రాణాలను వారు నిలుపుకోవలసినదేగదా! అట్టి మీ సోదరుల కొఱకై మీరు చేయునది ఏమి? తమకు మఱి రెండు పైసలు అదనముగా దొరకునను పేరాపెంపున తమ పవిత్ర హస్తములతో మీసోదరీలు సిద్ధముచేసిన ఖద్దరును ధరించుట కొడంబడక సంవత్సరమునకు అరువదికోట్ల రూప్యములను దేశమునుండి తుడిచి పెట్టుకొనిపోవుచు, భారతదేశపు పేదలనోటి కొకముద్దయన్నమైన దొఱకకుండచేయు విదేశీదుస్తుల కొఱకై మీ రెగబడుదురుగదా! దీనియంతకు ఫలితార్థముగ కటిక దారిద్ర్యము దేశమును బీల్చిపిప్పిచేయుచున్నదే. మన వాణిజ్యము దేశ సౌభాగ్యమును అభివృద్ధి చేయుటకు మారుగా ధనశోషణమునకే తోడ్పడుచున్నది. మన వర్తక ప్రముఖులు లాంక్‌షైరు, మాంచెష్టరు వర్తకులకు ప్రతినిధులుగ నిలిచి వారి వ్యాపారలాభములలో నూటికైదు చొప్పున వారిడు కమీషనును స్వీకరించి పెద్ద పెద్ద నగరములలోని రమ్యహర్మ్యము లని మురిసిపోవు కట్టడములను వెలయించుచున్నారు.

భారతదేశ రక్తపానము చేయుకొఱకై బాగుగ బలిసియున్న తావున శస్త్రమును ప్రయోగింపవలసియుండునని శాలిస్బరీ ప్రభువు నుడివి యున్నాడు. ఆ ప్రభుని కాలములో వసూలైన పన్నులే రక్తము పిండుట చేత చేకూరినవని వర్ణింపబడియుండగా ఇన్ని సంవత్సరములనుండియు ధనశోషణమునకు గుఱియై శుష్క దారిద్ర్యమున కూలిపోయి యున్న నేటి హిందూదేశ స్థితిని ఇంక నేమని వర్ణింపవలసియుండును. భారతదేశపు పేదల ప్రాణరక్తమును పిండగా వచ్చిన పన్నుల ఆదాయము నుండి మీచదువులకు వలయు ధనము వ్యయపఱచబడు చుండెనమట మరువకుడు. ఇంతేగాదు. మీవిద్యలకై వ్యయము చేయబడు సొమ్ము అపఖ్యాతి కరమగు అబ్కారీశాఖయొక్క ఆదాయమునుండి ఒసగబడు ననియు సదా స్మరింపుడు. కాబట్టి యముని ధర్మపీఠము నెదుట నిలచి మీ సహోదరులపట్ల మీ రెట్లు వర్తించితిరి?" అనెడు ప్రశ్నకు మీ రేమి సమాధానము చెప్పగలుగుదురో యోచించుకొనుడు.

# ౨. వివాహ ధర్మము

## సతీగౌరవము

మీరు మీ శీలమును చక్కగ నిర్మాణము చేసికొనరేని, మీ తలపులను, మీ చేతలను మీ వశము చేసికొనజాలరేని, 'షేక్స్పియర్' గ్రంథాలను, 'వర్డ్సువర్తు' గ్రంథాలను మీ రెన్ని పఠించినను వ్యర్థమే. మీరు ఆత్మనిగ్రహమును సంపాదించుకొను నెడల మీ వ్యసనములఁ నడంచి వేయ జాలు నెడల మీరు నిరాశాహతులై మొఱలిడరు. మీ హృదయములను పూర్తిగ నొసగుదు మనుచు క్రియాశూన్యత చూపజాలరు. హృదయము నొసగుటన సర్వస్వము నర్పించుటనియే యర్థము. ఇంతకును సమర్పణము చేయుట కర్హమగు హృదయములు మీ కుండవలయును గదా! కృషి చేసితిరా అట్టి హృదయములను సంపాదింప గలుగుదురు.

మీరు కట్నముల కమ్ముడువోయి చేపట్టిన సతుల నె ట్లాదరించుచున్నారు? భోగములకై వినియోగపడు నుపకరణములుగా జూచుట లజ్జాకరముగాదా? ఆంగ్ల కావ్యముల పఠించిన మీరు నేర్చిన గుణపాఠ మిదియా? స్త్రీని ఉత్తమార్ధాంగి యనిగదా పేర్కొందురు. కాని మీరో మీ భార్యలను బానిసీలనుగ జూచుచున్నారు. ఫలితార్థమేమి? మీ దేశము సర్వాంగ వాతముచే కుందుచున్నది. 'స్వరాజ్యము పిఱికివారి సొమ్ము కాదు.' స్వరాజ్యము కండ్లగప్పు గుడ్డయైన లేకుండ చిఱునగవొప్పు మోముతో ఒయ్యారముగ నుఱికంబము నెక్కజాలు ధీరుల సొమ్ము. మీ సోదరీలను, మీ సతులను, మీ స్త్రీ జనములను సగౌరవముగా చూతుమని ప్రతినబూనుడు. స్వతంత్రలనుగ పాటింతుమని ప్రమాణము చేయుడు. మీ అపనిందను కడిగి వేసికొనుడు. అప్పుడు మీ దేశ స్వాతంత్ర్యమునకు మీ రర్హులని నేను విశ్వసింతును.

అందుకు భిన్నముగా కట్నములు నేడు గోచరించుచున్న వేమి? కొలది నెలలక్రితము స్టేట్సుమను పత్రికాధిపతులు భారత దేశమం దంతట కొన్ని కులములవారిలో అచార మైపోయిన కట్నాల పద్ధతిని గుఱించి తమ పత్రికలో చర్చించుట కవ కాశ మొసగుచు చాల సంపాదకీయ వ్యాసముల సాగించినారు. నేనును యంగుఇండియా పత్రికలో 'ఇచ్చి

పుచ్చుకోలు' అను సింధుదేశాచారమును గుఱించి ఖండనల వ్రాయ మొదలిడితిని. తమ పుత్రికలకు మంచి పెండ్లి సంబంధముల గుదుర్చు పేరాశజూపు తల్లి దండ్రులనుండి పెద్దపెద్ద మొత్తములను గుంజుకొనిన సింధుదేశ విద్యాధికులు పెక్కండ్రు కాన్పించిరి. ఈ ఆచారమును ఖండించు సమరమునకు స్టేట్స్మను పత్రిక నడుముకట్టినది. ఈ ఆచారము కడు క్రూరమైనదనుటకు సందేహము లేదు. అయినను నాకు తెలిసినంత మట్టుకు లక్షలాది జనులు దీని బారి నింకను పడలేదు. భారత ప్రజా జల నిధిలో నొక్క బిందు వనం దగు మధ్యమ తరగతివారినే ఈ యాచారము పట్టుకొనినది. దురాచారముల గొడవను తడవినపుడెల్ల మధ్యమ తరగతి వారిం గూర్చియే మనము ప్రస్తావించుచుందుము. పల్లెపట్టుల నివసించు కోట్లాదిప్రజల యాచారములు మన కంతగా తెలియవు. ఐనను ఈ కట్నాల దురాచారము దేశములో కొలది మందికి మాత్రమే సంబంధించినదని యుపేక్షింపదగు ననుటగాదు. దీనిని రూపుమాపవలసినదే.

సింధు హైదరాబాదు నగరములో ఇంపీరియలు టెలిగ్రాఫు సర్వీసు ఉద్యోగి యొకండు ఇరువదివేల రూప్యములను కట్నముగా నగదు రూపమున గుంజుకొనుటయేగాక పెండ్లి సమయమున లాంఛనముల క్రిందను చాల సొమ్ము రాబట్టుకొనెనని వార్తాపత్రికలలో వెల్లడియైనది. పెండ్లి కొక షరతుగా కట్నమును కోరు ఏ యువకుడుగాని తా గఱచిన విద్యకును, తా జన్మించిన దేశమునకును ఇంతేల స్త్రీజాతి కంతకును అప్రతిష్ఠ చేకూర్చినవా డగుచున్నాడు. దేశమునం దెన్నియో యువజన సంఘము లున్నవిగదా! ఈలాటి సమస్యలను అలాటి సంఘములు చేబట్టి పరిష్కరించుగాక యని నా యాకాంక్ష. అటువంటి సంఘములు తఱచుగా ఆత్మ స్తుతి సమితులుగా పఱగుటకు మారుగా తమలో తాము ఉచిత సంస్కార ప్రచారములకు గడంగుట మేలు.

వివాహ మనగా తలిదండ్రుల మధ్య ధనముకొఱకై జరుగు బేరముగా సాగగలదు. ఈ ఆచారమునకును, కులకట్టుబాటునకును చాల సన్నిహితమగు సంబంధము గలదు. ప్రత్యేక కులములలోని కొలదిమంది యువతీ యువకులకు మాత్రమే వరాన్వేషణము పరిమితమై యున్నంత కాలము, మన మెంతగా ఖండించినను కూడ ఈ కీడు తొలగునటుల

కాన్పించుటలేదు. ఈ అనర్థమును రూపుమాపవలయుననినచో బాలురును, బాలికలును తమ తలిదండ్రుల కులపుహద్దులను దాటిపోవలసి యుండును.

వివాహపు వయస్సునుకూడ హెచ్చింపవలయును. తగిన సంబంధము కుదురనియెడల అవసరమగుచో జీవితాంతము అవివాహితలుగానే యుండిపోవుటకు బాలికలు సాహసము పూనవలయును. దీనికంతకును శీల నిర్మాణవిద్య అవసరము. దానిమూలమున దేశమునందలి బాలబాలికల హృదయములలో మహత్తర పరివర్తనము కలుగును. దురదృష్టవశమున మన ప్రస్తుత విద్యా విధానమునకును, మన పరిసరపరిస్థితులకును నెంతమాత్రము సంబంధము కుదురుటలేదు. మన మహాజాతిలో అత్యంతబహుళ సంఖ్యాకులగు బాలబాలికలు పొందుచున్న విద్యాశిక్షణము మన పరిస్థితులను స్పృశింపనైనను లేదు. కాబట్టి ఈ అనర్థమును తొలగించుటకై యావచ్ఛక్తితో పాటుపడవలసినవారమైనను మనదేశములో నిప్పుడు అతివేగముగ కలుగుచున్న మార్పుల కనుగుణ్యమగు విద్యాప్రణాళిక నెలకొల్పబడిననే గాని ఈ అనర్థమును మఱియు నిట్టివే యగు పెక్కు అనర్థములును తొలగజాలవని నా దృఢాభిప్రాయము. కళాశాలలం దుత్తీర్ణులైన బాలురును, బాలికలును సైతము తమ భవిష్య జ్జీవితముతో మిక్కిలి సన్నిహిత సంబంధముగల వివాహము వంటి విషయములలోని దోషములను నిరోధించుటకు శక్తిచాలనివా రగుటయు, లేదా ఇష్టములేనివా రగుటయు ఎందులకు ? పెండ్లిండ్లు కాజాల వను భీతితో విద్యాకలితలగు బాలికలు సైతము ఆత్మహత్యలు చేసికొనుటకు కారణమేమి ? నీతికి విరుద్ధమును, క్షుంతవ్యము కానట్టియు ఆచారము నెదిరించుపాటి సాహస మొసగజాలని విద్యవలని ప్రయోజన మేపాటిది ? ఈ ప్రశ్నలకు ప్రత్యుత్తరము సుస్పష్టమే! సాంఘికములును, తదితరములునగు దుష్టాచారముల నెదిరించి పోరాడగల శిక్షణము నొసగజాలని విద్యా విధానములోనే ప్రధానమగు లోప ముండితీరవలయును. ప్రతి జీవిత సమస్యను పరిష్కారము చేసికొనజాలు సమర్థతను బాలబాలికలందు పురిగొలుపగల విద్యావిధానము మాత్రమే ఆదరణీయమగును.

విద్యా సంపాదన సమయమున మీరు మీశక్తిని వ్యర్థము చేసికొన రాదు. మీశక్తిని సమీకరణము చేయవలయును. మీలో నూటికి ఏబది మందికి పైగానే పెండ్లిండ్లు చేసికొనియున్నవా రని తెలియుచున్నది. ఐనదేమో యైనది. కాన మీరు వివాహము చేసికొనినవారైనను, కామమును ధృఢముగ నడంచిపట్టి మీ విద్యాభ్యాసకాలము ముగియువఱకు నిష్కల్మష బ్రహ్మచర్య జీవనమును గడపుడు. అటుల శారీరకముగను, మానసికముగను, ఆధ్యాత్మికముగను మీరు పూను నిగ్రహమునకు ప్రతిఫలముగ విద్యాభ్యాసము సమాప్తి యగునప్పటికి మీ రెంతయో శ్రేష్ఠతరులై యుండుట కనుగొందురు. ఎంతమాత్రము సాధ్యముకాని దేనినో మీకు నియమించుచున్నా నని తలపోయకుడు.

వివాహములు చేసికొనినవారైనను బ్రహ్మచర్యము పూను సంప్రదాయము పెంపొందుచున్నది. అందువలన వారికిని, సామాన్య ప్రజాళికిని కూడ మేలు కలుగుచున్నది. వివాహములు చేసికొనియుండనివారు అట్టి ప్రేరణలకు లొంగకూడ దని నా మనవి. ఇంతకును మన మొక బానిసజాతిగా నున్నాము. ఆ దాస్యబంధముల త్రెంచుకొనుటకై పెనగులాడుచున్నాము. ఇప్పట్టున బానిసీయు లగు బిడ్డలనుగని ప్రపంచములో పడవేయుట పాపకార్య మనియైనను మీరు గ్రహింతురు గాక. అనేక కళాశాల లందుండు యువకులు చాలమంది తమమానసిక దౌర్బల్యమును పారద్రోలు నుపాయమును తెలుపుడని అర్థించుచు జాలిగలిగించు లేఖలను నాకు తఱచుగా వ్రాయుచుందురు. నేను వారికి పురాతన కాలము నాటి ఉపాయమునే తెలుపుచుందును. వా రెంతటి నిస్సహాయ దశలో నున్నను దైవసాహాయ్యమును అర్థించుచో వారికి నిస్సహాయులుగా నుండ నగత్య ముండదు.

## వివాహవ్యయములు

ఈ వివాహపు టనర్థముల గుఱించి నాతో ముచ్చటించిన మిత్రు డొకడు విద్యార్థులే వివాహ కార్య కలాపములందు అమితముగా ధనవ్యయము చేయునట్లు తల్లిదండ్రులను పీడింతు రని తెలిపియున్నాడు. వివాహమనునది ఒక మహాపవిత్రక్రతువని మీరు తెలిసికొనవలయును. అట్టిదానికై ధనవ్యయము అవసరము కాతగదు. ధనము గలవారు

విందులని, వేడుకలని ధనమును విరివిగా వ్యయము చేయవలయునను వాంఛను అడంచుకోజాల కున్నారు. పేదవారలో వీరి ననుకరింపవలయు నను కోరికతో అప్పులపాలై ముప్పు దెచ్చుకొనుచున్నారు. మీరే శూరు లగుచో, మీ పరిణయముల సమయమున అధికవ్యయముల గావించు ప్రయత్నములకు ఎదురు నిలిచి పోరాడుదురుగాక.

## వరాన్వేషణము

తన కుమార్తెకు యోగ్యత తక్కువనిగాక, తానును తన కుమార్తెయు గూడ వరాన్వేషణమున తమ కులపు టావరణమును దాటిపోవ నిష్టములేక కడుదయనీయావస్థలో పడిపోయిన తండ్రినిగుఱించి ప్రస్తావింప నున్నాను. ఈ సందర్భమున వధువు విద్యావతి యగుటయే అనర్థ మైపోయినది. ఆ బాలిక నిరక్షరకుక్షిగాదు. అట్లయ్యేనేని ఏలాటి యువకునితోడనైనను కాపురము చేయుటకు ఒడంబడెడిదె. కాని విద్యా విశారద యగుటచేత తనతో సరిపోలజాలు విద్యాధురంధరుడే భర్త కావ లయునని అపేక్షించుట సహజము. దురదృష్టవశమున యోగ్యురాలగు నట్టి బాలికను పరిణయమగుట కొఱకైనను తాము అమ్ముడుపోవ సమ్మతించుచు పెద్ద ధరయే రావలయునని పట్టుపట్టుట నీచమగు అపాత్రతగా యువకులు తలపోయకున్నారు. 'ఇంగ్లీషు గ్రాడ్యుయేటు' అనగానే కృత్రిమమగు ధర యేర్పా టైపోయినది. ఒక యువతిని పెండ్లిచేసికొను కొఱకు పెద్దధరకు పెండ్లిబజారులో నమ్ముడుబోవ లజ్జించక, యువ్వి ళ్ళూరు యువకులు గల కులముల వారు విద్యయను పదమునకు వివేక ముతో గూడిన నిర్వచనమును గ్రహించునెడల, బాలికలకు తగిన వరులు దొరకుటలో సంభవించు క్లేశములు పూర్తిగా తొలగి పోకున్నను, చాల వఱకు తప్పక తగ్గిపోగలవు. వరాన్వేషణమున వర్ణవివక్షతావరణము ఛేదించివేయుట లెస్సయని ఇందువలన నొక్కి చెప్పుచున్నాను. అటుల ఈ యావరణను ఛేదించివేసిన యెడల, వరాన్వేషణమునకు తగిన క్షేత్రము విశాలతరముకాగా, నీచముగ అమ్ముడు వోవ సిద్ధపడు వరుల ధరలు తగ్గి వారికి శృంగభంగము కాగలదు.

# దుర్వినీతులు

(దుర్వినీతులగు యువకుల వలన విపత్తులపాలైన కొందఱు బాలికలు ఉత్తర హిందూస్థానమునుండి మహాత్మునకు వ్రాసిన లేఖల సారాంశ మీ క్రింద తెలుపబడినది.—)

"బాలికలును, తరుణవయస్కులగు యువతులును తామెంత వలదను కొనినను మగవారు వెంట లేకుండ పట్టణములలో నొక వైపునుండి మఱొకవైపునకో, లేక ఒక పట్టణమునుండి వేఱొక పట్టణమునకో సాహసించి పోవు నవసరము తటస్థించును. అటుల నొంటరిగా పోవు తరిని దుష్టపురుషులు వారిని బాధించుట తటస్థించును. ప్రక్కగా పోవుచు అసభ్యభాషణములను, బూతులను సయితము వాడుదురు. ఏదేని భయము అడ్డుపడనిచో వారింకను రెచ్చిపోగలరు. అట్టి సందర్భములలో అహింసానిరతి యేమిచేయగలదో తెలియకోరెదను. దౌర్జన్య సహితమగు నుపాయము లున్నవి. అట్టి యుపాయము నేదియో ప్రయోగించి ఆ బాలికగాని, స్త్రీగాని అత్యాచారమునకు గడంగు దుర్మార్గునకు బుద్ధి చెప్పగల్గును. కనీసము అట్టివానితో వాదులాడుట సాగించి చుట్టుపట్టు ప్రజల దృష్టి నాకర్షించునెడల, వాడు దౌడుతీసి పారిపోగలడు. ఆ చర్య వలన తాత్కాలికముగ గండము తప్పునేగాని స్థిరపరిహారము చిక్కదు.

నాకు సంఘటిలిన యుదంత మొకటి తెలిపెదను. మఱొక బాలిక తోడురాగా, అవసరకార్యముమీద సాయంసమయమున ఏడున్నర గంటల వేళ వీధిని పోవుచుంటిని. వెంటవచ్చు మగవాని సాయము దొఱకలేదు. పనియా ఆప వీలుకానిది.

యువకు డొకడు సైకిలెక్కి పోవుచు మాకు వినవచ్చునటుల ఏమేమొ గొణుగుచు మా ప్రక్కగా పోయినాడు. అతడు మమ్ము గుఱించియే ప్రేలెనని గ్రహించితిమి. కొంత నొచ్చుకొంటిమి. ఏమియు తోచలేదు. ఆ రోడ్డుమీద ఇతర జనము లేదు. మేము కొలది యడుగులు పోవులోపల సైకిలు తిరిగి వచ్చినది. కొంత దూరాన నుండగానె వానిని గుర్తుపట్టగల్గితిమి. అతడు మా సమీపమునకు వచ్చినాడు. మా దాపున దిగనెంచినాడో, లేక ప్రక్కగా పోదలచినాడో దైవమున కెఱుక. మా కాపడమూడిన దను మాహ తట్టినది.

శరీరబలమునా మేము నమ్మకోజాలము. సామాన్యముగా నా యీడు బాలికలకన్న బలహీనను, నాచేతిలో పెద్దపుస్తక మొకటున్నది. ఎటులో ధైర్యము తెచ్చుకొని నా పుస్తకమును సైకిలుమీదికి విసరి వేసితిని. "చిలిపిచేష్టల సాగింప సాహసించితివా!" అని అఱచితిని. అతడెటులో నిలువ ద్రొక్కుకొని, వడివడిగా పాఱిపోయినాడు. అతీరున నేను సైకిలుమీద పుస్తకము విసరివేయని పక్షమున దారి పొడవునను బూతు కూతులతో అతడు మమ్ము హింసించియుండును.

మొదటిది, ఇట్టి సందర్భములలో బాలిక లేతీరున అహింసాప్రయోగము చేసి ఆత్మరక్షణ చేసికొన గల్గుదురో, రెండవది స్త్రీలయెడ నత్యాచారములు చేయు యువకులకు బుద్ధి చెప్పగల సవ్యమగు విధాన మేదియో దయచేసి తెలుపుడు."

వ్యక్తులకు తక్షణము లభించు నివారణోపాయమునే కోరునెడల దుర్బల శరీరగా తెలుపుకొనిన ఆ యబల అనుసరించినటుల సైకిలు మీదికి పుస్తకమును విసరివేయుట యను నుపాయము సరియైనదే. అది పురాతన కాలమునుండి అనుసరణీయమై వచ్చుచున్న ఉపాయమే కాయకముగా బలవంతులైనవారి యెడనైనను ఒకడు దౌర్జన్యమునకు పూనునెడల, వీనిదుర్బలత దౌర్జన్యప్రయోగమును ఫలప్రదముగా సాగించుటలో అడ్డురాదని పత్రికలలో పల్మరు వ్రాసియున్నాను. ఇసుమంతయు తెలివి యున్నచో పసిబాలిక సయితము పశుబల ప్రయోగము పూని, మరణమును వినాశనమును చేకూర్పజాలు విధానము లెన్నియో ప్రస్తుతకాలమున ప్రచారములో నున్నవి. ఆ యా సంఘటనలలో తమ్ముదాము రక్షించుకొనునిమిత్తమై, నాకు లేఖ వ్రాసిన యబలను బోలు వారికిని వీలుపడు శిక్షణలు గఱపుట ఈనాడు సామాన్యముగా వెలసినది. ఆత్మ సంరక్షణార్థము ఆ సమయమున తన చేతిలోనున్న పుస్తకమును ఆ బాలిక జయప్రదముగా ప్రయోగింప గలిగినను, నానాటికి పెరిగిపోవుచున్న అనర్థము నణచివేయుటకు దగిన పరిహారోపాయ మదికాదని ఆ బాలికయే సూక్ష్మబుద్ధితో గ్రహింప జాలినది. అసభ్యప్రలాపముల సందర్భములో అంతగా అలజడిచెంద నవసరముండదు. అయినను ఉపేక్ష చేయదగినవియు కావు. అటువంటి సంఘటన లన్నిటిని పత్రికలలో ప్రకటింపవలయును.

తెలిసికొన వసతి గల్గినంత వఱకు అటువంటి దుర్వినీతుల పేరులను సయితము బహిరంగ పఱుపవలయును. దుర్మార్గమును బయలుపెట్టుటలో కృత్రిమంపు బిడియము పెట్టుకొనదగదు. జనసామాన్యమున ఘటిల్లుచుండ దుష్కృత్యముల రూపుమాపుటకు ప్రజాప్రాతికూల్యమునుబోలు అయుధము వేఱొండు లేదు.

ఇంతకును, తమ్ముజూచి యోగ్యవర్తనులగు బాలికలు నిరంతరము భీతిలిపోవు నంతగా యువకులు సామాన్య మర్యాదవిహీనులై పోవు దుస్థితికి హేతువేమనున దొక సమస్యయైనది. యువకులలో నధిక సంఖ్యాకులు స్త్రీలయెడ గౌరవభావముతో వర్తింపజాలకుండిరనిన నా కెంతయు దుఃఖము గలుగుచున్నది. యువజనలోకమున తమ ప్రతిష్ఠా భంగమును గూర్చి పరితపించువారై, తమ సహచరులు సలుపు అత్యాచారములలో నొక్కొక్కదానిం గుఱించియు శ్రద్ధవహింపవలసి యుండును. ప్రతి స్త్రీ యొక్క గౌరవమర్యాదలు తమ తల్లుల యొక్కయు, అక్కచెల్లెండ్ర యొక్కయు గౌరవ మర్యాదలే యని భావింప నేర్చుకోవలయును. అటుల సద్వర్తనమును నేర్వజాలనియెడల, వారు నేర్చిన విద్యలన్నియు నిరర్థకములేయై చనును. కటా! తమ శిష్యకోటికి విద్యాలయ పాఠ్యక్రమమును బోధించుపాటి శ్రద్ధను వారియందు సుజనత్వమును పాదుకొలుపుటయందును వహించుట విద్యాలయోపాధ్యాయులకును, కళాశాలాధ్యాపకులకును పరమ ధర్మము సుడీ!

## అభినవ బాలిక

మఱొక విషయము. నా కుత్తరము వ్రాసిన బాలిక సామాన్యరకమునకు చెందిన బాలికవలె కాన్పించుటలేదు. అభినవ బాలిక తనను గాలి, వాన, యెండ సోకకుండ రక్షించుకొనుటకు గాక పరుల దృష్టి నాకర్షించు నిమిత్తము వింతదుస్తులను వేయుచుండును. సాహస కార్యములనిన ఆమెకు ప్రీతి. అభినవ బాల యన పదేసిమంది ప్రద్యుమ్నుల నాకర్షించు ప్రభావతి లీలనుంట నాకు వెఱగు గొలుపును. సహజ సౌందర్యమునకు వన్నెబెట్టుకొఱకు, రంగులువేసికొని అపూర్వ రూపు దాల్చుచుండును. అట్టి బాలికకు దౌర్జన్య విరహిత విధాన ముపకరించదు. అహింసాభావమును మనలో ప్రవర్ధనము గావించుట ప్రత్యేక

ప్రణాళిక యవసరము. దాని ననువర్తించుటకు కఠిన నియమ శిక్షణ ముల నవలంబింపవలసియుండును. తత్ఫలముగా మన జీవనసరణియు, మన భావవైఖరియు పూర్తిగా పరివర్తనము చెందును.

పాఠశాలల నుండియు, విశ్వవిద్యాలయముల నుండియు వెలువడి రాగానే, విద్యార్థినులలో నధిక సంఖ్యాకులు విశాలతర ప్రజా జీవనమున జాడచూపక అంతర్ధాన మగుచున్నారు. ప్రతి భారతీయ వనితయు, బాలి కయు పెండ్లాడు నిమిత్తమే పుట్టియుండలేదు. ప్రత్యేక మొక పురుషుని సేవించుటకు మారుగా, ప్రజాసేవను పూనిన బాలికల ననేకులను చూప గలను. హైందవ యువతులు పార్వతీ సీతల ప్రతిబింబరూపులుగనో, సాధ్యపడునెడల, అంతకన్న పూజ్యతర రూపులుగనో, వెలయదగు తరుణ మేతెంచినది.

(రామనాథ బాలికా కళాశాల విద్యార్థినుల గుఱించి)

పార్వతి పుణ్యచరిత్ర; మీ రెఱుంగుదురు. భర్తకై ధనరాసుల నామె వెచ్చింపలేదు. తానమ్ముడు బోవ నంగీకరింపలేదు. సప్త సతీమ తల్లులలో మిన్నయై హైందవాంతరిక్షమున దివ్యకాంతులతో వెలుంగు చున్నది. ఏ కారణముచేత ?—ఏ విశ్వవిద్యాలయముననో పట్టభద్రయైన హేతువు వలననా ? కాదు. మఱెందువలన ? మనము కనివిని యెఱుం గని తీవ్ర తపశ్చర్యవలన !

అతి నీచమగు కట్నముల పద్ధతి పరిపాటి యగుటంజేసి, బాలిక లనేకులు వరుల బడయజాలకున్నా రని వినుచున్నాను. తరుణవయస్క లగు యువతీలలామలు సకల దుష్ప్రేరణలను తిరస్కరించివేతురు గాక. దుష్టాచారములను ధిక్కరించుట మూలమున మీలో కొందఱు జీవి తాంతమువరకును, లేదా చాల యేండ్లవఱకును కన్యలుగానే యుండి పోవలసివచ్చును. మీరు వివాహమాడు తరుణ మేతెంచునెడల, మీ జీవిత సహచారుల నిర్ణయించుకొను సందర్భమున ధనధాన్య సంపదనో, కీర్తి ప్రతిష్ఠలనో, లేక సుందర గాత్రములనో కలిగిన పురుషులకై వ్యామోహము చెందక పార్వతీ సతివలె, పరమపవిత్ర శీలము గలిగి, సకల సద్గుణములచే నొప్పువరులకైయే అన్వేషింతురు గాక ! నారదుడు పార్వతీదేవిని సమీపించి శివుడు కడు పేదవాడును, బూడిదపూసికొను

వాడును, సౌందర్య విహీనుడును నగు బ్రహ్మచారియని తెలిపిన కథను మీరు వినియుందురు. అయినను శ్రీ పార్వతి 'అన్నియు సరియే. నా కతడే ప్రాణనాథు డగుగాక!' అనినది. శివునిబోలు శీలవంతులు దొఱకుట దుర్లభము. కావున మీరు అల పార్వతీదేవివలె అనేక వేల వత్సరములు కాకున్నను, చాలకాలమైనను తపశ్చర్యబూని సంతృప్తలై పరగవలసి యుండును. దుర్బలురమగు మనము సహస్రాబ్దముల కొలది ఘోర తపముల నాచరింపజాలకపోవచ్చును. కాని మీ జీవితకాలముననైన అటుల గావింప యత్నింపుడు.

మీ రీ నియమముల నంగీకరింతురేని, మీరు వట్టి బొమ్మల కుప్పలలో నణగారిపోక పార్వతి, దమయంతి, సీత, సావిత్రి ప్రముఖ సతీలలామల గణములో చేరి గణ్యత గాంచ గల్గుదురు. అప్పుడు మాత్రమే ఈ రీతి (రామనాథబాలికా) కళాశాలయందు విద్యగఱచిన ధన్యత బడయుదురు.

## గీతా పరిచయము

అధ్యాపకాగ్రగణియగు ఒక మిత్రుడు తాను కలిసికొనిన విద్యార్థులను మతమును గూర్చిగాని భగవద్గీతను గూర్చిగాని వారికేమైన తెలియునా యని ప్రశ్నించుట నొక పనిగా పెట్టుకొనెను. వారిలో అత్యధిక సంఖ్యాకులు అట్టి జ్ఞానమేమియు లేనివారని తెలియవచ్చినది.

కొందఱు విద్యార్థులు తమమతమున నేమియు తెలియనివా రగుటం బట్టి భారతదేశము అధ్యాత్మజ్ఞానమునందు ప్రముఖ స్థానముగలది కాదను నిర్ధారణను నేను తేల్చబోవుటలేదు. కాని కేవలము కొందఱు విద్యార్థులయొక్క మతశాస్త్రములం గూర్చిన అజ్ఞానము వలన, ఆధ్యాత్మిక జీవనమే కొఱవడెనని గాని ఆ విద్యార్థు లే సంఘమునకు చెందియున్నారో ఆ ప్రజలు అధ్యాత్మజ్ఞానశూన్యులని గాని, తేల్చతగదను టే నా అభిప్రాయము. గవర్నమెంటు విద్యాలయములలో చదువుకొనిన విద్యార్థులందు అత్యధిక సంఖ్యాకులు ఆధ్యాత్మికబోధ లేనివా రగుట నిస్సంశయము. నా మిత్రుడు నాతో చెప్పినమాట మైసూరు విద్యార్థులకు సంబంధించినది. మైసూరు సంస్థాన పాఠశాలలోని విద్యార్థులకు సైతము మతబోధ శూన్యమయ్యెగదాయని నాకు బాధకలిగినది. సార్వజనీన పాఠ

శాలలందు ప్రాపంచిక వ్యవహారబోధ మాత్రమే ఉండవలయు నను సిద్ధాంత మొకటి కలదని నే నెఱుగుదును. ప్రపంచములోని యనేక మతములకు ప్రాతినిధ్యము వహించినట్టియు, మఱల నొక్కొక్క మతము లోనేగల అనేక సంప్రదాయములకు నెలవైనట్టియు భరతఖండము వంటి దేశమునందు మతబోధకొఱకు అవకాశ మేర్పఱచుటలో కష్టమున్న దనియు నే నెఱుగుదును. ఐనను భారతదేశమున అధ్యాత్మజీవనము వట్టిపోయినదని ప్రకటింప నొడంబడ మేని వ్యావహారిక జ్ఞానబోధతో సమానముగా నైనను, మతబోధయు అవసరమేనని మనము అంగీక రింపక తప్పదు. మత గ్రంథముల చదివిన మాత్రాన గలుగు జ్ఞానము మతముతోడ సమానమనుట పొసగదనుట సత్యమే. మనకు మతధర్మ బోధ లభ్యముకాని యెడల, దాని తర్వాత శ్రేష్ఠతమముగా నెన్నబడు బోధనైనను మన బాలురకును బాలికలకును, సమకూర్చి యంతటితో నైన తృప్తిపడవలసియుందుము. అట్టి బోధ పాఠశాలలలో లభించినను, లేకున్నను పెద్దవారగు విద్యార్థులు తదితర విషయములందువలెనే, మత విషయములందును స్వయం సహాయకళను అభ్యసింపవలసి యుందురు. వారు తమ సొంత చర్చాసమితులను, చర్చాసంఘములను పెట్టు కొను నటులనే, ఇందుకొఱకుగూడ సొంతముగా తరగతులను ప్రారంభింప వచ్చును. షిమోగానగరమున కళాశాలయొక్క ఉన్నత పాఠశాలయందలి విద్యార్థులయెదుట నే నుపన్యసించు సమయమున, సభలో విచారణ చేయుట మూలమున దాదాపుగా నక్కడనున్న నూరుమంది హిందూ బాలకులలోను ఎనిమిదిమంది మాత్రము భగవద్గీతను చదివినవారు కల రని నేను తెలిసి కొంటిని. అటుల గీతను పఠించిన కొలదిమందిలో, దాని యర్థమును తెలిసికొనినవారు కలరా ?' యను ప్రశ్నకు ప్రత్యుత్తరముగా చేయి నెత్తినవారు నొక్కరును లేరైరి. అక్కడనున్న ఐదారుగురు మహమ్మదీయ బాలురలో, ఖురాను చదివియున్నటుల వా రందఱును చేతుల నెత్తిరి. మఱియు ఒక్కడు మాత్రమే దాని అర్థమును గ్రహించితి ననగలిగెను. నా అభిప్రాయములో అర్థము చేసికొనుటకు గీత చాల సులభమైన పుస్తకము. పరిష్కారము చేయుటకు కష్టముగానుండు కొన్ని ప్రధాన సమస్యలు దానిలో నున్నవి. ఐనను గీతయొక్క సామాన్యార్థము అసందిగ్ధముగా నున్నదని నా భావము.

హిందూ సంప్రదాయము లన్నియు గీతను ప్రమాణగ్రంథముగా అంగీకరించుచున్నవి. బలాత్కారమువలన విధిగా నొప్పుకొని తీరవలయు నను సూత్రము దానియందేమియు లేదు. సంపూర్ణమును తర్కబద్ధమును నగు నీతిశాస్త్రమును సంక్షిప్తముగా గీత తెలుపుచున్నది. అది మెదడు నకును, హృదయమునకును కూడ తృప్తి నొసగుచున్నది. కావున అది తత్త్వశాస్త్ర పరమును భక్తిపరమును నగు గ్రంథముగ నున్నది. అది సర్వజనాంగీకారము బడయగల గ్రంథము భాష అతి సులభము.

ఐనను చాలకాలమువఱకు కోట్లాదిజనులు సంస్కృతభాషాజ్ఞానము లేనివారుగనే యుందురు. వారికి సంస్కృతభాష తెలియని కారణమున భగవద్గీతోపదేశము లభింపకుండచేయుట ఆత్మహత్యతో సమానమగును.

ఈనాడు గీత నాకు బైబిలువంటిది కాదు; ఖురానువంటిది కాదు; అంతకు మించినదే; గీత నా తల్లి! నన్ను కన్నతల్లిని పోనాడుకొని చాలకాలమైనది. కాని ఈ "అమరజనని" అప్పటినుండి నా చెంతనిలిచి ఆ తల్లి లేని కొఱతను తీర్చినది. ఈమె వికారముల చెందుటలేదు. నన్నె ప్పుడు చేవిడువదు. నా కెప్పుడు కష్టము కలిగినను, దుఃఖము వాటిల్లి నను నన్నక్కున జేర్చుకొని రక్షించును. అస్పృశ్యతా నివారణోద్యమ ముతో నేను తంటాలుపడునప్పుడు, విద్యాధురంధరు లొసగు భిన్న భిన్నాభిప్రాయములతో నలిగిపోయెడివాడను. నేడాచారమై వెలుగుతీరున అస్పృశ్యతకు హిందూమతమున స్థానములేదని కొంద ఱుద్ఘోషించుచు, దానిని తొలగించుటలో నా ప్రయత్నముల నాశీర్వదింతురు. ఆదినుండియు అస్పృశ్యతకు హిందూమతమున ప్రధానస్థానము కలదని మఱికొందరు వక్కాణింతురు. అట్టి పరిస్థితులలో నే నెవరిమాట ననుసరించుట ? నాపని మున్నీట మునిగిన ట్లుండెడిది. వేదములు స్మృతులు నా కుపకరించ వయ్యెను. అంతట నేను గీతామాతదాపు చేరి, "తల్లీ! ఈ పండితులు నన్ను చిక్కులపాలు చేయుచున్నారు. ఈ ఆపదనుండి నన్ను రక్షిం చుము" అనెడివాడను. అప్పుడు నా తల్లి నగుమోముతో "తొమ్మిదవ అధ్యాయములో నేను ప్రకటించు రక్షణ బ్రాహ్మణుల కొక్కరికొఱకే కాదు; అయ్యది పాపులకును, కులబాహ్యులకును, అణగద్రొక్కబడిన నిరాశ్రయులకు సయితము ప్రాప్యమగునదే నని తెలిపినది. అయినను

ఆ వరమున కర్హులగుటకై మన మా జననియెడల విధేయులమై భక్తి విశ్వాసములుగల బిడ్డలమై వర్తించవలెను. భక్తిగలట్లు మాత్రము నటించుచు అవిధేయులమును విద్రోహులము నగు సంతాన మగుదుమేని భంగపడుదుము.

వీధులం దిరుగాడు సామాన్య జనునకు గీతాబోధ ఆచరణ యోగ్యము కాజాలదను ఆక్షేపణ యొకటి గలదు. ఆ మాట నిరాధారమని నా మనవి. లోకమాన్యుడు తన పాండిత్యవిశేషముచేతను, తన విజ్ఞాన సర్వస్వ బలముచేతను దివ్యభాష్యము నొండు రచింపజాలినాడు. తన బుద్ధిపాటవము ప్రకటించుట కవకాశము నొసగు తత్వరహస్యముల కోసమై గీత వానియెడ నొప్పినది. అయినను పామరు డందువలన దిగులొందపనిలేదు. మీ రా పదునెనిమిది అధ్యాయములను వల్లెవేయజాలరేని, మొదటి మూ డధ్యాయములను శ్రద్ధతో పఠించుడు. హెచ్చు వివరణలతోడను, విభిన్న దృక్పథములనుండియు, తక్కిన పదునైదు అధ్యాయములలో చెప్పబడియున్నదే క్లుప్తముగ నందు దెలుపబడియున్నది. ఈ మూడు అధ్యాయముల బోధను సయితము, వానినుండి యేర్చి కూర్చిన కొలది శ్లోకములలో సంగ్రహముగ దెలుపవచ్చును. దీనికి తోడుగా మూడుస్థలములలో విస్పష్టముగా నింకను ముందునకు పోయి అయా మతము లన్నిటిని విడిచివేసి, ఈశ్వరుని నొక్కనినే శరణు జొచ్చుదని తెలుపుచున్నది. దీనినిబట్టి గీత చాలదుర్గ్రాహ్య గ్రంథమనియు, పామరుల కర్థమగునది కాదనియు చెప్పు నాక్షేపణ యెంత నిరాధారమైనదో గ్రహింపవచ్చును. గీత విశ్వజనని. ఆమె ఎవ్వానిని గాని త్రోసిపుచ్చదు. దఱిజేరవచ్చు ప్రతివానికిని ఆదరముతో కవాటము తెఱచును. యథార్థముగా గీత నాశ్రయించు భక్తుడు, ఆశాభంగ మన నేమియో యెఱుంగడు. ఆత డభివర్ణించుటకు శక్యముగాని ఆనందమును శాంతిని సదా యనుభవించును. కాని ఆ శాంత్యానందములు శంకాన్వితునికిగాని, తన పాండిత్యముం గూర్చియు బుద్ధిచాకచక్యముం గూర్చియు డంబములు పలుకు నరునికి గాని లభింపజాలవు. అది వినయశీలుని సొమ్ము; నిశ్చలమగు నేకాగ్రహృదయమును పూర్ణమగు విశ్వాసముగలవానికే దక్కును. అట్టిభావముతో గీత నారాధించి, నిరాశ జెంది మఱలినవాడు లేడు.

మన విద్యార్థులు అల్పవిషయముతో కలవరము చెందుచున్నారు. ఒక పరీక్షలో తప్పిపోవుటవంటి స్వల్పవిషయము చాలును, వారిని అంధకారమయమగు నిరాశాసాగరమున ముంచుటకు అపజయముగా జూపట్టు నంశముననే యెదిర్చి నిలువబడు నభినివేశదీక్షను వారియందు గీత కీలు గొలుపగలదు. కర్మ చేయుటకు మాత్రమే మన కర్తృతకలదనియు, దాని ఫలమునెడ మన ప్రమేయము లేదనియు, మూలమున జయాపజయములు ఏకవిషయమేననియు గీత బోధించుచున్నది. వినిర్మలధర్మముం గూర్చి మనోవాక్కాయములతో ఆత్మసమర్పణము చేయుచు, వ్యర్థపుకోరికలకును, శిక్షణ నెఱుంగని యుద్రేకములకును మనస్సున లొంగిపోవలదని హెచ్చరించుచున్నది. గీత నాకు సదా నవ్యతరోపదేశముల గావించుచుండునని, సత్యాగ్రహినగు నేను ప్రకటించుచున్నాను. ఎవరేనివచ్చి అది నా వట్టిభ్రమయని వాదించునెడల, ఆ నా భ్రమయే నా కఖండైశ్వర్యమగునని వక్కాణింతును.

ప్రతియుదయమునను గీతాపఠనముతో నాటి కార్యక్రమమును ప్రారంభింపుడని నేను విద్యార్థులను హెచ్చరించుచున్నాను. నాకు తులసీదాసుడన ప్రీతియు, భక్తియు గలదు. దుఃఖపరితప్తమైయున్న ప్రపంచమునకు రామనామమంత్ర మనెడి నమృతవృష్టి నొసగిన ఆ మహానుభావుని నేను పూజింతును. నే నినాడు మీకు తులసీదాసునుగూర్చి తెలుపబోవుటలేదు. పరిశోధించుచు నాక్షేపణల జేయు బుద్ధితో గాక, భక్తివినయపూరితహృదయముతో గీతను పఠింప నారంభము చేయుడని చెప్పుచున్నాడను. అటుల నాశ్రయించితిరా గీత మీ యభీప్సితముల దీర్చును. పదునెనిమిది అధ్యాయములను వల్లెవేయుట అలతికార్యముకాదు. కాని ప్రయత్నించిచూచుట లాభప్రదమేసుడీ! దాని మధురామృతము నొక్కసారి మీరు చవిజూచితిరా, మీ యనురాగము దినదినాభివృద్ధి గాంచగలదు. గీతాశ్లోక పఠనము అపదలందు మీ కండయై నిలుచును; దుఃఖములం దుపశాంతి గూర్చును; ఏకాంతవాసశిక్ష ననుభవించుచు చీకటి గదిలో పడియున్నను నిన్నోదార్చును. మఱియు నీ శ్లోకములు నీ పెదవులపై నుండ తుది యాహ్వానమువచ్చి, అసువుల బాసినను, నీకు బ్రహ్మనిర్యాణము, పరమముక్తి చేకూరగలదు.

# ౩. సంతాన నిరోధము

## సంతాననిరోధ సాధనములు

కొన్ని వర్గాలవారిలో వృద్ధు లేమిచెప్పినను అధిక్షేపించుట నేడు యువకుల కాచార మైపోయినది. వయసుచెల్లిన పురుషులుగాని, స్త్రీలు గాని చెప్పినదానినెల్ల త్రోసిపుచ్చుట అక్రమమని మనదేశపు యువకులను హెచ్చరించుచున్నాను. తఱచుగా పసివారి నోటినుండి వచ్చునటులనే ముసలివారి ముఖమునుండియు విజ్ఞాన వాక్కులు వెడలగలవు. ఎవరి వలన నేమి వెడలివచ్చినను వివేకము, అనుభవము అనెడు నొఱపిడి రాళ్ళతో పరీక్షించుట యుచితసూత్రము.

సంతాన నిరోధోపాయముల గుఱించి ప్రస్తావించెదగాక. "శాస నానుగుణ్యముగ చేసిన ఋణములను తీర్చు టెంత విధాయకమో కామ తృప్తియు నంతటి సద్ధర్మమనియు, అటుల చేయనియెడల బుద్ధిశక్తి భ్రష్టమై శాస్తి అనుభవింపవలసివచ్చుననియు, చెవులు దిమ్మెక్కి పోవు నంతగా బోధ వినవచ్చుచున్నది. సంతానాపేక్షయు, కామకాంక్షయు, వేఱు చేయబడుచున్నవి. సంతానాకాంక్ష యున్నవారిపట్ల తప్ప తదితరు లకు సంతాన నిరోధసాధనల ప్రయోగ మర్త్యకార్యమే యను ప్రచారము సాగినది. ఎటుచూచినను ఈ ప్రచారము మహోపద్రవకరమని చెప్ప సాహసించుచున్నాను. సృజనధర్మమును దుర్వినియోగము చేయుట మూలమున మధ్యమతరగతి మగవారు వెడగులై పోవుచున్న ఈ దేశ మున ఇట్టి ప్రచారము మిక్కిలి అపాయకరమగును. కేవల కామవాంఛా తృప్తి సద్ధర్మమే యగునెడల అసహజములగు ముష్టి మైధునము మొదలగు నుపాయములు ప్రోత్సహింప దగినవే యగును. అస్వాభావిక సంభోగ క్రియలను సమర్థించు ప్రసిద్ధ పురుషులు లేకపోరు. కాని ఇది మహాఘోరము. అట్టి దురభ్యాసముల నెట్లో మాననీయములని ధృవపఱచు నెడల బాలురు బాలురు; బాలికలు బాలికలు కూడి పరస్పరము కామ వాంఛల దీర్చుకొను కోరికలు చెలరేగిపోవును.

ఈ అలవాటుల దుష్ఫలితములు కొంతమందికే తెలియును. వీరికిని, సంతాననిరోధ సాధనములకును వ్యత్యాస మంతగా నా మనస్సునకు

గోచరించుటలేదు. ఇట్టి సంతాన నిరోధకోపాయములు కొందఱు ప్రము ఖుల యామోదము బడయగల్గుటయు శాస్త్రసమ్మతములే యను ప్రచార మును వచ్చి, సంఘజీవన పారిశుద్ధ్యత కొఱకై పాటుబడు సంస్కర్తల ప్రయత్నములను చిక్కుపఱచుచున్నవి. బావగ్రహణ కనుకూల మగు వయస్సున పాఠశాలలందును, విశ్వవిద్యాలయములయందును చదువు కొనుచున్న అవివాహితలగు కన్యలు సంతాననిరోధ వాఙ్మయమును, తత్ప్రచారమునకు బూనిన పత్రికలను అత్యాతురతతో పఠించుటయు, వానిని సంపాదించుకొనుటయు నే నెఱుంగుదునని నేదో అతి నిగూఢ రహస్యమును బయలు పెట్టుచుంటి ననుకొనకుడు. ఆ సాధనోపయోగ ములు వివాహిత లగువారికడ మాత్రమే గుప్తముగ పడియుండుట అసంభవము. పశువాంఛా నివృత్తియే గమ్యమనియు, పరమ ప్రయోజన మనియు తలచి, అందువలన గలుగు దుష్ఫలితముల నుపేక్షించుట వలన వైవాహిక ధర్మముయొక్క పవిత్రతయే నాశనమగుచున్నది. ఇష్టము లేకున్నను బిడ్డల గనవలసిన ఆపదనుండి స్త్రీలను గాపాడు చుంటిమనెడు దుర్భ్రమలో పడి, సంతాన నిరోధ సాధనముల గుఱించిన ప్రచారమును అత్యుత్సాహముతో సాగించుచున్న స్త్రీలును పురుషులును ఎన్నశక్యముగాని కీడును చేకూర్చుచున్నా రనుటలో నిసుమంతయు సందేహము లేదు. యథార్థముగా ఎవరి సంతానమునకు పరిమితి యవ సరమో అట్టివారిని వీరు సమీపింపలేకనే యున్నారుకూడను. పాశ్చాత్య దేశపు స్త్రీలకువలె మనదేశపు స్త్రీలకు తగిన శిక్షణముగాని, విజ్ఞానము గాని లేదు. యథార్థమున కీ ప్రచారము మధ్యమ తరగతి ప్రజల యుప యోగార్థము సాగుటయు లేదు. మఱియు బీదతరగతులవారికి అవసర మగునంతగా నిట్టి జ్ఞానము మధ్యమ తరగతివారికిని అవసరము కాదు.

ఈ దుష్ప్రచారము వలన మహోపద్రవము చేకూరనున్నది. ప్రాచీన వివాహధర్మముల భగ్నపఱచుటయు, దానికి మారుగా ఈ ప్రబోధమును ఆచరణలోనికి తెచ్చుటయు జాతియొక్క నైతిక శారీరక వినాశమునకు మూలమగును. వృథాగా వీర్యమును వ్యయపఱచుట వలని దోషము పురాతన వాఙ్మయమునందు విశదీకరింపబడి యున్నది. అయ్యది యజ్ఞానజనకమగు మూఢవిశ్వాసమని త్రోసిపుచ్చజనదు. శ్రేష్ఠ మగు విత్తనమును ఊసరక్షేత్రమునందును, సారవంతమగు భూమి

యందు తప్ప గింజలను నాటు సేద్యగానిని మెచ్చుకొందుమా ? సర్వేశ్వరుడు అత్యంత ప్రభావవంతమగు బీజమును పురుషునకును, లోకమున నెక్కడను లభ్యము కాజాలని పరమోత్కృష్ట క్షేత్రమును స్త్రీకిని ప్రసాదించియున్నాడు. తనకుగల సంపదలలో నెల్ల మిన్నయగు వీర్యమును పురుషుఁడు వ్యర్థము గావించుట మహాపాతక మగును. అందుకు మారుగా తనయధీనమం దున్న మహామాణిక్య మనందగు వీర్యమును పురుష డత్యంత జాగరూకత వహించి పోషించుకోవలసియున్నాడు. ప్రాణప్రవర్ధన సమర్థమగు తన గర్భక్షేత్రమున వ్యర్థముగ పోగొట్టు తలంపుతో బీజసంరోపణము నంగీకరించు స్త్రీయు మహాపాతకి యగును. స్త్రీగాని, పురుషుడుగాని తమకు ప్రసాదింపబడిన పరమ పావనశక్తులను దుర్వినియోగముచేయుచో మహాదోషి యగుననుటకు సందేహ మింతయు నుండదు. వారికి ప్రసాదింప బడియున్న నిక్షేపమును కోల్పోదగదు. సంభోగవాంఛ మహా పవిత్రమగు నిష్పితమగును. లజ్జింపదగిన దందేమియు లేదు. అయినను అట్టి సంభోగమును సృజన కర్మనిమిత్తము మాత్రమే వినియోగపడవలసియున్నది. అన్యథా దానిని వినియోగ పఱచుట మానవజాతియెడను, మాధవునియెడను గావించు మహాపరాధమే యగును. సంతాన నిరోధ సాధనలు ఏదో యొక విధమగునవి ప్రాచీన కాలమునందు నుండెడివే. ఇక ముందునుగూడ నుండగలవు. కాని పూర్వము అట్టివాని వినియోగము మహా పాతకముగా నెంచబడెడిది. పాపాచరణము నేను మహిమవంత మగు పుణ్యకార్యము చాటుగా మోస కృత్యము నేడు మన తరమువారి పాలిట బడియున్నది.

ఒక విద్యార్థి "నేను నిగ్రహము పూనగలను. కాని నా భార్య పూనజాలదు. ఆమె సంతానము నపేక్షింపదు. కాని సంభోగమును కోరును. నేనేమి చేయవలసియుండును ? ఆమెను తృప్తిపఱచుట నా విధి కాదా ? వేఱు విధాన తృప్తిపఱచుకొన నిచ్చుపాటి యౌదార్యము కల వాడను గాను............" అని వ్రాయుచున్నాడు.

ఈ యుత్తరము వ్రాసిన యువకుడు సానుభూతి చూపదగినవాడు. సంతానము గనుటే సంభోగమునకు ఏకైకవాంఛితార్థమని క్రొత్తగా కని పెట్టబడిన ధర్మసూత్రముగ కొందఱికి తోచుచున్నది. ఈ సూత్రమును నే

నెఱిగియే యున్నను ఇంతకుపూర్వ మెన్నడును దాని కర్థమగునంత ప్రాధాన్యత నొసగియుండలేదు. నామట్టుకు నాకు అదొక సజీవమగు ధర్మసూత్రముగా గాన్పించుచున్నది. దానిని భంగపఱచి తఱచుగా శాస్తి ననుభవించుచున్నాము.

నా కుత్తరము వ్రాసిన యతడు సాటిలేని దాని విలువను గ్రహించి నాడు. కావున భార్యయెడ వినిర్మలప్రేమయు, తనయం దాత్మవిశ్వాస మును కలగినవా డగునేని ఆమెను తన దృక్పథమునకు త్రిప్పుకొన జాలును. తా నాత్మనిగ్రహమును పూనగలనను నప్పుడు, నిష్కపటము గనే చెప్పుచున్నాడా ? వానిలోని పశువాంఛ తోడిజీవుల సేవకొఱకగు నుత్తమవాంఛగా పరివర్తనము పొందినదా? భార్యయందు కామోద్రేకము కల్పించు సర్వము నతడు సహజముగ మానుకొనెనా ? హిందూశాస్త్ర ములలో పేర్కొనబడిన 8 విధములగు మైధునములలో సైగతోడియైనను సంభోగసూచన చేయుటయు నిమిడియున్నదని అతడు గ్రహించినవా డేనా ? తక్కిన వాని యన్నింటి స్పర్శ లేనివాడేనా ? కానిచో, తన భార్యయందలి సంభోగవాంఛను రూపుమాపుటకు పూనికవహించి ఆమెను పరమపవిత్రప్రేమతో జూచుగాక. సంతానకాంక్షతో తప్ప కేవలము ఇంద్రియలాలస కొఱకు కలియుట దేహమునకు హానికరమని ఆమెకు నచ్చునటుల బోధించుగాక. వీర్యముయొక్క మహిమను గుఱించి బాగుగ తెలుపునుగాక. ఆమెయందు పొడసూపు కామవికారమును శమింపజేయు టకై ఆరోగ్యప్రదములగు పరిశ్రమలందు నియోగింపుచు, ఆమె ఆహార వ్యాయామవిషయములందు చక్కని నియమముల గూర్చుటకు ప్రయ త్నించుగాక.

అన్నిటిని మించి తనకు మతధర్మమునందు విశ్వాసమున్నయెడల, తనకుగల సజీవభక్తిని ఆమెలో పాదుగొలుపుగాక. శుద్ధచైతన్య సత్స్వ రూపమే యగు దైవమునందు సజీవభక్తి లేనిచో బ్రహ్మచర్యదీక్షను పాలించుట అసాధ్యమని నా దృఢవిశ్వాసము. దైవముయొక్క ప్రమేయ మును జీవితమునుండి బొత్తుగ తొలగించివేసి, సజీవదైవతమునందు సజీవభక్తి ప్రసక్తిలేకుండ, జీవిత పరమోన్నతాదర్శమును చేరగల్గుదు మని వక్కాణించుట నేడు పరిపాటి యైపోయినది. మనకంటె ననంత

ముగా ఘనమై పఱగు దైవీశక్తి యందు విశ్వాసము లేనిది, ఆ దివ్య శక్తియొక్క అవసరమును గుర్తించనిది బ్రహ్మచర్య ధర్మమును మనస్సునవట్టునటుల నుద్బోధించుట అసంభవమని నా నమ్మకము. ఈ విశ్వమెల్ల దేనికి లోబడి స్థితిగాంచుచున్నదో, ఆ దైవీశక్తి శాసనమునందు దృఢవిశ్వాసము లేకుండ పూర్ణనిష్కళంక జీవనము దుస్సాధ్యమని నా యనుభవమువలన నేర్చుకొంటిని. అట్టి విశ్వాసము లేని నరుడు సముద్రమునుండి దూరముగ విసరివేయబడిన నీటిచుక్కవలె నాశనమందకతీరదు. సముద్రమందలి ప్రతి జలబిందువును, దాని గంభీరతను పొల్గొనుచున్నది. మఱియు తన జీవనమునకు ప్రతిభను చేకూర్చుకొనుచున్నది.

## విద్యార్థికుని సమస్య

మఱియొక విద్యార్థి యిటుల వ్రాయుచున్నాడు.—

వ్యర్థ గౌరవభావము నారోపించుకొనక సామాన్య పారిశ్రామికులతో పాటు లెక్కించుకొను డని మీరు విద్యార్థులకు సలహా నొసగుచున్నారు.

నేను లక్నో విశ్వవిద్యాలయమున ఎం. ఏ. చదువు విద్యార్థిని. నా వయస్సు సుమా రిరువదియొక్క సంవత్సరములు. నాకు విద్యార్జనమున అభిలాష మెండు. నా జీవితకాలములో నేను నేర్వగలంతటిని నేర్చుకొన గోరుచున్నాను. జీవితమునుగూర్చి మీ భావవైఖరి నా కుత్సాహము గొలుపుచున్నది. ఇంకొక నెలదినములలు ఎం. ఏ. తుదిపరీక్ష ముగియును. అంతట నేను నా జీవితపథమున ప్రవేశింతు నందురు.

నా భార్యకాక, నాకు నలుగురు తమ్ములు (అందొకడు పెండ్లియైనవాడు), ఇద్దరు చెల్లెండ్రు (ఇద్దఱును పండ్రెండు వత్సరముల లోపువారు), తల్లియు, తండ్రియు కలరు. వీరి నందఱిని నేను పోషించవలసియుండును. మూలధనముయొక్క ఆధారము లేదు. ఉన్న భూవసతి చాల తక్కువ.

నా చెల్లెండ్రయు, నా తమ్ములయు చదువులకై నే నేమి చేయవలసియుండును? నా చెల్లెండ్ర వివాహము ఆలసించుటకంటె త్వరలోనే

చేయవలసియుండును. ఇంకను మా యందఱికి అన్నవస్త్రము లెట్లు రా గలవు ?

నాకు గౌరవజీవన పరిమాణమునం దభిమానము కలదు. ఆరోగ్య దాయకమగు జీవనదశ నాకు కావలయును. నాకును నాపై నాధారపడి యున్నవారికిని సంభవించగల అవాంతరావసరముల గడుపుకొనుట కాధారములు కావలయును. ఎంత కాదన్నను రెండుపూటల నారోగ్యప్రద మగు నాహారము, శుభ్రమగు వస్త్రములు దొఱకగల సమస్యయే అది. మిత వ్యయముతోగూడిన న్యాయసమ్మతమగు జీవితమునే నేను కోరు నది. అన్యుల పీడించి ధనశోషణము చేసిగాని, శరీరము నమ్ముకొనిగాని జీవనోపాధిని గూర్చుకొను దురాశ నాకు లేదు. దేశాభిమానముతో కొంత చేయవలయునను అపేక్షయు నాకు గలదు. మీరు గావించు సూచన లను నా చేతనైనంతవఱకు అనుసరింప వాంఛించుచున్నాను.

కాని నేనేమి చేయవలసియుండునో నాకు గోచరించుటలేదు. ఎక్కడ ఎటుల ప్రారంభము చేయవలయునో ? నా విద్యాభ్యాసమో విధ్వంస కారకమగునంతగా వ్యర్థసిద్ధాంత స్వరూపమైనది. సర్వానర్థ నివారకముగా మీరు ప్రతిపాదించు నూలువడుకు కార్యమును చేపట్టుట కొక్కొక్కప్పుడు సంకల్పింతును. కాని, దానిని నేర్చుకొను టెట్లు ? ఆ వడకిన నూలును నే నేమిచేయుట ?

సరే. నా యీ పరిస్థితుల గమనించియే, సంతాన నిరోధకోపాయ ముల నవలంబింపు మందురా ? ఇంద్రియ నిగ్రహమందును, బ్రహ్మ చర్యమునందును నాకు విశ్వాసము గలదని మీకు నమ్మకముగా చెప్పగలను. అయినను నేను బ్రహ్మచర్యనిష్ఠుడ నగుటకు కొంత కాలము పట్టును. కృత్రిమసంతాన నిరోధ సాధనముల వినియోగించిననేతప్ప. నేను వాంఛించు ఇంద్రియనిగ్రహము పూర్తిగ నాచరణలోనికివచ్చులోపల నాకు పిల్లలు పుట్టవచ్చును. అందుమూలమున ఆర్థికముగా వినాశన మును గూర్చుకొన్నినవాడ నగుదునని నాభయము. మరియు సామాన్యా రోగ్యపతియు, ఉత్సాహభావభరితము నగు నా భార్యయొక్క జీవితమును పాటించునో, ఆమెను బహ్మచర్యము నిప్పుడే అవలంబింపుమని బలాత్క రించుట యుచితకార్యము కాదని నాకు తోచుచున్నది. సామాన్యముగా

స్త్రీ పురుషులందు సంభోగేచ్ఛకు ఉచితస్థానము కలదుగదా! నే నందుకు వ్యతిరేకుడను కాను. మఱియు బ్రహ్మచర్యమును గుఱించియు, ఇంద్రియలోలతవలన అనర్థముల గుఱించియు మీరు వ్రాయు వ్యాసము లను చదివి అర్థమును గ్రహించుపాటి అవకాశము నా భార్యకులేదు.''—

ఈ విద్యార్థి అభివర్ణించుతీరున వాని చిక్కులన్నియు దుర్ఘటములే యైనను, అవన్నియు స్వయంకల్పితములే. వాని స్థితియు మన దేశమందు ప్రచారములోనున్న విద్యావిధానమును ఎంత భ్రాంతిమయముగ నుండెనో అతని చిక్కులు పేర్కొనబడిన మాత్రాననే తెల్లమగుచున్నది. విద్య కెంతయో ఘనతర ప్రయోజనము కలదని నా భావము. లక్షలాది యువ జనులలో కలిసి తా నొక్కడనని యీ విద్యార్థి లెక్క వేసికొనవలయును. అప్పుడు తనతో సవయస్కులగు పురుషులును, స్త్రీలును లక్షలకొలందిగా తన పట్టమువలన తనకు చేకూర వలయునని యాశించు సదుపాయ ములు లేనివారలే నని అతడు గ్రహింపగల్గును. అతడు పేర్కొనిన బంధువర్గము నంతను పోషించు బాధ్యత నత డేల పూనవలయును ? పెద్దవారై శరీర సౌష్ఠవము గలవారు తమ జీవనోధికై తా మేల పాటు పడరాదు ?

దీనికి పరిహారముగా, అతడు నేర్చుకొనిన విషయము లనేకము అతడు విస్మరింపవలసియుండును. విద్యను గూర్చి తనకు గల అభి ప్రాయములను పునర్విమర్శ చేసికొనవలసియుండును. అతడు పొందిన అధికవ్యయ కారణ మగు చదువులకే అతని చెల్లెండ్రును యత్నింప తగదు. ఏదోయొక చేతిపనిని శాస్త్రవిధిగా అభ్యాసముచేయుచు బుద్ధి వికాసమును పొందవచ్చును. వా రటులచేసిన తక్షణమే తమ శరీర ముతోపాటు బుద్ధినిగూడ పక్వదశకు తెచ్చుకొన గలుగుదురు. ప్రజాళిని తమ మేలుకొఱకై వినియోగించుకొన గోరుకొనుటకు మాఱుగా తాము వారిసేవ చేయవలసినవా రని గ్రహించునెడల తమ ఆత్మకుపై తము వికాసము చేకూర్చుకొనినవా రగుదురు. అన్నలతోపాటు తమ జీవనో పాధిని తాము సంపాదించుకొవా రగుదురు.

తన లేఖలో అతడు పేర్కొనిన చెల్లెండ్ర వివాహమును గుఱించి విచారింతము. ఆలసించుటకంటె త్వరలోనే వారి వివాహములు జరుగ

నున్న వనుటలో వాని భావము నాకు బోధపడుటలేదు. ఏదెట్లున్నను, ఇరువదేండ్ల ప్రాయము వచ్చులోపల వారికి పెండ్లి యైతీరవలసినంత అగత్యము కాన్పించదు. కాబట్టి ఇన్ని సంవత్సరములకు ముందుగా ఆ విచారము పెట్టుకొను నవసరము లేదు. జీవితవిధాన మంతటిని పునర్వి మర్శ చేసికొనినయెడల అతని చెల్లెండ్రు తమ పతులను తామే వరించు కొనునటుల నేర్పాటు చేయవచ్చును. వివాహ వ్యయమందురా, ఒక్కొక్క రికి ఐదు రూపాయలు మించవలసిన అవసర ముండదు. అటువంటి పెండ్లిండ్లను నేను చాల చూచియున్నాను. ఆ వరులును, వారి పెద్దలును స్థితివంతులగు పట్టభద్రులే సుడీ!

నూలువడకు పాఠములను నేర్చుటెక్కడనో, ఎట్లో తెలియజాలని ఈ విద్యార్థివిషయము చూడ నాకు జాలిగొలుపుచున్నది. తెలివితేటలతో విచారించునెడల వాని కా పని నేర్పజాలు యువకు లనేకులు ఆ లక్నో నగరముననే గలరు. మఱియు నూలువడకుపని, కాలమునంతను పూర్తిగ నాక్రమించి పల్లెటూరిజీవనమును వరించు స్త్రీ పురుషులకు జీవనోపాధి నీయగల వృత్తిగా త్వరితగతిని పరిణమించుచున్నను, ఈ విద్యార్థి ఆ వృత్తినే ఆశ్రయింపవలసిన అవసరము లేదు. ఏది అనువగునో, ఏదికాదో తానే నిర్ణయించుకొని అవలంబించుటకు వలసినన్ని విషయములను పేర్కొంటినని నా నమ్మకము.

ఇక సంతాననిరోధ సాధనములమాట విచారింతము. ఆ సందర్భ మున చూపట్టు చిక్కుపైతము భ్రమాజనితమైనదే. తన భార్యయొక్క తెలివితేటలు అల్పమని భావించుటలో అతడు పొరబడుచున్నాడు. ఆమె సామాన్య స్త్రీజనమును పోలినదే యగుచో అతడు ప్రతిపాదించు బ్రహ్మ చర్యదీక్షకు సులభముగా నంగీకరించుననుటలో నాకు సందేహములేదు. అతడు నిష్కపటముగా ఆత్మపరీక్ష చేసికొని తనలో తగినంత ఆత్మనిగ్ర హముకలదా యని తేల్చుకొనవలయును. నాకు లభించియున్న సాక్ష్యము నంతను విచారింజగా, ఆత్మనిగ్రహమునందు స్త్రీకన్న పురుషుడే వెనుక బడియుండు నని తెలియుచున్నది. ఐనను ఈ విద్యార్థివిషయములో వాని ఇంద్రియనిగ్రహ సాధనకు తృణీకరింపవలసినపని లేదు. పెద్ద కుటుంబమును పోషించు బాధ్యతను ధైర్యముతో నెదుర్కొని, అందుకు

వలయునుత్తమమార్గములనతడు కనిపెట్టవలయును.సంతాననిరోధోపాయములను వాడుక చేయువారు వేలకొలదిగా నున్నను వారి మాటయే యెఱుగనివారు కోట్లాదిగ నున్నారని అతడు గ్రహింపవలయును. పిల్లల గను కోర్కె లేకున్నను, పెక్కుసంతానమును గనవలసివచ్చునే యను భీతి ఈ కోట్లాది జనమునకు లేదు. తన కర్మయొక్క ఫలమును తా ననుభవించుటకు ఇచ్ఛయింపకపోవుట పిఱికితన మని నాసూచన. సంతాన విరోధోపాయముల పూనువా రెన్నటికిని బ్రహ్మచర్య ధర్మమును గ్రహింపజాలరు. వారికది అవసరమునుకాదు. సంతాననిరోధోపాయములచే పిల్లలు పుట్టకుండ ఆపవచ్చును గాని, స్త్రీ పురుషుల వీర్యమును అమితముగా నష్టపఱచగలవు. అందునను స్త్రీలకంటె పురుషులు హెచ్చుగా నష్టపడుదురు. కామరాక్షసితో పోరాడ వెనుదీయుట పురుషలక్షణము కాదు. ఈ లేఖను వ్రాసిన యతడు తాను కోరని పిల్లలుపుట్టకుండ తప్పించుకొనుకొఱకు, సుదృఢమును, గౌరవప్రదమును నగు నుపాయముగా బ్రహ్మచర్య వ్రతమునే అవలంబింపవలయును. అట్టి సాధనమున నూరుసార్లు అపజయముగలిగినను నేమి? ఆ పోరాటమునందే ఆనందమున్నది. పరమేశ్వరానుగ్రహమువలన వానికి విజయము చేకూరుగాక.

ఒకరిట్లు ప్రశ్నించుచున్నారు:—బ్రహ్మచర్యమనగానేమి? దానిని సంపూర్ణముగా అనుష్ఠించుట సాధ్యమగునా? అట్లగుచో మీ రాదశను ప్రాప్తించినారా?

## బ్రహ్మచర్యవ్రత మహిమ

'బ్రహ్మచర్యము'నకు పూర్ణమైనట్టియు, సరియైనట్టియు అర్థము 'బ్రహ్మమును గూర్చిన అన్వేషణము'. బ్రహ్మము మనలో ప్రతివానియందును అంతర్యామియై పఱగునుగాన, ధ్యానసాధనవలనను తత్ఫలితార్థమగు సాక్షాత్కారమువలనను వానికొఱకై మనలోపలనే వెదుకవలసియుండును. సర్వేంద్రియ నిగ్రహములేనిది, సాక్షాత్కారానుభవము అసంభవము. కాబట్టి సర్వత్ర సర్వకాలము తలపున పలుకున చేతలందును సర్వేంద్రియ నిగ్రహమును బ్రహ్మచర్యము సూచించుచున్నది.

స్త్రీలుగాని, పురుషులుగాని నిష్కళంక బ్రహ్మచారు లగువారు పరిపూర్ణముగ నిష్పాపులై యుందురు. వా రా కారణముచేత భగవంతు నికి సమీపవర్తులై మెలగుదురు. వారు భగవంతుని బోలువారే.!

అటిరు బ్రహ్మచర్యము సంపూర్ణముగా అనుష్ఠానయోగ్య మను టలో నా కేలాటి సందేహమును లేదు. కాని అందుకొఱ కగు నా ప్రయ త్నము నిరంతరముగా సాగుచున్నను, నాకటువంటి పరిపూర్ణత లభింపలే దని నుడువుటకు సంకోచించుచున్నాను. అయినను ఈ జన్మలోనే నేను దానిని సంపాదింపగలనను ఆశను విడనాడుట లేదు.

మెలకువగా నున్నతరిని నే నెంతయు జాగ్రత్తగా నుందును. నా శరీరముపైని స్వాధీనతను నేను గడించియున్నాను. చాల వఱకు నా వాక్కుపైని నిగ్రహము నాకుగలదు. తలంపును విషయములోనే నింకను చాల ప్రయత్నింప వలసియున్నది. ఏ దేని ప్రత్యేక విషయమునందు నా తలంపును ఏకాగ్రము చేయవలయునని నేను యత్నించునప్పుడు, ఇతర సంకల్పములు వచ్చి పైబడుచుండును. అంతట వారిని పోరాటము సాగును. కాని మెలకువగా నుండు కాలముల వాని పోరాటము నడంప జాలుచున్నాను. ఐనను నిద్రించు సమయమునగూడ నా తలంపులను అదేతీరున నిగ్రహింపజాలకున్నాను. నిద్రలో నానావిధము లగు తలం పులు కలుగుచుండును. ఎన్నడు ననుకొనియుండని కలలు వచ్చు చుండును. కొన్ని సమయములందు, పూర్వ మెన్నడో అనుభవించిన సౌఖ్యముల గుఱించిన ఆరాటము పట్టుకొనును. ఈ ఆరాటములు అపవి త్రములగు నెడల దుస్స్వప్నములు కలుగును. ఈ స్థితి పాపజీవనమును సూచించును.

నా పాపసంకల్పములు అణంచబడుచున్నవేగాని చంపబడుట లేదు. నా సంకల్పములపైని పూర్ణనిగ్రహమే నాకు లభించిన యెడల పది సంవత్సరములనుండి జలుబుతోడను, విరేచనములతోడను, వృక ప్రణముతోడను రోగపీడితుడనై యుండెడివాడనేగాను. ఆత్మ పాపరహితా వస్థను పొందినప్పుడు అది నివసించు శరీరము సయితము ఆరోగ్యముగ నుండునని నా విశ్వాసము. అనగా ఆత్మ పాపమునుండి ముక్తమగు కొలదిని, శరీరమును వ్యాధులు సోకజాలకుండును. ఆరోగ్యమగు శరీర

మనగా బలిష్ఠమగు శరీరమని అర్థముకాదు. సమర్థమగు ఆత్మ దుర్బల దేహమునందు మాత్రమే అధివసించును. ఆత్మబలము విస్తరించిన కొలదిని శరీరబలము క్షీణించును. పూర్ణముగా ఆరోగ్యవంతమగు శరీరము బక్క చిక్కి యుండనగును. శరీరమున రోగము లేకున్నను సులభముగా అంటువ్యాధికి గురికావచ్చును. పూర్ణారోగ్యవంతమగు శరీరము అటువంటివానికి లొంగకయుండును. శుద్ధరక్తము రోగపు పురుగుల నన్నింటిని నెట్టివేయగల శక్తి గలిగియుండును.

మనలో ప్రతివానియందును ఆత్మ ఒకేతీరున ప్రకాశించుచుండును. అన్ని ఆత్మలందును సమానమగు సమర్థతలే యున్నవి. కాని కొందఱు తమ యందలి శక్తులను వికాసమునకు దెచ్చుకొనుచుండ తదితరులు వానిని నిద్రాణదశలో పడియుండ నుపేక్షించుచున్నారు. ప్రయత్నము చేసిరేని వీరును అట్టి అనుభవమునే పొందగల్గుదురు.

ఇంతవఱకు బ్రహ్మచర్యమును గుఱించిన విపులార్థమును ప్రస్తావించితిని. బ్రహ్మచర్యమనగా చెప్పుకొను నర్థమందు తలపున, పలుకున, చేతయందు పశువాంఛల నరికట్టు టని భావము. కామమును నడంచుట చాలకష్టమే కనుక ఈ అర్థముకూడ సరియైనదే. రుచిని నిగ్రహించుటం గూర్చి పట్టుదల చూపకపోవుటవలన కామ నిగ్రహము హెచ్చు కష్ట సాధ్యముగను, అసాధ్యమునుగూడ నగుచున్నది. రోగముచే క్షీణించిన శరీరమందు కామము బలతరముగ నుండునని వైద్యులయభిప్రాయము. కాబట్టి శుష్క శరీరులకు బ్రహ్మచర్యానుష్ఠానము దుస్సాధ్యముగ గాన్పించును.

దుర్బలురయ్యును నారోగ్యవంతులుగా గలవారింగూర్చి ముచ్చటించియుంటిని. దానింబట్టి శరీరవ్యాయామము నుపేక్ష చేయదగు నని యెవరును నర్థము చేసికొనకుందురు గాక. అందులో అతీత బ్రహ్మచర్య మహిమను గుఱించి అసమర్థమగు నా భాషలో నటుల ప్రస్తావించి యున్నాను. సమస్తేంద్రియముల నిగ్రహమును సంపాదింప గడంగువారు, తుదకు దుర్బల శరీరు లగుటకును సిద్ధపడి యుండవలసి వచ్చునని చెప్పితిని. శరీరముంగూర్చిన రోగమే అంతరించిపోవు దశయందు అట్టి శరీరముయొక్క దార్ఢ్యముంగూర్చిన వాంఛయు నుండదు. అయి

వను పశుకామేచ్ఛను జయించిన బ్రహ్మచారి యొక్క శరీరము బలిష్ఠముగను, తేజోవంతముగను నుండవలయును. సంకుచితమగు ఈ బ్రహ్మచర్యము నయితము ప్రభావము కలదియే. కలలందైనను కామ సంకల్పములు రాని నరుడు ప్రపంచమునకు పూజనీయుడే యగును. అటువంటి వానికి ఇతర ఇంద్రియములను నిగ్రహించుట చాల సులభము.

"నా స్థితి కడు శోచనీయము. నేను ఆఫీసులో నుండనీ, త్రోవలో నడుచుచుండనీ, చదువుచుండనీ,పనులు చేయుచుండనీ, తుదకు ప్రార్థన సలుపుచుండనీ రేయింబవళ్ళాకే తీరున దుష్టసంకల్పములు నన్ను వెంటాడుచుండును. నే నిక నా సంకల్పముల నిగ్రహించు టెట్లు? స్త్రీజాతిని కన్నతల్లివలె నేను చూడగలుగు టెట్లు? పవిత్రప్రేమ వినా అన్యము నాకనుల నుండి వెలువడకుండు టెట్లు? నా తుచ్ఛసంకల్ప రాశిని నేను పెకలించివేయజాలు టెట్లు? మీరు రచించిన బ్రహ్మచర్యముం గూర్చినవ్యాసము నా యెదుటనే యున్నది. కాని దానివలన నాకు ప్రయోజనము కాన్పించుట లేదు." అని యొక మిత్రుడు వ్రాయుచున్నాడు.

ఇది హృదయవిదారకముగ నున్నది. మనలో చాలమంది ఇట్టి యాపదయందే యున్నాము. మనస్సు చెడుతలంపుల నెదిరించుచుండు నంతకాలము నిస్పృహజెంద నగత్యములేదు. పాపాచరణమునకు దిగెనేని కండ్లను మూసికోవలెను; చెవులలో దూది గ్రుక్కుకోవలెను. కండ్లితర దిక్కుల చూడకుండుటకై త్రోవను నడచునప్పుడు నేలవంక చూచుచు పోవుట మంచియలవాటు. ఎక్కడ పాపసంభాషణ జరుగుచుండునో బూతుపాటలు పాడబడుచుండునో, అటువంటి తావులనుండి పారిపోవుట మంచిది.

జిహ్వేంద్రియముపైని నిగ్రహశక్తి సంపాదించ వలయును. రుచిని జయించని యతడు కామవాంఛను నిగ్రహింపజాల డనుట నా అనుభవ విషయము. నాలుకను స్వాధీనపఱచుకొనుట అల్పవిషయము కాదు. అయినను కామ విజయము జిహ్వేంద్రియ నిగ్రహముతో సంబంధపడి యున్నది. మసాలాలను వ్యంజనములను పూర్తిగాగాని, సాధ్యపడు

షంతగాగాని వర్జించుట జిహ్వేంద్రియమును సాధించు నుపాయములలో నొకటిగా నున్నది. మనము శరీరమును నిలుపుకొనుటకే తిందుముగాని, రుచికొఱకు గాదను భావమును సతతము స్మరించుచుండుట మరొక బలతరోపాయము. మనము రుచికొఱకు గాక బ్రతుకుకొఱకు గాలిని పీల్చుచున్నాము. దప్పి దీర్చుకొనుటకు మాత్రమే మనము నీరు త్రాగ వలసినట్లు ఆకలి తీర్చుకొనుటకు మాత్రమే మనము భుజింపవలయును. దురదృష్ట వశాత్తు పసితనమునుండియు తలితండ్రులు ఇందుకు విరుద్ధ మగు నలవాటుల నేర్పుచుందురు. మన పోషణనిమిత్తముగాక, భ్రాంతి మయ వాత్సల్యమునకు లోనై నానావిధము లగు రుచ్యపదార్థములను మెక్కనటుల జేసి చెడగొట్టుచున్నారు. ఇంటియందలి ఈ అనర్థపు టాచారముతో పోరాడి దానిని రూపుమాపవలసియున్నాము.

బలవంతుడగు కామశత్రువును జయించుటకు రామనామముగాని, అలాటి మరొక మంత్రముగాని మనకు సమర్థుడగు మిత్రముగా నుప యోగపడును. ద్వాదశాక్షరీ మంత్రమైనను అందు కుపయోగకారి యగును. రామనామము నా బాల్యము నుండియు పరిచయము గలదగుట చేతను, నా చిక్కులలో నిరంతరము నాకు అండయై నిలిచినది కావునను నేను దానిని సూచించినాడను. ఎవ రేమంత్రము నేర్చుకొనినను దాని యందు లీనమైపోవలయును. జపకాలమున నిరంతర సంకల్పములు తొందఱలు కలిగించినను లక్ష్యముచేయదగదు. జపమునందు విశ్వాసము కలిగి దానిని సాగించునతడు తుదకు విజయము సాధించగలడని నా దృఢనమ్మకము. ఆ మంత్రమే జీవగఱ్ఱయై అన్ని యిక్కట్టులనుండియు కాపాడగలదు. ఆ పవిత్ర మంత్రమువలన మన మేలాటి ప్రాపంచిక లాభమును బడయ నెంచదగదు. ఈ మంత్రముల విశిష్టశక్తి మన పవిత్ర వర్తనను సంరక్షించుటయందు గలదు. బుద్ధిశాలియగు ప్రతి సాధకు డును దీనిని తత్క్షణమే గ్రహింపజాలును. మంత్రమును చిలుకవలె పలుకుట చాలదని జ్ఞప్తి నుంచుకోవలయును. మీ హృదయము నంతను వానియందు మగ్నము గావించవలెను. చిలుకలు యంత్రములమాదిరి పలుకును. మనమో అనుచిత సంకల్పములను తొలగించివేయు ఆశయము తోడను, అటు లొనర్చుటలో మంత్రములు మనకు సాయపడునను విశ్వా సము తోడను వివేకము కలిగి జపము చేయవలసియున్నది.

6

నాకు బాగుగ పరిచయముగలవా రొక రిట్లు వ్రాయుచున్నారు:—
" మన మీనాడు పాటించు 'నీతి' అస్వాభావికమైనది కాదా ? అది స్వభావసిద్ధమైన దగుచో సకల యుగములందును సర్వత్ర ఒకేతీరున నుండెడిదిగదా! ప్రతి జాతియు, ప్రతి సంఘమును తమతమ వేర్వేరు వివాహ నియమములు కలిగియుంటున్నారు. వానిని పాలించుటలో మృగములకన్న హీను లై పోవుచున్నారు. ఏమందురా, మృగములందు సామాన్యముగాని రోగములు నరులలో సామాన్యమై కలుగుచున్నవి. శిశువధలు, భ్రూణహత్యలు, బాల్యవివాహములు పశుజాతిలో అసంభవములు కాగా, వివాహములు నొక పవిత్ర కర్మగానెంచు సంఘమునందలి ఘోరశాపములుగా నున్నవి. మనము నీతిధర్మము: లని యనుసరించు నియమముల వలన కలుగు ననర్థములకు అంతులేదు. ఇక హిందూ వితంతువుల దురవస్థ చూడుడు. దానికి హేతువెద్ది ? ఇప్పటి బాల్య వివాహములే కాదా ? ఇక ప్రకృతివైపునకు మఱలి పశులోకమునుండి గుణపాఠమును నేర్వరాదా ?

పాశ్చాత్య దేశములలో స్వేచ్ఛాప్రేమ సిద్ధాంతమును ప్రతిపాదించు వారు సంక్షేపముగా పైని పేర్కొనబడిన వాదనల నాధారము చేసి కొందురో లేక యింకను బలతరమగు వాదనలనే తెలుపుదురో నే నెఱుగను గాని వివాహ సంబంధమును మూర్ఖాచారముగ భావించుట పాశ్చాత్యుల విలక్షణ సిద్ధాంత మనుట నిశ్చయము. అందు కగు వాదనయు పాశ్చాత్యులనుండి యెఱువుతెచ్చుకొనినదే యైనను సమాధానము చెప్పుట దుర్లభము కాదు

నరునకును, పశువునకును పోలికను ప్రతిపాదించుట పొరపాటగును ఈ పోలికయే వాదననంతను విషమము చేయుచున్నది. ఒక పక్షమున కనువర్తించు ప్రకృతి ధర్మము, రెండవపక్షమున కనువర్తించు ప్రకృతి ధర్మమును వేఱుగ నున్నవి. నరునకు తర్కశక్తి గలదు; విచక్షణ చేయగలడు. ఏదోరీతి స్వతంత్రేచ్ఛాశక్తి గలవాడు. పశు వటులలేదు. దానికి స్వతంత్రేచ్ఛాశక్తి లేదు. పాపపుణ్యముల విచక్షణ దానికిలేదు. కీడుమేలులను తేల్చగలదు. నరుడు స్వతంత్రాధికారి గావున, ఈ తారతమ్యముల గ్రహించగలడు. తనపరాప్రకృతి నవ

లంబించునప్పుడు పశువుకన్న నెంతయో యోగ్యుడుగను, తన నీచ ప్రకృతి నవలంబించునప్పుడు పశువుకన్న నెంతయో అధముడుగను వర్తింపగలడు. పుడమిని మిక్కిలి యనాగరికులుగ నెంచబడు జాతుల వారు సయితము కొన్ని సంభోగ నియమముల పాటించుచున్నారు. నియమపాలనమే అనాగరికత యనునెడల, స్వైరవృత్తియే మానవధర్మ మనవలసి వచ్చును. మానవులందఱును నియమశూన్యతయే ధర్మమని వర్తింప గడగునెడల నిరువదినాలుగు గంటల కాలములో భీభత్సమే యెల్లెడల ప్రాప్తించును. పశువుకన్న నరుడు తీవ్రకామేచ్ఛ గలవాడు. కావున, నియమములనెల్ల తొలగించిన క్షణముననే, వాని నిరంకుశ కామదావాగ్ని పుడమినలముకొని మానవజాతినే వినాశము చేసివేయును. పశువున కలవిగాని ఆత్మనిగ్రహము, స్వార్థత్యాగము చేయగలవాడు. కావుననే పశువుకన్న ఘనుడనుట నరునిపట్ల చెల్లుచున్నది.

నేను సామాన్యముగా ప్రబలుచున్నవానిలో కొన్నివ్యాధులు వివాహ ధర్మముల భంగపఱచుటవలన మూడునవిగ నున్నవి. వివాహధర్మము లను ఇసుమంతయు మీరకుండ వర్తించునరుడు నాకుత్తరము వ్రాసిన వాని మనస్సులోనున్న తీరున వ్యాధులచే పీడితుడయిన యుదంతమొక్క టైన గలదేమొ తెలుప నిందు శిశుహత్యలు, బాల్యవివాహములు మున్నగు నవి వివాహధర్మముల భంగపఱచుట కారణముగా సంభవించునవియే ? ఏమందురా, స్త్రీగాని, పురుషుడుగాని యుక్తవయస్సువచ్చి, ఆరోగ్యము కలిగియుండి, నిగ్రహశక్తిగలిగి సంతానము నపేక్షించినప్పుడు మాత్రమే సంభోగము చేయవగునని శాస్త్రము విధించుచున్నది. ఈ శాసనము ననువర్తించునట్టియు, వివాహమును పవిత్రక్రతువుగా మన్నించు నట్టియు నరులు దుఃఖితు లగుటగాని, శాంతి శూన్యు లగుటగాని సంభ వించదు. ఎక్కడవివాహము పావనక్రతువుగ పాటింపబడునో, అక్కడ వివాహసంబంధము శరీరములకు సంబంధించినదిగాక, ఇరువురిలో నెవరు మరణించిననుకూడ భగ్నమైపోజాలని ఆత్మసంబంధముగా పఱగు చున్నది. ఎక్కడ ఆత్మసంబంధము వెలయునో, అచ్చట భర్తచచ్చిన స్త్రీగాని, భార్యచచ్చిన పురుషుడుగాని పునర్వివాహము తలపెట్టుటే పొస గదు; అట్టిది ధర్మ విరుద్ధముగను, దోషముగను నెంచబడును. వివాహ

ధర్మముల త్రోసివేసిన పెండ్లిండ్లను పెండ్లిండ్లె అనదగదు. ఈనాడు యథార్థమగు వివాహములు కొఱవడిపోయిన కారణమున, వివాహ సంస్థను దూషించుటకు మారుగా, ప్రస్తుతము జరుగు విధానమును సంస్కరింపవలసియుండును.

వివాహ మనునది నీతికిగాని, మతమునకుగాని సంబంధించిన బంధము గాదనియు, కేవల మొక ఆచారమనియు, అందునను నతికిన మతమునకును, విరుద్ధమగు నాచారము కావునను, దానివి రద్దుచేయు టొప్పనియు లేఖారచయిత వాదించుచున్నాడు. వివాహము మతమును సంరక్షించు కంచెవంటి దని నా మనవి. ఈ కంచెనే తొలగించితిరా, మతము భిన్నాభిన్నమై వినాశము చెందును. మతమునకు పునాది నిగ్రహము. వివాహమన నిగ్రహముతప్ప అన్యముకాదు. నిగ్రహశూన్యుడగు మానవుడు ఆత్మసాక్షాత్కారమును బడయనేజాలడు. అజ్ఞేయవాదికిగాని, జడవాదికిగాని నిగ్రహావశ్యకత గలదని నచ్చచెప్పుట అసాధ్యము. కాని శరీరము, నశ్వరమనియు ఆత్మ అవినాశి యనియు నెఱుంగు నరుడు ఆత్మనిగ్రహమును, ఆత్మశిక్షణమును లేనిది ఆత్మసాక్షాత్కారము సంభవము కాదని సహజముగనే గ్రహింప గల్గును. శరీర మనునది కాముని లీలావిహారక్షేత్రముగ నుండవచ్చును. లేదా ఆత్మసాక్షాత్కార పవిత్రాలయముగనైన నుండవచ్చును. ఈ రెండవ పక్షమునందు స్వైరవృత్తికి ఆస్కారముండదు. ఆత్మయనుక్షణమును కాయమును నిగ్రహింపవలసి యుండును.

వివాహశాసనము వదలిపోయినయెడ, నిగ్రహధర్మము అనుష్ఠింపబడనియెడ స్త్రీ నీతి బాహ్యామౌస్పర్థకు లక్ష్యమైపోవును. పురుషులు పశువులలీల నిగ్రహశూన్యులై వర్తించు నెడల వినాశమునకే త్రోవబట్టినవా రగుదురు. ఈ విలేఖరి మొఱలకు గురియైన అనర్థములు సర్వమును వివాహధర్మమును రద్దుచేయుట వలనగాక, ఆ వివాహశాసనమును సముచితముగ నర్థము చేసికొని దాని ననువర్తించుట వలననే తొలగునని నా దృఢతరాభిప్రాయము సుడీ.

నా స్వానుభవము చేతను, మఱియు నాయనుచరుల యనుభవము చేతను విరచితములయిన సూత్రములను కొన్ని పేర్కొందు గాక:—

1. బాలురును, బాలికలును నిష్కపట జీవులై వర్ధిల్లగల రను విశ్వాసముతో నిరాడంబరముగను, సహనమార్గమునను పెంచబడ వలయును.

2. వేడిచేయునట్టియు, ఇంద్రియోద్రేక కారణము లగునట్టియు ఆహారములను, కారము, క్రొవ్వు మున్నగువానితో గూడిన పచ్చళ్ళను, నేతిలో వ్రేల్చినట్టియు, మధురములగునట్టియు పిండివంటలను త్యజించ వలయును.

3. భార్యాభర్తలు వేర్వేఱు గదులలో వసింపుచు రహస్య సమావేశములు లేకుండ జీవింపవలయును.

4. శరీర మానసములను ఆరోగ్యవంతము లగు పనులందు సదా నియమించుచుండవలెను.

5. పెందలకడ నిద్రించుటయు, పెందలకడ మేల్కాంచుటయు మంచిది.

6. అపవిత్రవాఙ్మయమును వర్జింపవలయును. దుష్టసంకల్పములకు విఱుగుడు సద్భావ స్వీకరణమే.

7. లోలతను పెంచు నాటకములు, సినిమాలు మొదలగువానికి దూరముగ నుండవలయును.

8. నిద్రలో కలుగు కలలగూర్చి కలవరము చెందవలదు. అట్టివి సంభవించినప్పుడెల్ల చన్నీటి స్నానము చేయుట ధృఢకాయులకు క్షేమకరము. అనిచ్ఛాపూర్వకముగ వచ్చు కలలను నివారించుటకు అప్పుడప్పుడు సంభోగము నాశ్రయించవలయు ననుట పొఱబా టగును.

9. భార్యాభర్తలయెడ నైనను సరియే బ్రహ్మచర్యము ఆచరణ సాధనము కాదని వాదింపతగినంత కష్టమగు విషయము కాదు. అంతేగాక ఇంద్రియ నిగ్రహము సర్వసామాన్యమును సహజ సిద్ధమగు ధర్మముగా నెంచవలయును.

10. అనుదినము పవిత్రజీవనము కొఱకై భగవంతుని ప్రార్థించుట ప్రధానము.

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥ గీత॥

తా॥ దేహధారి నిరాహారియైనప్పుడు వాని విషయములు క్షీణించును. కాని రాగము (ఇచ్ఛ) నశింపదు. ఆత్మ సాక్షాత్కారమైన పిమ్మటనే ఇచ్ఛ నివృత్తియగును.

కాబట్టి మోక్షార్థికి భగవన్నామము భగవత్కృప ముఖ్యాధారము లగును.

మానవ జీవితలక్ష్యము మోక్షము. నేను హిందువుడను గాన దేహబంధముల త్రెంచుకొని ఈశ్వర సాక్షాత్కారమును పడయుటవలన జన్మబంధముల నుండి ముక్తిని బడయుట ధర్మమని నా విశ్వాసము. వివాహము శారీరక బంధముల బిగించునదై మోక్షమార్గమున కడ్డుదగుల దగదు. పూర్ణముగ భగవదర్పితమౌ జీవనము గడపుటకు బ్రహ్మచర్యము సాహాయ్యపడునుగాన మహోపకారకర మగును.

# ౪ ధర్మవాదము.

## న్యాయవాదవృత్తి

న్యాయవాదవృత్తిని అధ్యాత్మసమ్మతముగా నొనర్చు టెట్లను ప్రశ్నవేసినందుకు సంతోషము. ఈ విషయమును గుఱించి నేను సాధికారముగా మాట్లాడజాలనిచో ఎవరును అటుల చేయజాల రని చెప్ప వచ్చును. న్యాయస్థానమునందు గడపిన నా జీవితమునం దంతటను న్యాయసత్యములను నే నిసుమంతయు తప్పివర్తించి యుండలేదు. న్యాయవాదవృత్తిని అధ్యాత్మధర్మసమ్మతముగా మీరొనర్పనెంచుచో, దురదృష్ట వశమున నేడు తఱచుగా సంఘటిల్లుచున్న తీరున, మీ వృత్తిని ధనసంపాదనేచ్ఛకు లోబఱచక దేశసేవకొఱకే సాగింపవలసి యుండుననుటను సదా మదినిడుకొనుడు. తాము దారిద్ర్యపీడ ననుభవింపవలసివచ్చినను కూడ, నిస్వార్థ జీవితముల గడపుచు, తమ న్యాయవాద సమర్థతను దేశసేవకొఱకై వినియోగించిన న్యాయవాద విశారదులు అన్ని దేశములందు నుండిరి. మన భారతదేశమున మనో మోహన ఘోషుని నిదర్శనము మీకు గలదు. నీలిమందు తోటల యజమానుల దౌర్జన్యమును తుదముట్టింపబూని, ఒక్క దమ్మిడీనైన పుచ్చుకొనకుండ తన ఆరోగ్యమును బలియిచ్చి, తుదకు ప్రాణమును సైతము సమర్పించి తన్నాశ్రయించిన నిరుపేదల సేవచేసియున్నా డాయన. ఆయన మహామేధావియగు న్యాయవాది. అట్లయ్యును గొప్పపరోపకారియై మెలగినవాడు. ఆయన ఆదర్శము మీరెదుట నుంచుకోతగినది. 'అంటు ది లాస్టు' అనెడు రస్కిను మహాశయుని గ్రంథమున తెలుపబడిన పంథా ననుసరించుట ఇంకను శ్రేష్ఠతరము. 'వడ్రంగి యొకడు తనపనికై పదిరూకల నైనను పడయజాలకుండగా, న్యాయవాది పదినూరుల రూకలను పడయకోరు టెందులకు ?' అని రస్కిను మహాశయుడు ప్రశ్నించుచున్నాడు. ఎల్లెడల న్యాయవాదులు గుంజుకొను ఫీజులు ధర్మవిరుద్ధముగ నున్నవి. నా కిప్పుడు హెచ్చు ప్రతిఫలములుగనే తోచు ఫీజులనే నేనును సంగ్రహించి యున్నాడను; ఒప్పుకొందును. ఐనను నేను నావృత్తి ననుసరించిన సమయముననుగూడ నావృత్తిని నేను గావించు ప్రజాసేవకు అడ్డు రానీయలేదు.

మఱొక విషయమును గూర్చియు హెచ్చరిక తెలిపెదగాక. ఇంగ్లండునందును, దక్షిణాఫ్రికాలోను ఎక్కడపట్టిన నక్కడ న్యాయవాదులు తమ కక్షియుల కొఱకు తెలిసియు తెలియకను తమ సాధనలో అసత్యమునకు తావిచ్చుట కనిపెట్టితిని. దోషియని తా మెఱిగిన కక్షిదారుని గూడ పోషించుట తన కర్తవ్యమే ననునంతవఱకును సుప్రసిద్ధుడగు నొక ఆంగ్లేయ న్యాయవాది వాదనకు దిగినాడు. న్యాయవాదియొక్క ధర్మము న్యాయాధికారుల యెదుట సత్యమునే తెలుపుచు, సత్యమునే న్యాయాధిపతులు గమనించు నటుల చేయుటయేగాని, దోషిని నిర్దోషిగా ఋజువుచేయుట యెన్నడునుకాదు. మీ వృత్తి గౌరవమును కాపాడుట మీ చేతిలోని పని. మీరే మీ ధర్మము నుండి తొలగితిరా ఇంక నితర వృత్తులను గూర్చి చెప్పవలసినది యేముండును ? ముందు రానున్న వారల జనకులుకానున్న యువకులారా ! మీరు మీజాతియొక్క రుచి * నిధులుగా నుండవలయునుసుడీ. రుచియే రుచిని * పోనాడుకొనిన యెడల రుచికే * కూర్పజాలునది వేఱొండేమి యుండగలదు ?

## విద్యార్థిదశ ప్రారంభము

విద్యార్థులకు భారములు బాధ్యతలు నుండతగవని వాదించుచున్నారు. కొన్ని పరిమితులకు లోబడి మీ రటులనే యుండతగును. ఆ పరిమితులును మీరిపోతిరా మీరు విద్యార్థులనిపించుకో నర్హులుకారు. బడులలో చదువులు ముగించినంత మాత్రాన మీరు విద్యార్థులు కాక పోరు. ఏది ఎటులైనను నలుబదేండ్ల నా జీవితమును వెనుకకు తిరిగి చూచుకొను నెడల నేను నా పాఠములను వదలిన తరుణముననే నా విద్యార్థి దశయందు నేను ప్రవేశించితినని గ్రహించితిని. మీ యుత్తర జీవిత దశయందు కేవలము మీ పుస్తక పఠనము ప్రయోజనకారి కాజాలదని జీవితానుభవము కొంతగలిగిన నామాటను విశ్వసింపుడు. బండ్లకొలది గ్రంథాలనుండి యేఱుకొని మెదడులనిండ గ్రుక్కుకొనిన సుద్దులను విద్దెలనుకొని యెటుల భంగపడిరో తెలుపుచు నా కుత్తరములు వ్రాయు విద్యార్థులు గలరు. కొందఱు చపలచిత్తులై పోయిరి. కొందఱు

* రుచి = ఉప్పు, * రుచిని = చవిని

వెడగులైరి. మరికొందఱు పాపాచరణులై గతి గానకుండిరి. ఎంత కొట్టుకొనినను తమ స్థితిని మార్చుకో జాలకుంటిమనియు, తమను బట్టుకొనిన రక్కసిని బాఱత్రోల జాలకుంటిమనియు నాకు తెలుపుట జూడ. వారింగూర్చి నా హృదయ మెంతయు ఆవేదన చెందుచుండును. 'తెలుపుడు మాకు తెలుపుడు. ఈ పెనుభూతము బారినుండి మేము తప్పించుకొను టెట్లు? మమ్మలముకొనిన కల్మష జీవనము విడుచు విధానమెద్ది ?' అని వాపోవుచుందురు. "రామనామముల నాశ్రయింపుడు. పరమేశ్వరుని మ్రోల సాగిలపడి కరుణించుమడని వేడుకొనుడు" అని నేను తెలుపుచో 'ఈశ్వరు డెచ్చట నుండునో యెఱుగము. వానిం బ్రార్థించుటన నేమియో యెఱుంగము' అని వారు దీనాలాపముల జేయుదురు. వా రెట్టి స్థితికి పడిపోయిరో గనుడు.

కాబట్టి చేతికందిన పొత్తముల నెల్ల పఠింపబోక, జాగరూకులై యుండుడని విద్యార్థులను హెచ్చరించుచుందును. విద్యార్థుల హృదయములకు వికాసము గూర్చుడనియు, వారితో హృదయముల గలుపుకొని సద్బోధల గఱపుడనియు నేను ఉపాధ్యాయుల వేడుకొనుచున్నాను. అధ్యాపకుల క్షేత్రము ఉపన్యాస మందిరముల లోపలకంటె వాని వెలుపలనే విస్తరించియుండు ననుట నా యనుభవము.

ఏనాటి కానాడు భుక్తికై తడవులాడుకొనవలసిన ఈ కాలమున అధ్యాపకులును, ఆచార్యులును తమకిచ్చు జీతాలకై పనిచేయవలసినవారగుచు తాము పాఠములు చెప్పు తరగతిగదుల దాటినపిమ్మట తమ విద్యార్థులను గుఱించి శ్రద్ధ తీసికొనుటకు వారికి సావకాశము లేకున్నది. విద్యార్థుల జీవితమును, శీలమును సంస్కరించుట కిదొక ప్రతిబంధకముగా నున్నది. తరగతి గది వెలుపల తమకాలము నంతటిని విద్యార్థుల క్షేమమునకొఱకయ్యే వ్యయమును చేయుటకు ఉపాధ్యాయులు సిద్ధముగా నుండినగాని ప్రయోజన మంతగా కలుగజాలదు. విద్యార్థుల మెదడులకన్న వారి హృదయములను సంస్కరించుట యెంతయు నవసరము. విద్యార్థుల శబ్దకోశములనుండి "అపజయము, ఆశాభంగము" అనునట్టి పదములను వారు తుడిచివేయుదురు గాక.

## ప్రార్థన మన నేమి ?

నా హృదయమున పొంగి పొరలు వచ్చు భావములను నేను వ్రాకుచ్చుచున్నాను. ఏ పవిత్రోద్యమమునందును అపజయము సంగీకరింపకుడు. ఈ క్షణమునుండియు నిర్మలురై యుండ దీక్షపూనుడు. భగవంతుడు మీ ప్రార్థన మంగీకరించితీరును. ఐనను భగవంతుడు గర్విష్ఠుల ప్రార్థనల నాలకింపడు. తనతో బేరము లాడుటన అతడు సహింపడు.

మీరు గజేంద్రమోక్షణ కథను వినియుందురు. దిక్కు లేనివారికి దిక్కు దేవుడను నుడి మీకు తెలియును. కావున మీరు భగవంతుని అండను కోరుకొన్నప్పుడు దాపరికములేకుండ సకలమును వెల్లడించుడు. భీతిలకుడు. మనబోటి పతితుల నాయన ఆదరించునా యని సంశయింపకుడు. తన నాశ్రయించిన కోట్లాది జీవుల గాచిన దేవుడు మిమ్ము త్రోసిబుచ్చునా ? అత డెట్టివానినిగాని విడనాడడు. మీరు చేయు ప్రతి నిష్కళంక ప్రార్థనయు ఫలించితీరును. నేను నా స్వీయానుభవముతో చెప్పుచున్నాను. నేను నరకమున ప్రయాణించినవాడనే. "మున్ముందుగా మీరు దైవరాజ్యము నర్థింపుడు. పిమ్మట సర్వమును మీకు చేకూరును." కళంకిత హృదయములతో మీ గ్రంథములనుగాని అధ్యాపకులనుగాని దరిజేరనీకుడు. పరమ పవిత్ర హృదయములతో వారి యండజేరుడు. మీ యాప్సితములను వా రీడేర్తురు. మీరు దేశాభిమానులు కాగోరుదురా ? యథార్థపు దేశాభిమానులును, దుర్బలుర రక్షకులును, విద్యా సౌకర్యములకు దూరులై కుందు దరిద్రులయు, నిమ్నజనులయు పక్షమును వహించువారలును కానెంతురా, ప్రతి బాలికయొక్కయు శీలరక్షణకు బాధ్యత పూన నెంతురా, అట్లగుచో మీ హృదయములను మున్ముందుగా పవిత్రభూతము గావించుకొనుడు. అట్టి భావ సంపదతో మీ జీవితోద్దేశ్యమును నిర్వహింప సాహసింతురేని మీకు సర్వశ్రేయములు ప్రాప్తించుగాక.

భగవంతుని పూజించుట యనగా భగవంతుని స్తోత్రగానము చేయుటే. ప్రార్థన యన మన దుర్బలతను, అనర్హతను వెల్లడించుట యగును. భగవంతునకు సహస్ర నామములు గల వనవచ్చును. లేదా ఆయనకు పేరే లేదనవచ్చును. మన కిష్టము వచ్చిన పేరుపెట్టి భగ

వంతుని పూజింప వచ్చును. ప్రార్థింపవచ్చును. కొందఱు వానిని రామా యందురు. కొందఱు కృష్ణా యందురు; ఇతరులు వానిని రహీమందురు; మఱికొందఱు వానిని దేవుడందురు. ఐనను నరు లందఱును ఒకే పర మాత్మను పూజించు చున్నారు. అన్ని యాహారములు నందఱికి సరిపడ నట్లు అన్ని పేరులును అందఱికిని హితవుగా నుండవు. ప్రతివాడును భగ వంతుని గుఱించిన తన భావముల కనుగుణమగు పేరును నిర్ణయించు కొనును. భగవంతుడు అంతరంగవాసియు, సర్వశక్తి సంపన్నుడును, సర్వజ్ఞుడును. కావున మన అంతరంగిక భావములను ఆతడెఱుగును. మఱియు మన అర్హతల ననుసరించి ఆయన ప్రసన్నత చూపుచుండును.

కాబట్టి పూజనుగాని, ప్రార్థనను గాని పెదవులతో చేయుట తగదు; హృదయముతోడ చేయవలసి యుండును. ఆకారణముచేత మూగ వాడును, నత్తిగలవాడును, పామరుడును, మూర్ఖుడును ప్రార్థన చేయ గల్గును. మఱియు నాలుకలయం దమృతమును, హృదయములందు విషమును పెట్టుకొనువారి ప్రార్థనలు భగవంతు డెన్నడును వినడు. కావున భగవత్ప్రార్థన చేయువాడు తన హృదయమును నిర్మలము చేసి కొనవలయును. రాముడు హనుమానుని పెదవులమీద మాత్రమే యుండు వాడు కాడు. ఆయన హనుమానుని హృదయమందలి సింహాసనము మీద అధివసించి యుండువాడు. ఆయన హనుమానునకు నక్షయ బల మును ప్రసాదించినాడు. ఆయన ప్రసాదించిన బలముతోడనే హను మానుడు పర్వతము నెత్తగలిగినాడు; సముద్రమును దాటగలిగినాడు. తుపానులు వచ్చునప్పుడు సముద్రముల మీద మనపడవలను నిరపాయ ముగ నడుప గల్గునది మన విశ్వాసమే. విశ్వాసము మహాపర్వతములను కదిలించివేయ గల్గును. విశ్వాసము మహాసముద్రములను లంఘింప గలదు. విశ్వాస మనగా అంతరంగమున వెలయు సచేతనమును, జాగరి తనమును నగు భగవంతుని స్మృతియే. అటువంటి విశ్వాసమును సంపాదించుకొనినవానికి నేలాటి కొఱతయు నుండదు. అతడు శారీరక ముగ రోగగ్రస్తుడయ్యును ఆధ్యాత్మికముగా నారోగ్యవంతుడై యుండ గలడు; కాయికముగ దీనుడయ్యు ఆధ్యాత్మిక సంపదలందు నోలలాడ గల్గును.

సరే! అంతటి హృదయ పారిశుద్ధ్యము సిద్ధించు టెట్లని శంక కలుగ వచ్చును. పెదవుల భాష తేలికగా నేర్పవచ్చును. కాని హృదయ భాష నెవరు నేర్పగలరు? భక్తుడు అనగా యథార్థమగు భక్తుడు మాత్రమే అభాష నెఱింగి బోధింప గలుగును. భక్తలక్షణములను గీత మూడు తావులందు నిరూపించినది. మఱియు సర్వత్ర సామాన్యముగా వాని ప్రశంసచేసినది. ఐనను "భక్తు" డన నిర్వచనము చేయగల తెలివి కలిగినంతమాత్రాన బాగుగా మార్గము తెలిసినట్లు కాదు. భక్తులు పుడమి మీద నరుదుగా నుందురు. కాబట్టి సేవాధర్మమను లక్షణము సూచించి యున్నాను. భగవంతుడు తనపీఠము నుంచుకొఱకై యెవరు తోడుగా మానవుల సేవనొనర్తురో యట్టివారి హృదయములను తనంతటతానే వెదకి యేర్చుకొనును. కాబట్టియే "ఇతరుని దుఃఖముచూచి కఱగిపోవ నేర్చిన వాడే సత్యమగు వైష్ణవు"డని ప్రత్యక్షానుభవముచే గ్రహించిన నర సింహమెహతాగారు గానము చేసియున్నారు. "అబుబెన్ అధాముగారు" నట్టివారే. ఆయన తోడిమానవుల సేవసలిపియున్న కారణమున భగవం తుని సేవించువారి పట్టికలో ఆయన నామము ప్రప్రథమముప పేర్కొన బడెను.

సరే! బాధలు పడువారు దుఃఖము లనుభవించువారు, అననెవరు? అణగ ద్రొక్కబడినవారును, దారిద్ర్యమున క్రుంగినవారునే. భక్తుడు కాగోరువాడు త్రికరణశుద్ధిగ మనోవాక్కాయములతో నిట్టివారిని సేవింప వలయును. అణగ ద్రొక్కబడిన తరగతులవారిని తాకరానివారినిగ నెంచునతడు శారీరకముగ వారి కేమి సేవ జేయగలడు. దరిద్రుల సాహయ్యము కొఱకు నూలు వడకుపాటి శరీరశ్రమనైనను చేయుట కొడంబడక ఏవేవో సాకులు చెప్పువాడు సేవయన నర్థము చేసికొన జాలడు. దృఢకాయుడగు సోమరికి బిచ్చమెత్తు నర్హత యుండదు. పని చేసి భుక్తి సంపాదించుకొనుమని అట్టివానిని ప్రోత్సహింప వలయును. భిక్షమిడుట వానికి పతనము చేకూర్చుటే. పేదవారి యెదుట కూర్చుండి నూలు వడకుచు వారిని గూడ తనవలెనే చేయుడని ఆహ్వానించునతడు భగవత్సేవ చేయువాడే యగును. తదితరు డెవడును వారిసేవ చేసిన వాడు కాడు. భక్తి భావముతో నొక ఫలమునో పుష్పమునో లేక పత్ర మునో నాకేమిచ్చినను అట్టివాడు నాసేవకు డగును." అని భగవానుడు

గీతయందు తెలిపియున్నాడు. నమ్రజనులు. నిమ్నులు గతి లేనివారు నెచ్చో నుందురో యా క్షేత్రము భగవానుని పాదపీఠ మగును. అట్టివారి కొఱకై నూలువడకుట శ్రేష్ఠతమమగు ప్రార్థనయే యగును. అదియే శ్రేష్ఠతమమగు పూజయు, శ్రేష్ఠతమమగు యజ్ఞమును కూడ నగును.

కాబట్టి యేపేరుతో నైనను ప్రార్థన చేయవచ్చును. ప్రార్థనాభరిత మగు హృదయమే తగిన యుపాధి. సేవాసాధన హృదయమును ప్రార్థనాభరితము చేయును. మనస్ఫూర్తిగ నీ యుగమున అంటరాని వారి సేవచేయు హిందువులు సత్యముగా ప్రార్థన చేసినవారే యగుదురు. హిందువులు గాని, తదితరులుగాని ప్రార్థనాపూర్వకముగ బీదవారికొఱకును, దిక్కులేని వారికొఱకును నూలు వడకుదురేని నిజముగా ప్రార్థన చేసినవారే యగుదురు.

ప్రార్థన చేయనిది నే నే కార్యమును పూనను. నరుడు పొఱపాట్లు చేయు జీవి. అతడు తన కర్మఫలముం గుఱించి యెన్నడును స్థిరనిశ్చయముతో నుండజాలడు. తన ప్రార్థనకు ఫలితమని యతడు చెప్పుకొనునది వాని గర్వముయొక్క ప్రతిధ్వనియు కావచ్చును. నరుడు నిర్దుష్టముగా మార్గమును తెలిసికొనవలయు ననిన దోషచింతనమే చేయజాలనట్టియు, పరిపూర్ణముగా నిష్కల్మషమగు నట్టియు హృదయమును కల్గియుండవలయును. నా కట్టిది కలదని చెప్పుకొనజాలను. నా హృదయము పరితాపపడుచు, పాటువడుచు, పొఱపడుచు పూర్ణత గానలేక తిరుగుళ్ళు పడుచున్నది. ఐనను నా యెడలను, నితరుల యెడలను ప్రయోగములు సాగించుట మూలమున నున్నతికి రాగలుగుదును. భగవంతుడు నిస్సందేహముగా నొక్కడే యనియు, కావున మానవకోటి యంతయు నొక్కటే యనియు నేను నమ్ముచున్నాను. మన కనేకములగు శరీరము లున్నను మన అందఱి ఆత్మయు ఒక్కటియే. సూర్యుని కిరణములు ప్రసారణముచేత ననేకములుగా నున్నవి. మూలతేజము మాత్ర మొక్కటియే. నేనత్యంతము దుష్టాత్ముని నుండియు వేఱుపడి పోజాలను. అటులనే యత్యంత వినిర్మలాత్మునితోడి యైకత్యయు నాకు లేకుండపోదు. కావున నాకిష్ట మున్నను లేకున్నను నాతోడి జీవుల నందఱిని నాప్రయోగమునం దిమిడ్చుకొనవలసినవాడనై యున్నాను.

ప్రయోగములు చేయకను నుండజాలను. జీవితమనిననే అనంతమగు ప్రయోగ మాలికగా నున్నది.

## ప్రార్థనయందు విశ్వాసము

ప్రార్థన సమావేశములకు హాజరుకాకుండ తనను వదలి వేయు డని కోరుచు నొక విద్యార్థి యొక జాతీయ పాఠశాలాధ్యక్షునకు నీ క్రింది రీతిని విజ్ఞాపన చేసియున్నాడు :

లేఖ:— "నేను ప్రార్థన చేయవలసిన దేవత యని పేర్కొనబడు దేనియందుగాని నాకు విశ్వాసము లేదు గావున, ప్రార్థన మన నాకు విశ్వాసము లేదని మనవి చేయుచున్నాను. నా మట్టుకు దేవు డొకడు కలడనియే యూహచేయు నగత్యము నా కెన్నడును తోచుటలేదు. నెమ్మది గను, శ్రద్ధగను నా ప్రయత్నములను నేను సాగించుచు, దేవుడు కలడని పాటింపకుండ వర్తించినచో నాకు నష్టమేమి ?

సాముదాయికముగా ప్రార్థన చేయు సందర్భమందురా ? అది వ్యర్థప్రపని. ఎంతటి స్వల్పపుదైనను, నేదేని యంశమును గూర్చి ఆ పెద్ద ప్రజాసముదాయమున ఏకాగ్ర చిత్తతను కూర్చుకొన సాధ్యమగునా ? దేవుడు, ఆత్మ సర్వమానవ సమానత్వము, ననుచు మన మతగ్రంథ ములు చెప్పు నతి గంభీర వాక్యముల సూక్ష్మతర భావములమీద నజ్ఞానులగు చిన్నబిడ్డలు తమ చంచలచిత్తముల నేకాగ్రముచేయ వలయునని మీరాశింతురా ? ఇట్టి మహాత్కార్యము కూడ నొకానొక విశిష్ట పురుషుని యొక్క యాజ్ఞ ననుసరించి, యొకానొక ప్రత్యేక సమయ మున జరుగవలసియుండెను గదా ! అటువంటి జడయంత్ర క్రియను బోలు కర్మవలన నీ బాలుర హృదయములలో ఆ పరమేశ్వరు డను వాని యందలి భక్తివే రూనుకొన గలుగునా ? నానా చిత్తవృత్తులుగల మాన వులనుండి యొకే చర్యను నిరీక్షించుటకంటె వివేకశూన్య మగు కార్య ముండబోదు. కాబట్టి ప్రార్థనను గుఱించి నిర్బంధ ముండతగదు. ప్రార్థ నయం దభిరుచిగలవారిని ప్రార్థనచేయనిండు; ఇష్టములేనివారిని దానిని వదలివేయనిండు. నమ్మకములేక చేయు కార్య మెట్టిదైనను అవినీతి కరమై పతనహేతు వగును."

స:— ఈ చిట్టచివఱి అభిప్రాయముయొక్క యోగ్యతను మొట్ట మొదట విచారింతముగాక. క్రమశిక్షణముయొక్క యవసరమును గుఱిం చిన నమ్మకము ఒకనికి గోచరింప నారంభించుటకు పూర్వము అట్టి శిక్షణమునకు లొంగుటయను కార్య మవినీతికరమును, పతన హేతు వును నగునా ? బడిలో నేర్పు పాఠక్రమముయొక్క ప్రయోజనమును గుఱించి నమ్మకములేని యొకడు అట్టి పాఠములను చదువుట యవినీతి కరమును, పతన హేతువును నగునా ? మాతృభాషను నేర్చుట నిరుప యోగమని యొక బాలుడభిప్రాయము పూనునెడల, అట్టి బాలునికి వాని స్వభాషను నేర్పకుండ వదలివేయ నగునా ? ఒక బడికుర్రవానికి తాను నేర్వవలసిన పాఠమును గురించియు, తాను పొందవలసిన శిక్షణమును గురించియు నెట్టి విశ్వాసమును నుండదనుటయే యెక్కువ సత్యము కాదా ! ఆతడొక పాఠశాలలో చేర నిర్ణయించుకొను కాలమున వానికేమని నిర్ణయాధికారమున్నను యది యంతటితో నంతమొందుచున్నది. అతడొక పాఠశాలలో చేరినప్పుడు, ఆ పాఠశాలయొక్క నీమములకు, వీధులకు నతడు లోబడుట కంగీకరించెననియే యర్థము. ఆ బాలు డా పాఠశాలను వదలివేయుట కభ్యంతర ముండదుగాని, తా నేమి నేర్చుకొనవలయునో, యెట్లు నేర్చుకొనవలయునో యాతడు నిర్ణయించుట యొప్పదు.

విద్యార్థులకు మొట్టమొదట నసహ్యకరముగను, నిరుత్సాహకరము గను కాన్పించుదానిని సుగ్రాహ్యముగను, మనోహరముగను చేయుపని యుపాధ్యాయులదై యుండును. 'నేను భగవంతునియందు విశ్వాసము పూనను' అని చెప్పుట చాల తేలికయే. ఏమందురా, నిర్భయముగా తనను గుఱించి యేమిచెప్పినను భగవంతు డూరుకొనును. ఆయన మన చేతలను చూచుచుండును. భగవంతుని శాసనమును భంగపఱచు నెడల కసి తీర్చుకొను దండన వెంటనే మనపై బడదు గాని, మనలను పునీతుల జేయునట్టియు నిగ్రహించునట్టియు శిక్షణము ప్రాప్తించును. భగవంతుని యునికిని ఋజువుచేయజాలము. ఋజువుచేయుటకు నవసరములేదు. భగవంతుడున్నాడు ! భగవంతుని అనుభూతి చేయజాలమేని, అది మన దురదృష్టము. అనుభూతి శూన్యతయేదో యొకనాడు మన కిష్టమున్నను లేకున్నను నివారించుకొనితీరవలసిన రోగము వంటిది.

విద్యార్థి వాదనకు దిగతగదు. తా నున్న విద్యాలయమువారు ప్రార్థన సమావేశములకు రావలయునని కోరునెడల, క్రమశిక్షణాంశముగ పాటించి అతడటుల చేయవలసియుండును. తన సంశయములను ఉపాధ్యాయులయెదుట సవినయముగా తెలుపుకొనవచ్చును. తనకు సత్యముగ తోచనిదాని నతడు విశ్వసింప నక్కఱలేదు. ఆతడు తన గురువుల నెడల గౌరవముగలవా డగునేని, తనకు విశ్వాసము లేకున్నను వారు చెప్పుదానిని చేయును. అటుల చేయుట భయముచేతగాని, చిత్తోద్రేకము చేత గాని కాగూడదు. కాని అటులచేయుట తనకు ధర్మమును జ్ఞానము తోడను, తనకీనా డంధకారమయముగ గోచరించినది, ముందొకనాడు తేట తెల్లము కాగలదను నాశతోడను అటులచేయ దగును.

ప్రార్థన యనగా దేనికొఱకేని అడుగుట కాదు. అది హృదయము యొక్క యావేదన. అది అనుదినము మన దుర్బలతను నంగీకరించుట మాత్రమే. మనలోని మహాఘనుడు సైతము మరణము, రోగము, వృద్ధాప్యము, అవాంతరబాధ కలుగు సమయములందు నిస్సహాయ్యుల మని సదా జ్ఞప్తినుంచుకొనవలసినవా డగుచున్నాడు. మనము మృత్యుమధ్యమున జీవించుచున్నాము. మన యుద్యమములు తెప్పపాటు కాలములో రూపుమాసి పోజాలుచుండగా, మఱియు అంతటి వేగముతోడనే, మనకు తెలియకుండగనే, మనము మనఉద్యమములను వీడిపోవలసినవార మగుచుండగా, మన యుద్యమములను మనమే సాగించుకొందు మను టలో నేమి స్వారస్యము గలదు ? ఐనను మనము భగవంతుని కొఱకును, వాని యుద్యమము కొఱకును సేవ చేయుచున్నా మని యథార్థముగా చెప్పగలుగుదుమేని, పర్వతమును బోలి సుస్థిరులముగా నెంచుకొనగును. అప్పుడు సర్వమును పట్టపగటివలె సుస్పష్టముగా నుండును. అట్టిచో నేదియు నాశ మొందునటుల దోపదు. అప్పుడు నాశనమునందు సర్వమును చూపులకే అటుల గాన్పించును. మరణ మన్నను, నాశనమన్నను ఆ స్థితియందు, మఱియు ఆ స్థితియందు మాత్రమే మిథ్యాభూతము లగును. అప్పుడు మరణముగాని నాశనము గాని యొకానొక దశాంతర మనిపించును. శిల్పి శ్రేష్ఠతర సృష్టికొఱకై యొక విగ్రహమును నాశము చేయునుగాదా ? గడియారముల బాగు

చేయు నాతఁడు క్రొత్తదాని నమర్చు నిమిత్తము ప్రాతరేకు చుట్టును తీసివేయుటలేదా ?

సాముదాయిక ప్రార్థన యొక మహత్తర విషయమై యున్నది. మన మొంటరిగా చేయజాలని దానిని, తరచుగా సమిష్టిని కూడి చేయ గలుగుచుందుము. బాలుర కనుభవపూర్వక విశ్వాస ముండనక్కఱ లేదు. అంతర్యమందు విరుద్ధ భావము లేకుండ ప్రార్థనకొఱకై పిలుపు వచ్చినపుడు శిరసావహించి ప్రార్థనచేయ పూనువా రుత్సాహమును తమలో ననుభూతి చేయ గలుగుదురు. కాని చాలమంది ఆ తీరున చేయరు. వారు కొంటెతనమునుకూడ చూపుచుందురు. ఎటులయినను, తమయందు గలుగు అవిజ్ఞాత సంస్కారము నణచివేయ జాలరు. ప్రారంభమునందు నిరసనము జూపుచు వర్తించి నట్టియు, కాలక్రమ మున సాముదాయిక ప్రార్థనా మహిమమునందు గట్టి విశ్వాసము గల వారు నైనట్టియు బాలురు లేరా ? సాముదాయిక ప్రార్థనయొక్క యానందమును కోరుకొనుటకు తగినంత ప్రబల విశ్వాసములేని పురుషుల కును నట్టి యనుభవము చేకూరుటయు సామాన్య విషయమే. చర్చి లందును, దేవళములందును, మసీదులందును గుమిగూడువా రంద ఱును పరిహాసకులు గాని, మోసగాండ్రు గాని కారు. వారు సౌజన్య భావము గల స్త్రీ పురుషులు సుడీ ! వారిపట్ల, సాముదాయిక ప్రార్థన మనము నిత్యము చేయు స్నానమువంటిది. అది వారి బ్రతుకునకు నవ సరమగు విషయమే. ఈ యర్చనాలయము లన్నియు నవకాశము చిక్కిన తోడనే తుడిచిపెట్టవేయ దగిన మూర్ఖకూటములు కావు. ఈ నాటి వఱకు నెన్నియో దాడుల నవి గడచి నిలిచినవి ! మఱియు అనంత కాల మును నటుల నిలిచి యుండనోపును.

## వ్యర్థ పఠనములు

ప్రశ్న:— ప్రార్థనలను జడయంత్రములవలె నాలాపము చేయుట కేవలము వ్యర్థచర్య యగుటే గాక యనర్థము నగునని యెల్లఱు నొప్పుకొందురు. అది ఆత్మమీద నల్లమందువలె పని చేయును. ప్రతి ఉదయము సాయంతనము పదునొకండు మహా ప్రమాణములను రోకంటి పాటవలె పాడుటను మీ రెందుకు ప్రోత్సహించుచున్నారో యని నేను

తలచుగ విస్మయము చెందుచున్నాను. అది మన బాలురయొక్క నైతికజ్ఞానమును మొద్దు బారచేయుటలేదు గదా? ఈ ప్రమాణములను నేర్పుటకు శ్రేష్ఠతర మార్గమేమియు లేదా?

స:— కేవలము యంత్రములవలెగాక, పదేపదే పలుకుశబ్దములకు నద్భుతమగు ఫలము గలదు. అందువలననే జపతావళము త్రిప్పుటను మూఢాచారముగ నేను భావింపను. చంచలమై తిరుగులాడు మెదడును శమింపజేయుట కది సాహాయ్యముగ నుండును. ప్రమాణములను అనుదినము వల్లెవేయుటన అది వేఱొక రకముక్రింద చేరును. నిష్కపటియగు సాధకునిపట్ల నతడు నిద్రలేచునపుడును, పరుండబోవు నపుడును తన ప్రవర్తనను సవరించుకొను కొఱకు పదునొకండు ప్రమాణముల కతడు సదా వశమై యున్నాడను మాటను వానికి జ్ఞప్తిచేయుచుండును. కేవలము వాచకమాత్రాననే అది పుణ్యప్రదమగునను భ్రాంతిలోపడి, కేవలము జడయంత్రముమాదిరి నొక పురుష డా ప్రమాణములను పదేపదే పఠించునెడల, వానిమహిమ భంగపడు ననుటకు సందేహము లేదు. "అసలీ ప్రమాణములను పదేపదే పేర్కొను టెందులకు? అట్టి ప్రతిజ్ఞలను మీరు తీసికొంటిరనియు, వాని నాచరించువారుగా విశ్వసింపబడుచునే యున్నారనియు మీకు తెలియునుగదా!"యని మీరు ప్రశ్నింపవచ్చును. ఆ వాదనయందు కొంతబలము కలదు. కాని బుద్ధిపూర్వకముగా పదేపదే చెప్పుకొనుటవలన ప్రతిజ్ఞలకు బలము, ప్రోత్సాహము కలుగుట అనుభవసిద్ధము. దుర్బల శరీరములకు లేహ్యము లెటువంటివో, దుర్బల హృదయ మానసములకు ప్రాణము లటువంటివి. ఆరోగ్యవంతములగు శరీరములకు లేహ్య మగత్యము లేనట్లు దృఢమగు మనస్సు ప్రమాణములయొక్క గాని, వాని ననుదినము జ్ఞప్తిచేసికొనుట యొక్కగాని యగత్యము లేకుండగనే ఆరోగ్యమును సంరక్షించుకొన నగును. ఈ ప్రమాణములను పరీక్షించిన మీదట, మాలో ననేకుల మటువంటి ప్రమాణముల సాహాయ్య మవసరమగు నంతటి దుర్బలురముగానే యుంటి మని తెలిసికొంటిమి.

ఒక విలేఖ రిట్లావేశముతో వ్రాయుచున్నాడు:— "భగవత్ప్రార్థన చేయు నలవాటును గుఱించి, ముఖ్యముగా సాముదాయిక ప్రార్థనల

గుఱించి మీరు గావించిన యద్భుతమగు మండన మనెడు తైలములో నొక చిన్న యీగ పడెనేమో యని నేను భయపడుచున్నాను. చర్చీలు, దేవళములు, మసీదుల సందర్భమున మీ వ్యాసము తుది నిట్లు వ్రాసి యున్నారు: "ఈ యర్చనాలయము లన్నియు నవకాశము చిక్కినతోడనే తుడిచిపెట్టివేయ తగిన మూర్ఖకూటములు కావు. ఈనాటివఱకు నెన్నియో దాడుల నవి గడచి నిలిచియున్నవి; మఱియు ననంతకాలమును నిలిచి యుండనోపును."

దీనిని చదివినమీదట నేనిట్లు తర్కించుకొంటిని: దాడులా ? యెవ రివి ? దైవభక్తులలోని పరస్పర విరుద్ధశాఖలవారే యొండొరుల అర్చనాల యముల మీద దాడివెడలియున్నంత విఱివిగా నాస్తికులుగాని, పరిహాస కులుగాని యెన్నడేని దాడులు సలిపినటుల ప్రసిద్ధిలేదు. నిజ మేమన, మీరు పేర్కొనిన దాడులన్నియు కాకున్నను, అత్యధికమైనవి భక్తిపరా యణులగు " దుండగ్రీండులచేత తమతమ దేవతలపేర ఆ దేవతల ప్రభా ప్రకటన కొఱకు, జరిపియున్నవే! నేను ఉదాహరణలు తెలుపుట మీ ప్రపంచ చరిత్రజ్ఞానమును అనుమానించుట యగును!

నా రెండవ సంశయ మిది :— ఈ యర్చనాలయములు దాడుల నన్నిటిని గడచెనని చెప్పుట నిజమా ? అట్లు యథార్థముగ చెప్పనగునా? నాకు తట్టిన జవా బిది :— ఎంతమాత్రమును కాదు. బుద్ధదేవుని కాల ములకు పూర్వమునుండి సైతము, ననేక శతాబ్దముల వఱకు, విశ్వనా థుని యాలయము వెలసిన వారణాశి యందలి యా ప్రదేశమును చూడుడు. 'జిందాపీరు' 'సుల్తాన్ అవులియా' అను బిరుదులు వహిం చిన మహాపవిత్ర చక్రవర్తి ఔరంగజీబు యొక్క ఉత్తరువుల కనుగుణ ముగా విధ్వంసము చేయబడిన యా ప్రాచీన దేవళముయొక్క శిథిల ముల పైని నిర్మింపబడి, యా పవిత్రనగరమున కధిష్ఠానముగ వెలయు మసీదుగల క్షేత్రమును చూడుడు! ముసల్మానులకు పవిత్ర భూమి యగు హెడ్జాజీలోని యనేక ప్రార్థనాలయములయం దిటీవల జరిగిన విధ్వంసక వినాశ కార్యములకు బాధ్యులగువారు ఘోర భక్తాగ్రణియగు 'యిబిన్‌సాదు'ను, మఱియు వాని వహాబీదండులేగాని, విశ్వాస శూన్యు లగు బ్రిటిష్‌వారు కారుగదా ? ఈ ఘాతుక కార్యములను గుఱించి

ముసల్మానులగు భారతదేశీయులు ముక్తకంఠములతో నీనాడు దుఃఖము లను వెలిబుచ్చుచుండిరి. ప్రపంచములోని ముసల్మాన్ ప్రభువులలో నొక్కడు మాత్రమే, అనగా మన హైదరాబాద్ నైజాం మాత్రమే తన స్వంత సొమ్ముతో నా యర్చనాలయములను పునర్నిర్మాణము చేయుటకై వ్యర్థప్రయత్నములు చేసియుండలేదా ?

ఓ మహాత్మాజీ! ఈ ప్రత్యక్ష సంఘటనలు మీరు పాటింప నర్హములు కావా యేమి ?

స :—ఈ ప్రత్యక్షాంశములు నేను మిక్కిలిగా పాటింపతగినవే! అవి నిస్సందేహముగా నరునియొక్క దుర్ణయమును ఋజువుచేయు చున్నవి. మఱియు నాకవి బుద్ధిగఱపుచున్నవి! అసహన పూరితుడ నై పోకుండ నన్ను హెచ్చరించుచున్నవి. అసహన శీలునిపట్ల సైతము నన్ను సహనము పూనునటుల చేయుచున్నవి. అవి నరుని యల్పత్వ మును ప్రదర్శింపుచు, నతడు ప్రార్థన చేయపూనినపట్ల ఆ ప్రార్థనల సలుపునటులనే ప్రేరేపించు చున్నవి. ఏమందురా, సర్వ శక్తుని మ్రోల మోకరించి, నెత్తురొలుకు కన్నీటితో వాని పాదముల కడుగుచు, వాని పదతాడనముక్రింద దూళి యైపోవ కోరుకొనుచు గర్వభంగము పొందిన యుదంతముల నీచరిత్రచూపుట లేదా! సత్యముగా 'అక్షరాలు ప్రాణము తీయును; భావము బ్రతుకు నొసగు' ననుట తథ్యము. 'యంగు యిండియా' పత్రికను చాల సక్రమముగను, మిక్కిలి శ్రద్ధగనుపఠించు వారిలో నొకరగు ఈ విలేఖరి 'యర్చనాలయము' లనగా నా యభిప్రా యములో, కేవలము ఇటుకల సున్నము కావని యిప్పటికైన తెలిసి కొనియుండవలసినది. అవి సత్యవస్తువుయొక్క ఛాయా మాత్రమే. వినాశము చేయబడిన ప్రతి చర్చికి, ప్రతి మసీదుకు, ప్రతిదేవాలయము నకు బదులుగా వందలకొలది నూతనముగా వానికి స్థానమున పుట్టుకొని వచ్చుచున్నవి. భక్తులని పిలుచుకొనువారు తమ భక్తికి భిన్నముగా వర్తింతు రనుటయు, మహాపుణ్యక్షేత్రములుగా ప్రసిద్ధి బడసిన యాల యము లనేకము నేలమట్టము చేయబడు ననుటయు ప్రార్థన యొక్క యావశ్యకతకు సంబంధించిన వాదనకు పూర్తిగ నప్రస్తుతములు. ఎవరి యెడ ప్రార్థనమనునది ప్రత్యక్షముగ ప్రాణాధారమై యొప్పునో, అట్టి పురు

షులు ప్రపంచమున పూర్వ ముండెడువా రనియు, నిప్పుడును కల రనియు నేను ఋజువుచేయగలుగుచో, నా వాదనకు సరిపోవునని నా యాశ; మఱియు సరిపోవునుకూడను. ముందుగ నెట్టి నిశ్చితాభిప్రాయ ములను పెట్టుకొనక, నిరాడంబరముగా మసీదులకును, దేవాలయముల కును, చర్చిలకును పోవునలవాటును చేసికొనుడని విలేఖరిని హెచ్చరిం చెద గాక ! ఆడంబరము కొఱకుగాని, లేక మోమోటమిచేతగాని, భయము చేతగాని కాకుండ, కేవలము భక్తి ప్రేరితులై యీ చోటులకు పోవువారిని సంస్కరింప జాలునదియు, హృదయ రంజక మగునదియు నేదియో కొంత వానియందు కలదని నేను కనుగొనినటులనే విలేఖరియు కనుగొన గలుగును. అదేదియో ఇట్టిదని వివరించుట సాధ్యపడదు. దోషములకును, మూఢవిశ్వాసములకును, అవినీతికి సైతము నాలవాలములైన ఈ నాటి తీరక్షేత్రములకును పోవునట్టి వినిర్మలాత్ములు తాము గావించు పూజా క్రతువుల వలన హెచ్చు పవిత్ర వంతులై యా క్షేత్రముల నుండి మఱలి వచ్చుచున్నా రను సత్యమునకు భంగము లేదు. కాబట్టి

శ్లో॥ "యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం"

'ఎవరేతీరున నన్ను పూజించుచున్నారో నేను వారికాతీననే ఫలము నొసగుచున్నాను' అనెడు భగవద్గీతలోని ప్రతిజ్ఞా వాక్యము సార్థక మగు చున్నది.

ఈ విలేఖరి వ్రాసినది మన నీ వాడు బాధించునట్టియు, సాధ్యమై నంత వేగముగా మనము తొలగింప ప్రయత్నము చేయవలసినట్టియు అనర్థములను తెలుపుచున్న దనుటకు సంశయము లేదు. మన దృక్పథ మును విశాలతరము గావించుకొని, మతములను పావనతరములు చేయు కొఱకగు ప్రబోధమే అది. ఆ మాత్ర మవసరమగు సంస్కరణము నిశ్చయముగా కలుగుచునే యున్నది. శ్రేష్ఠతరమగు ప్రబోధము విశ్వ మున సామాన్యమై వెలయుచున్నది. మఱియు మన మందఱము గాఢ ముగ వాంఛించు సంస్కరణకు సైతము, శ్రేష్ఠతరమగు నాత్మపారిశుద్ధ్య మలవడు నిమిత్తము సాంద్రభావ ప్రేరితమగు ప్రార్థనము అవసరమని నా మనవి. ఏలనగా సామాన్యముగా మానవజాతియందు గాఢతర పారి

శుద్ధ్యము పొడసూపనిది పరస్పర సహనభావము, పరస్పర సద్భావము సాధ్యము కాజాలవు.

## మాటల పీడ

ప్రార్థనయందు తనకు విశ్వాసము లేదను బాలునిగుఱించిన నా వ్యాసమును చూచి యొక విలేఖరి నన్నిట్లు ప్రశ్నించు చున్నాడు:

మీరు వ్రాసిన వ్యాస మా బాలునికిగాని, గొప్ప మనీషావంతు లగు మీకుగాని న్యాయము చేకూర్చునదిగ లేదే! ఆ బాలుడు తన ఉత్తర ములో వాడిన మాటలు పూర్తియైన పొందిక లేనివనుట నిజమే; కాని వాని భావనైర్మల్యము నిశ్శంకముగానే యున్నది. సాధారణముగా 'బాలు' డను మాటకు మన మర్థముచేయు వ్యక్తివంటివాడు అతడు కాడను టయు స్పష్టమే. అత డిరువది సంవత్సరములకు లోపువా డగుచో నా కాశ్చర్య మగును. ఒకవేళ నతడు చిన్నవాడే యైనను, 'బాలుడు' తర్కమునకు పూన తగడనుచు త్రోసిపుచ్చదగిన వ్యక్తికంటె చక్కని బుద్ధిపాటవమును ప్రకటింప జాలినవాడుగా కాన్పించుచున్నాడు. ఆ లేఖ వ్రాసిన యతడు తర్కానుసరుడు; మీరో విశ్వాసప్రియులు. తర్క విశ్వా సము లనునవి ప్రాచీనకాలమునుండి వచ్చుచున్న రెండు తెగలు. పూర్వ కాలమునుండి వీనికి వైరమే. ఒక తెగవారి వైఖరి 'నాకు నచ్చచెప్పుడు, నేను నమ్మెదను' అనున ట్లుండును. రెండవ తెగవారి వైఖరి 'ముందు నమ్ముము; మనస్సమాధాన మలవడును' అనున ట్లుండును. మొదటితర గతివారు ప్రమాణ మేదేని కలదా యని చూతురు. అజ్ఞేయవాదము యువ కులలో వెలసిన క్షణకాలపు వైఖరియనియు, త్వరలోనో ఆలస్యముగనో వారియందు విశ్వాస మంకురించుననియు మీ రభిప్రాయపడుచున్నట్లు కాన్పించుచున్నది. మీ యభిప్రాయమున కాధారముగా వివేకానంద స్వామియొక్క సుప్రసిద్ధ చరిత్ర కలదు. అందువలన ఆ "బాలుని" క్షేమము నిమిత్తము ప్రార్థన యను మోతాదును బలత్కారముగా మీరు నియమింప చూచితిరి. అందుకు మీరు చెప్పుకారణములు రెండు: నరుని యొక్క అల్పత్వమును, ఊహాకల్పితు డగు దేవతయొక్క మహిమను నౌదార్యమును నంగీకరించుటకు ప్రార్థన గుర్తుగా నుండుననుట యొకటి. దాని ప్రయోజనము కొఱకు అనగా శాంతి గోరువారి కది యొసగుశాంతి

కొఱకును అవసర మనుట రెండవది. ఇవి మీరు చెప్పు నిష్కామ ప్రార్థ నకు కారణములు. ఈ రెండవ కారణమునుగూర్చి నేను మొదట విచారణ సలిపెదను. బలహీనున కొకరీతి చేతికఱ్ఱవలె ప్రార్థనను మీరు సిఫార్సు చేయుచున్నారు. జీవితపు పరిశోధన లట్టివిగా నున్నవి. మఱియు మాన వుల వివేకమును భ్రష్టముచేసి, యేదో యొక కాలమున ప్రార్థనము విశ్వాసము ప్రజలలో చాలమంది కవసర మనిపించునంత గొప్పదిగా వాని బలమున్నది. అట్టిభావమునకు వా రర్హులు. వా రటుల భావించుకొన వచ్చును. మఱియు నట్టి భావస్ఫురణనే యెన్నడు నెఱుంగని వివేక వాదులు కొలదిమందియే యనుట నిజమే. కాని, యా కొందఱైనను నెల్ల ప్పుడు నుండి రనుటయు, నుండగల రనుటయు నిశ్చయము. మఱియు తీవ్రముగా శంకింపకున్నను, మతమునెడల నుపేక్షాపరులై వర్తించు ప్రజలును కలరు.

సమస్త జనులకును తుదకు ప్రార్థన యొక్క సాయ మగత్యమగు నవరాదు. దాని యగత్యమును గమనించువారు స్వేచ్ఛగా దాని నవలం బింపవచ్చును; అవసరమగుపట్ల అవలంబించితీరుదురుకూడను. అంత మాత్రాన ప్రయోజనదృష్టితో ప్రార్థనయందు నిర్బంధముండుట సమం జసమనలేము. ఒక పురుషునియొక్క శారీరక మానసికాభివృద్ధికి నిర్బం ధమగు శరీరవ్యాయామమును, విద్యాభ్యాసమును నవసరములు కావ చ్చును. ఐనను నైతికాభివృద్ధికి దేవునందు విశ్వాసముగాని, ప్రార్థనగాని యటు లవసరము కాదు. ప్రపంచమున వెలసిన అజ్ఞేయవాదులలో మహా ఘనులు కొందఱత్యంతము నీతిపరులుగ నుండియుండిరి. అటువంటి వారికిని నిజముగా మీా మొదటివాదన ననుసరించి నమ్రతాప్రదర్శనము కొఱకు నిష్కామమగు ప్రార్థనను మీరు సిఫార్సు చేయుదురనుకొందును. ఈ నమ్రతయను విషయమును మీరు కొండంతలు చేయుచున్నారు. శాస్త్రజ్ఞులలో మహా ప్రవీణులు సైతము, కొన్ని సమయములందు నమ్ర భావము పూనవలసివచ్చు నంతటి మహోన్నతమైనదిగా విజ్ఞానము వెలయుచున్నది. ఐనను వారిధోరణి ధీరమగు పరిశోధనగానే యున్నది. మఱియు ప్రకృతిమీద వారు సాధించిన విజయము లెంత ఘనములుగ నున్నవో, తమ శక్తి సామర్థ్యములందు వారి విశ్వాసమును నంత

ఘనముగనే యుండెను. అటుల జరిగియుండని యెడల ఈనాడుగూడ దుంపలకై దేవులాడుకొనుచు మన వ్రేళ్ళతో నేలను గికుకొనుచుండ వలసిన యవస్థలోనే పడియుండెడివారము. ఇంతేల ? మనము భూమి మీద నిలువ జాలక తుడిచిపెట్టుకొని పోయెడివారమే. నరజీవులు చలిచే చచ్చుచుండిన హిమయుగమున పరిశోధనల సాగించి నిప్పును ప్రప్రథమమున కనుగొనిన కాలమున మీ వైఖరికి ప్రతినిధిగా నాకాలమున నున్న పురుషుడు "ఈ పన్నుగడలవలని లాభమేమి ? భగవంతుని యొక్క శక్తిని ఆగ్రహముమ మీరి మీ పూనిక లేమిచేయగలవు ?" అనుచు ఆనాటి పరిశోధకుని పరిహాసము చేసియుండును. వినయశీలురకు ముందెన్నడో దేవరాజ్యము వచ్చునని వాగ్దానము చేయబడు చున్నది. వారి కట్టిది లభించునో లేదో మనకు తెలియదుగాని, ఇప్పుడు భూలోకమున మాత్రము వారిగతి బావిసతనమే. ప్రధాన విషయమునకు మఱలుదము. "నమ్మకము పూనుము, స్థిరవిశ్వాస మదే వచ్చును." అనెడు మీ ప్రవచనమునందు గొప్ప సత్యమున్నది. ఘోరమగు సత్యమే యున్నది. ప్రపంచములోని మత సంబంధమగు మూర్ఖావేశములో చాల భాగము ఈ విధమగు బోధకు ప్రత్యక్షఫలముగా తెలియదగియున్నది. వీలగునంత చిన్నవారినిగా చూచి పట్టుకొని, పదేపదే చాలకాలముగ చెవులలో నూరిపోయుచుంటిరేని, మానవ జీవులలో మిగుల నధిక సంఖ్యాకులు దేనియందైనను విశ్వాసము పూనునటుల మీరు చేయగలరు. ఆ తీరుననేగదా, మీ పూర్వాచారపరాయణు డగు హిందువుని, మూర్ఖావేశు డగు మహమ్మదీయుని మీరు తయారుచేసియుంటిరి. ఈ రెండు జాతులలోగూడ తమ నెత్తిపైని బలాత్కారముగా పడవేసి రుద్దబడిన విశ్వాసములను తప్పించుకొని బ్రతుకగల కొందఱు, అల్ప సంఖ్యాకులే కానిండు, తప్పక సదా యుండనేయుందురు. ఈ హిందువులును, ముసల్మానులును యుక్తవయస్సు వచ్చువఱకు తమ మత గ్రంథములను చదువుట మానుదురేని, వానియందలి హఠవాదములయెడ విశ్వాసముపూని దురావేశపరులు కాకుండెడివా రనియు, మఱియు ఆమూర్ఖవిశ్వాసముల కొఱకైన పోరాటముల దలపెట్టకయుండెడివా రనియు మీకు తెలియును. హిందూ ముసల్మానుల దొమ్మిలాటలకు ఆదిభౌతిక విద్యయే తగిన మందై యున్నది. కాని మీ రట్టి తత్వముగలవారు కారు గావున ఈ పరి

హారమును మీ రామోదింప నొల్లరు. భయభీతులతో ప్రజలు సర్వత్ర యణగారియున్న ఈ దేశములో ధైర్యము, కార్యశూరత, త్యాగము నను వానింగూర్చి యెన్నడు కని విని యెఱుగని రీతిని మహోన్నతాదర్శమును నెలకొలిపినందులకై మీ యెడ మేమెంతయో ఋణపడి యున్నమాట నిజమే. కాని మీ జీవన విధానమును గుఱించి తుదితీర్పు చెప్పబడు కాలమున ఈ దేశమందలి బుద్ధి వికాసము మీ పలుకుబడివలన చాలవెనుకకు నెట్టివేయబడిన దనియే తీర్మానింపబడును సుడీ!

స:— ఇరువదేండ్ల వయసు పిల్లవానిని 'బాలు' డన చెల్లనిచో ప్రపంచము సామాన్యముగా గ్రహించు తెఱగున 'బాలు' డన నర్థమేమో నాకు తెలియదు. ఇంతేల ? బడికిపోవువారి నందఱిని వయస్సు వివక్షత లేకుండ 'బాలురు,' 'బాలికలు' అనియే పిలుతుసు. ఐనను శంకాయత్తుడయిన యా విద్యార్థి 'బాలు' డన తగినను, 'పురుషు'డన తగినను నా వాదన యట్లే నిలిచియుండును. విద్యార్థి సైనికునివంటివాడు. ఒక సైనికుడు నలుబది యేండ్లవాడునై యుండవచ్చును. అతడొక శిక్షణ క్రిందచేరి యందు నిలచియుండ నిశ్చయించుకొనినపుడు ఆ శిక్షణ విషయములనుగుఱించి వాదనకు దిగతగదు. సైనికుడు తన సైనికకూటములో నొకడుగా నుండక మానుకొనవచ్చును. మఱియు తనకు నియమించిన పనులను చేయుటకుగాని, చేయకపోవుటకుగాని తన యిష్టానుసారము నిర్ణయించుకొను నవకాశము అత డందు చేరుసమయమునందు మాత్రమే కలదు. అదేతీరున తా నెంతటి బుద్ధిశాలియైనను, వయస్సు గలవాడైనను యొక పాఠశాలయందో, కళాశాలయందో చేరు సమయమున నచ్చటి శిక్షణమును నిరాకరించు నధికారమును విద్యార్థి వదలుకొనుచున్నాడు. ఈ సందర్భమున ఆ విద్యార్థియొక్క తెలివితేటలను లాఘవము చేయుటగాని, నిరసనము చేయుటగాని లేనేలేదు. ఐచ్ఛికముగా శిక్షణమునకు లోబడుట వాని బుద్ధిపాటవమునకు సహకారమే యగును. కాని ఈ విలేఖరి బుద్ధిపూర్వకముగా శబ్దముల దుర్భరపీడను తనమీద వేసికొని మోయుచున్నాడు. కర్తకు హితవుగానట్టి ప్రతి కర్మయందును అతడు నిర్బంధమును పసిపట్టుచున్నాడు. కాని నిర్బంధ మనేకరీతులుగా నుండును. స్వయముగా పెట్టుకొనిన నిర్బంధమును ఆత్మనిగ్రహ మందుము. దానిని ప్రీతితో స్వీకరించి దాని యండను వృద్ధిగాంచ

జూతుము. కాని మన ప్రాణమునైనను బలియిచ్చి తొలగించుకొనవలసిన నిర్బంధముకూడ కలదు. మన యిచ్ఛకు వ్యతిరేకముగాను, తఱచుగా మనను హీనపఱచు నుద్దేశ్యముతోడను పురుషులుగానో, మఱియు మీ యిష్టము చొప్పున బాలురుగానో కూడ మనగౌరవమును భంగపఱచుచు మన నెత్తిని రుద్దబడు నిర్బంధము అట్టిదగును. సాంఘిక నిరోధములు సామాన్యముగా క్షేమకరములేయగును. వానిని తిరస్కరించితిమా భంగ పడుదుము. "పొట్టపైని ప్రాకులాడుచు పో" మ్మనెడు నుత్తరువులకు లోబడుట పౌరుషహీనమును, పిఱికితనము నగును. ప్రతి క్షణమును మన జీవితములో మన చుట్టును మూగి, మనలను బానిసల చేసివేయు టకు సిద్ధముగానుండు దుర్వ్యసనము లనెడునుూకకు లోబడుట అంత కంటెను నీచమైనది.

మఱియు ఈ విలేఖరిని గొలుసులలో బంధించి పట్టుకొనిన మఱొక మాట కలదు. 'వివేకవాద' మనెడు ఘనమగు శబ్దమే యది. మంచిది. నేను దాని మోతాదును హెచ్చుగానే పుచ్చుకొనియుంటిని. మన వివేకము నకు గల ప్రత్యేకపు పరిమితులను పాటింపవలసినవాడ నగునంతగా నా యనుభవము నా గర్వమును అణచినది. అనుచితస్థానమున నుంచిన పదార్థమును దేనినైనను మనము మలమందుము. అటులనే దుష్ప్రయో గము చేసిన తర్కము వెఱ్ఱిలో చేరును. ఇచ్ఛాపూర్వకముగ "సీజరుకు చెందువానిని సీజరున కర్పించినచో" సర్వమును క్షేమముగ నడచును. వివేకవాదు లనువారు అద్భుత వ్యక్తులు. వివేకవాదము సర్వశక్తివంత మని వక్కాణించునెడల నది ఘోర పెనుభూతముగా సిద్ధమగుచుండును. మన వివేకజ్ఞానమునకు సర్వసమర్థతను ఆరోపించుట కేవల మొకకొయ్య ముక్కనో, రాతినో యదియే దేవత యనుచు పూజించుటతో తుల్యమగు ప్రతిమార్చనమే యగుచున్నది.

ప్రార్థనయొక్క ప్రయోజనమును తర్క సాహాయ్యమున నెవ్వరు ఎపుడు నిరూపించిరి ? దాని ప్రయోజనము సాధన యనంతరము అనుభూతికి వచ్చును. ప్రపంచ మొసగు సాక్ష్య మట్లేయున్నది. కార్డినల్ న్యూమన్ మహాశయుడు తన వివేకము నెన్నడును వదలుకొని యెఱు గడు. కాని "ఒక్క యడుగు నాకు చాలును" అని ఆయన నమ్రభావ ముతో గానము చేసినపుడు, ప్రార్థనకు శ్రేష్ఠతను, గౌరవమునే అంగీక

రించినాడు. శ్రీ శంకరులవారు తార్కికులలో చక్రవర్తి! శ్రీ శంకరుల తర్కవాదమును మించిన దేదియు ప్రపంచ వాఙ్మయమున లేదన దగును. ఐనను వారు ప్రార్థనకును, విశ్వాసమునకును ప్రథమస్థానము నంగీకరించుచున్నారు.

మన యెదుట సంభవించుచున్న క్షణభంగురములును, సంక్షోభ కరములును నగు సంఘటనలపై నాధారపడి వేగిరపాటుతో విలేఖరి యొక్క సామాన్యసూత్రమును కూర్చుచున్నాడు. కాని ఈ పుడమిని ప్రతి విషయమును దుర్వినియోగమున కవకాశ మిచ్చుచున్నది. అట్లగుట నరునికి సంబంధించిన ప్రతి విషయమునగూడ సాధారణ ప్రకృతి ధర్మముగా కాన్పించుచున్నది.

చరిత్రయందు గోచరించు మహా ఘాతుక కార్యములలో కొన్నింటికి మనము బాధ్యత వహించవలయు ననుట నిస్సందేహమే. కాని అది మతముయొక్క దోషముకాదు; నరునందలి దుర్గమమగు పశుత్వము యొక్క దోష మనవలయును. తన పశురూప వారసత్వముయొక్క ప్రభావమును నరు డింకను వదలించుకొనియుండలేదు.

ఏ పనినిగాని యెన్నడును కేవలము విశ్వాసముపై నాధారపడక, తా నొనర్చు కార్యములలో ప్రతిదానిని తర్కముమీదనే ఆధారపడి చేసి యుండిన యొక్క తార్కికునైనను నే నెఱుగను. కాన తన సృష్టికర్త యందు పసివారిం బోలి విశ్వాస ముంచుటచేత సాధారణమగు సక్రమ జీవితములను నడుపుచున్న కోట్లకొలది మానవజీవులను మన మెఱుగుదుము. అట్టి విశ్వాసనమే యొక ప్రార్థన. ఎవని లేఖపై నాధారపడి నా వ్యాసమును వ్రాసితినో యా బాలుడును అట్టి విశాల మానవసంఘమునకు చెందియున్నవాడే. మఱియు నా వ్యాసము ఆ బాలుని, వానితోడి సత్యాన్వేషకులను స్థిరమతుల గావించుకొఱకును, ప్రస్తుత విలేఖరివంటి తర్కవాదులయొక్క యానందమును భంగపఱుపకుండుటకును వ్రాయబడియున్నది.

ఐనను ప్రపంచ యువకసమితికి వారి పెద్దలును, గురువులును చూపు మార్గమును గుఱించిగూడ ఆయన వివాదమునకు దిగుచున్నాడు. ఒకవేళ నటుల మార్గము చూపుటయు లోటే యైనచో భావగ్రహణ వయసున ననివార్యముగ ఘటిల్లు లోటుగా కాన్పించుచున్నది. కేవలము అది

భౌతిక విద్య సైతము యువకహృదయము నొకానొకతీరున తీర్చుటకగు ప్రయత్నమేగదా ! శరీరమునకును, మనస్సునకును శిక్షణ గఱపి యుక్తమార్గమున నడపదగు నని యంగీకరించుపాటి ఔదార్యమును విలేఖరి చూపుచునే యున్నాడు. కాని అశరీరమును, మనస్సును సంభవములుగా చేసిన యాత్మను గుఱించి వానికేమియు విచారములేదు. ఒక వేళ దాని యునికినిగూర్చియే వానికి సందేహము కలదేమో; కాని వాని విశ్వాసరాహిత్యము వానికి ప్రయోజనకారి కాజాలదు. తన తార్కిక పర్యవసానమునుండి తానును తప్పించుకొనజాలడు. ఏలయన, ఈ విలేఖరియొక్క హేతువాదము నాధారము చేసికొనియే, విశ్వాసవాదియు తర్కమునకు పూని, తదితరులు తమ బాలురయొక్కయు, బాలికల యొక్కయు శరీరమును బుద్ధిని సవరింప బూనునటులనే, తానును తన బాల బాలికల యాత్మను సవరింపవలసియుండునని యేలవచింపరాదు? మత బోదవలన యనర్థములు యథార్థ మతభావము యొక్క వికాసము కలుగగనే యంతరింపగలవు. మతబోధనే విడిచివేయుట, పొలమును సక్రమముగా దున్ని సేద్యముచేయు జ్ఞానము సేద్యగానికి కొఱవగుట చేత. భూమిని వ్యవసాయము చేయుట మాని కలుపు పెఱుగనిచ్చు పోలిక సుండును. విలేఖరి పూనిన ప్రాచీనుల ఘనతర విజ్ఞానము యొక్క పరిపోషణ ఇప్పటి విచారణాంశమునకు పూర్తిగా నప్రస్తుతమై యున్నది. వారి పరిశోధనా ఫలితములయొక్క ప్రయోజనమును నేను గాని, మఱెవరుగాని కాదనుట లేదు. ఆ పరిశోధనా ఫలితములు తర్కముయొక్క వినియోగమునకును, వ్యాయామమునకును సామాన్యముగా నుచిత మగు క్షేత్రమై యొప్పును. కాని ఆ ప్రాచీనులు సైతము విశ్వాసమునకును, ప్రార్థనకును నర్హస్థానము తమ జీవితములందు నిరాకరించి యుండలేదు. విశ్వాసము, ప్రార్థనము లేనట్టి కార్యములు గంధశూన్యములగు కృత్రిమ పుష్పములవలె నుండును. నేను తర్కము నణగద్రొక్కివేయు మనుటలేదు. మనలోని తర్కమును సైతము పవిత్రీభూతము చేయునట్టి ఆత్మను నుచిత రీతిని గౌరవింపు డని మాత్రము మనవిచేయుచున్నాను.

## ద్వంద్వయుద్ధము

ఒక మిత్రు డిట్లు వ్రాయుచున్నాడు:— "'యంగ్ ఇండియా' పత్రికయం దొక వ్యాసములో అహింసకును, పిఱికితనమునకును పొత్తు

కుదరదని నొక్కి చెప్పియున్నారు. మీ వ్రాతలో సందిగ్ధముగామున్న యొక్క యక్షరమైనను లేదు. కాని నరుని వర్తనమునుండి పిఱికితన మును పూర్తిగ నెట్లు తొలగింపదగునో తెలుపుడని మిమ్మర్థించుచున్నాను. అందఱి ప్రవర్తనలును వారి వారి కూర్చుకొనిన అలవాటుల మొత్తపు రాశియేయని నేను గుర్తించియున్నాను. మనము పూర్వపు టలవాటులను రద్దు చేసికొని సాహసము, బుద్ధికుశలత, కార్యశూరత మున్నగు క్రొత్త వానిని కూర్చుకొను టెట్లు ? ప్రాత యలవాటులను ఛేదించివేసి పురుషు నిలో నూత్న ప్రవర్తన ప్రభవించుకొఱకు శ్రేష్ఠతరములును, ఘనతరము లును నగు నభ్యాసములను నిర్మాణము చేయదగునని నే నొప్పు కొందును. పురుషునకు ద్విజత్వము నొసగు శిక్షణము, ప్రార్థనలు, అధ్యయనములు మీకు తెలియునని నా యభిప్రాయము. వానింగుఱించి దయచేసి మాకు తెలుపుదురుగాక. 'యంగు ఇండియా' సంచికలలో నొకదానిద్వారా మీ విజ్ఞానమును, మీ సలహాను మా కొసగుడు. దేని సాహాయ్యమున నరుడు ద్విజుడు కాగలుగునో యట్టి ప్రార్థనమును, జీవన చర్యలయొక్క విధానమును వివరింపుచు దయతో మాకు తోడ్పడుడు."

స:— ఇతిహాస మను నెపముతో మహాభారతమునందు ప్రస్ఫుట ముగా వర్ణింపబడినట్టియు కోట్లకొలది హృదయసీమలం దనుదినము జరుగుచుండునట్టియు తెంపులేని ద్వంద్వయుద్ధమునకు సంబంధించినది ఈ సమస్య. ప్రాతయలవాటులనుజయించి, తనలోని యధర్మము నడంచి వేసి ధర్మమును, నర్హపీఠమున తిరిగి ప్రతిష్ఠచేయుట నరుని విధ్యుక్త కార్యమై యున్నది. ఈ విజయమును సాధించుట యెట్లో మతము మనకు బోధించనియెడల అది మనకేమియు బోధించనట్లే, ఐనను యథార్థముగా మన జీవితములో సాహసకార్య మనదగు ఈ విషయమున విజయము నొందుటకు రాజమార్గమేమియులేదు. మనలను బాధించు నధర్మవృత్తుల లోనికెల్ల పిఱికితనము మిక్కిలి గొప్ప దనవచ్చును. సామాన్యముగా దౌర్జన్యమని చెప్పఁకొను రక్తపాతము మున్నగు చర్యలకంటె నది మిక్కిలి ఘోరతర మైనదనుట నిశ్చయము. ఏమన భగవంతునియందు మనకు విశ్వాసము లేకపోవుటవలనను, భగవంతుని కళ్యాణగుణములను మన మెఱుగకపోవుటచేతను పిఱికితనము తలజూపుచున్నది. పిఱికితన

మును అట్టి యితర దోషములను తొలగించివేయుటకై విలేఖరి నన్ను తెలుపుమని కోరిన విజ్ఞానమును, సలహాను నొసగు సమర్థత నాకడ లేనందుకు నేను విచారపడుచున్నాను. ఐనను నా యనుభవసాక్ష్యమును తెలుపగలను. పిఱికితనమును, నింక నితరములగు ప్రాత చెడ్డయలవాట్లను నిర్జించుటకు నరునికి గల మహాశక్తివంతమగు నాయుధము నిక్కముగా హృదయపూర్వక మగు ప్రార్థనయే యని చెప్పగలను. మన అభ్యంతరమున భగవంతుడు కల డనెడు సజీవ విశ్వాసము లేనిది ప్రార్థన దుస్సాధ్యమగును. దేవునికిని, సైతానునకును బహిరంగమున గాక అంతర్యమునజరుగు ద్వంద్వయుద్ధమని క్రైస్తవ మతమును, ఇస్లాం మతమును' దాని నభివర్ణించు చున్నవి. జొరాష్టరు మతము దానిని 'ఆహూర్మజదు,' 'అహ్రిమాను' మధ్య జరుగు పోరాటమనును. హిందూమతము దానిని శిష్టశక్తులకును, దుష్టశక్తులకును నడుమజరుగు ద్వంద్వయుద్ధముగా పేర్కొనుచున్నది. మనము దుష్టశక్తుల పక్షమున చేరుదుమో, లేక శిష్టశక్తుల పక్షమున చేరుదుమో నిర్ణయము చేసికొన వలసియున్నాము. భగవత్ప్రార్థన మనగా తిమిర రాక్షసి బారినుండి నరుడు విడుదల పొందుటకొఱకు నారాయణునితో కూర్చుకొను పవిత్ర మైత్రికన్న వేఱుకాదు. కాని, హృదయపూర్వక ప్రార్థనమనగా పెదవులతో చేయు నుచ్చారణగాదు. ప్రార్థనమన అంతరంగమునుండి వచ్చుచు ప్రతిమాటయందును, ప్రతి చేతయందును, నింతేల నరుని ప్రతి సంకల్పమునందును ప్రకటితమగునట్టి యావేదనయే. ఏదేని దుష్టసంకల్పము సాహసించి నరుని తాకగలుగు నెడల అతడు పెదవులతో మాత్రమే ప్రార్థన చేయువాడని గ్రహింపవలయును. అదేరీతిని వాని పెదవుల దాట వచ్చిన దుష్టశబ్దము సందర్భమునను, వానిచే జేయబడిన దుష్కర్మ సందర్భమునను గూడ గ్రహింపవలయును. సత్యమగుప్రార్థన ఈ త్రివిధదోషములనుండి నిస్సందేహముగా కాపాడగల 'డాలు' వంటిది. సుడీ! అటువంటి యథార్థమును సచేతనము నగు ప్రార్థన విషయములో గూడ ప్రథమ ప్రయత్నమునందే సదా విజయము చేకూరుననజాలము. మనము మనతోడనే పెనుగులాడవలసివచ్చును. మన ఇచ్ఛకు వ్యతిరేకముగా విశ్వాసము కుదుర్చుకొనవలసినవార మగుదుము. ప్రార్థనా మహిమను తెలియగోరుదుమేని, పరిమితి లేని యోర్పు నలవరచుకొన

వలసి యుండును. అంధకారము చుట్టు క్రమ్మవచ్చును. ఆశాభంగము వెంటాడవచ్చును. ఇంతకు మించిన కష్టములే పైబడవచ్చును. ఐనను వీని నన్నిటితో యుద్ధము చేయుచు, పిఱికితనమునకు లోబడక నిలుచు నంతటి స్థైర్యము మన కుండవలయును. ప్రార్థనాపరు డగు నరుడు వెనుదిరిగి పారిపోవుట యనునది లేదు. నే నిప్పుడు చెప్పునది అభూత కల్పనా కథనము కాదు. ఊహామాత్ర చిత్రపటమును నేను రచించుట లేదు. ఉద్గమనము చేయుచు సాగిపోవుటలో కలిగిన అవరోధముల నన్నిటిని ప్రార్థన మూలమున జయింపజాలిప మహాపురుషుల సాక్ష్యమును ప్రోవుచేసి చెప్పుచున్నాను. అభిన్నమై యేకమై నాకుదోచు ప్రార్థనకును, విశ్వాసమునకును నేనెంత ఋణపడి యుంటినో, నా జీవితము గడచిన కొలదిని నధికముగా గ్రహించుచుంటి నను నా సాక్ష్యమును గూడ సవినయముగా అందు చేర్చుచున్నాను. కొలది గంటలని గాని, దినములని గాని, వారములని గాని, పరిమితియే లేక, యెడతెగక దాదాపు నలుబది సంవత్సరముల కాలమునకు మించిన వ్యాప్తిగల నా యనుభవమును తెలుపుచున్నాను. నా వంతుకువచ్చిన ఆశాభంగములను, గాఢాంధకారములను, నిరాశాదుష్ప్రేరణలను, భీతిగొలుపు మందలింపులను, సూక్ష్మతమ మగు నభిమానపు దాడులను అనుభవించియున్నాను. ఐననుగూడ నా విశ్వాసము చాల స్వల్పమే యనియు, నే నాకాంక్షించు నంతటి గొప్పది కానే కాదనియు నే నెఱిగియున్నాను. ఈపాటి నా విశ్వాసమే యీ నాటి వఱకు నాపైబడిన ప్రతి కష్టమును నెదిర్చి తుదకు జయమును సాధింప గల్గెనన నేను చెప్పగలుగుచున్నాను. మనలో విశ్వాసమే యుండిన యెడల, ప్రార్థనాపూరిత మగు హృదయము మన కున్నయెడల మనము భగవంతుని పరిశోధింప నక్కఱలేదు; వానితో షరతుల నిర్ణయించుకొను నగత్యముండదు. మనము శూన్యమంతగా తగ్గిపోవలయును. 'బరోదా' గారు చనిపోవుటకు కొంచెము ముందు నాకొక యమూల్యమగు సంస్కృత శ్లోకమును వ్రాసి పంపియున్నారు. భక్తిపరుడగు నరుడు తనను శూన్యముగా మార్చివేసి కొను'నని దాని భావార్థము. మనము అణువుకంటెను అల్పులమై పోయిననేగాని, మనలోని యధర్మమును లేక దుష్టత్వమును మనము జయింప జాలము. సత్యముగ ఏకైకమును, యథార్థమునగు, ముక్తికి తగిన విలువగా తనకు సంపూర్ణముగా వశమై లొంగుటకంటె,

నితరమును దేనినిగాని భగవంతు డంగీకరింపడు. ఇటుల నరుడు రూపు దొరగినప్పుడు తక్షణమే తాను సర్వజీవుల సేవయందు మునిగినవానిగా గ్రహించును. అది వాని కానందమును, వినోదమును గొలుపును. భగవంతుని సృష్టికి తా నర్పించు సేవలో శ్రమచేయుటను గుఱించి యెన్నడును నలసట నెఱుగజాలని నూతన పురుషుడై యొప్పును.

హరిజనులు నీచసేవల జేయుచు, పుల్లాకులలో పారవేయబడు పదార్థములను తినుటకు హేయపడకుండుటే గాక అవి దొరకనప్పుడు వానికొఱకై ఆరాటపడుటయు కలదు. తమ కట్టివాని నొసగనప్పుడు అన్యాయము జరిగిదని వాపోవుటయు కలదు. ఇట్టి ఘోరదశ వలన హరిజనులును, అసవర్ణులును కూడ ఎంత పతితు లైపోయిరో ఎన్న శక్యముకాదు. ఇతర స్థలములం దేమి జరుగుచున్నదో యని విద్యార్థులాందోళనపడ నగత్యము లేదు. హాస్టలులందలి విద్యార్థులు ధర్మమార్గావలంబులుగ నుండుట మొదటి విషయము. మీకై వంటచేయబడిన ఆహార పదార్థములలో కొంతభాగము పాకీవాంద్రకును, ఊద్చు దాసీలకును వేఱుగ తీసియుంచవలయును.

భారతదేశ మంతటను హాస్టలులలో నేమిజరుగుచున్నదో నాకు కొంతతెలియును. రుచులకొఱకును, భోగముల కొఱకును మితిమీరిన వ్యయమును విద్యార్థులు సామాన్యముగా చేయుచుందురు. తమ పళ్ళెరములలో వడ్డించు పదార్థములను విస్తారముగా విడిచిపెట్టకుండిన యెడల మర్యాదకు భంగము వచ్చునని యెంచు విద్యార్థులను సైతము నే నెఱుగుదును. తమ పళ్ళెరములలో పెట్టిన పదార్థములను యేమాత్రమైనను విడిచి వేయుట అగౌరవమనియు, పేదలయెడ ననాదరణమనియు నేను వారికి తెలుపనెంతును. ఎవరుగాని, ముఖ్యముగా విద్యార్థులు తాము తేలికగా తినజాలినదానికి మించి తమ పళ్ళెరములలో వడ్డింప నంగీకరించుటకు హక్కులేదు. విద్యార్థులు రుచులను, భోగములను పెంచుకొనుట తగదు. సర్వవిషయములందును ఆత్మనిగ్రహ సాధన కొఱకై, ఆత్మ సంయమనముకొఱకై విద్యార్థిదశ ఏర్పడినది. వారు ఆత్మసంయమన ధర్మమును అవలంబించి, పళ్ళెములలో నేమియు విడచి వేయకుండు నలవాటు నేర్చుకొనిరేని, తమవ్యయములను చాల వఱకు తగ్గించుకొన నవకాశముగలదని తెలియగలుగుదురు. ఇంతియేగాక

శము కొఱకై వంటకము చేయబడు సమిష్టి అహారమునుండి పాకీవారు మున్నగు జనులకు ఉదారముగపంచి యీయగలుగుదురు.

ఇటుల చేయుటయేగాక హరిజనులను తమ రక్తబంధువులనుగ చూడవలెను. వారితో దయగా మాట్లాడవలెను. ఇతరులు తినిపారవేసిన వానిని తినెడు మలినపు టాచారమును మానుటెంత యవసరమో వారికి బోధింపవలయును. వారి జీవితము నెటుల సంస్కరించుకోదగునో నేర్ప వలయును. ఈపనికై శెలవుదినములలో విద్యార్థులు ఉత్సాహముతో పూనుకొందురేని నిస్సందేహముగ ఘనకార్యముచేసినవారే యగుదురు.

1. తెలివితేటలతో కూర్చినట్టియు, తమ సెలవుదినములకు సరిపోవునట్టియు కొలదిపాటి బోధనాక్రమమును నేర్పాటుచేసి రాత్రిపాఠశాలలను, పగటి పాఠశాలలను సాగించవలయును.

2. హరిజనవాడలకు బోయి వారిష్టపడి సాయపడునెడల వారి సాహాయ్యముతోడను, లేక స్వయముగను ఆ వాడలను శుభ్రపఱచవలయును.

3. హరిజన బాలబాలికలను వినోదయాత్రలకై గొనిపోయి, వారి గ్రామ సమీపమున గోచరించు చిత్రములను జూపుచు, ప్రకృతిని పరిశీలించు విధమును వారికి నేర్పవలయును. వారి పరిసరములందు వారి కభిమానము, ప్రేమకలుగునటుల బోధచేయవలయును. అనుషంగికముగా చరిత్రపాఠములను, భూగోళపాఠములను వారికి నేర్పవలయును.

4. రామాయణ, మహాభారతముల నుండి చిన్నకథలను వారికి చదివి వినిపించవలయును.

5. సామాన్య భజనకీర్తలను నేర్పవలయును.

6. హరిజనుల బిడ్డలయొక్క మురికి శరీరములను శుభ్రపఱచుచు వారికిని, పెద్దవారలకును సామాన్యారోగ్య సూత్రములను బోధింపవలయును.

7. హరిజనుల స్థితిగతులను దెలుపు జనాభా లెక్కలను కూర్చవలయును.

8. రోగపీడితులగు హరిజనులకు వైద్యసహాయ్యమును చేకూర్పవలయును.

ఇట్టి సూచనల ననుసరించి హరిజనసేవ ననేక రీతుల చేయవచ్చును.

సవర్ణహిందువులకును సేవలొనర్చుట అవసరమే. అస్పృశ్యతా దోషముంగూర్చి మృదుమధుర భాషణములతో సవర్ణులకు నచ్చచెప్ప వచ్చును. నీతిబోధక మగు వాఙ్మయమును వారిలో ప్రచారము చేయుచు వారిలో వ్యాపించియున్న మూఢవిశ్వాసముల పోద్రోలవలయును. అస్పృశ్యతా నివారణ నామోదించువారి యొక్కయు, అందుకు ప్రతికూలు రగు వారి యొక్కయు వాదనలను తెలిసికొనుచుండవలయును. హరిజనుల వినియోగమున కాటంకములులేని బావులు, బడులు, గుడులు, చెఱువులు మొదలగువాని వివరములను సేకరించవలయును.

ఒక క్రమవిధానము ననుసరించి విద్యార్థు లిటువంటి పనుల గుఱించి పూనిక వహించిరేని అత్యద్భుత ఫలితార్థములు చేకూరగలవు. విద్యార్థులు తాము నిర్వహించిన కార్యక్రమము నొక పుస్తకమున వ్రాసియుంచి, సెలవుల యనంతరము దాని సంగ్రహ నివేదికను తమ రాష్ట్రమునందలి కేంద్ర హరిజన సేవాసంఘమునకు బంపవలయును. తోడివారు చేయుచున్నారా లేదా యను విచారణ పెట్టుకొనక ఎవరంతట వారు చేయ ల సేవను చేయుచుండవలయును.

## అస్పృశ్యత

నా సందేహము చాల సరళమైనది. అది యీ నాడు హఠాత్తుగా వచ్చిపడినది కాదు. కడచిన యేబది వత్సరములనుండి నే నవలంబించు చుండినదియే. దాని కనుసరణముగ నేను జీవితమును గడపుచు, విజయముల బడసినకొలదిని అంతరంగమున నా సంతోషము పెరుగుచున్నది. భారతదేశమున నా యీ సందేశమును దెలుపుట కిది మొదటిసారి కాదు. ఇటీవల సంభవించిన కొలది సంఘటనల కారణమున ప్రజల కిది క్రొత్తదిగా కాన్పింపవచ్చును. నా సందేశ సారాంశ మిదియే: తాకరానివా రనియు, దఱి రాకూడనివా రనియు, చూడరానివా రనియు, అవర్ణు లనియు పిలువబడువారి కన్న తాము శ్రేష్ఠుల మనియు చెప్పుకొను సవర్ణహిందువులు తమ దురహంకారమునకు శాస్త్రములం దిసుమంతేని ప్రమాణములు గానరావని గ్రహించవలయును. వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీత, స్మృతి మొదలగు శాస్త్రములందు నేను పేర్కొనిన అస్పృశ్య

తను బలపఱచు ప్రమాణములు గలవేని; యిక నన్ను హిందూమతము నంటిపట్టుకొని యుండునటుల చేయగలది భూలోకమున నేమియు నుండ జాలదు. క్రుళ్ళిపోయిన వంకాయను విసరిపాఱవేయు తీరున నేను వానిని దూరముగా పాఱవేయుదును. సవర్ణహిందువులను, అవర్ణహిందువులను ఉభయులను సృష్టిగావించిన భగవంతుతే తనబిడ్డల నడుమ నిటువంటి వ్యత్యాసములను కల్పించియున్నా డను తలంపే నా బుద్ధికి హేయముగ దోచుచున్నది. అది నా హృదయమునకు శూలపు పోటుగ నుండును.

తాము పఠించు ప్రతి మంత్రమునందును భగవంతుని యేకత్వ మును చాటినట్టియు, వేదములను, ఉపనిషత్తులను ప్రవచించినట్టియు ఋషిసత్తములకు హిందువు లీనాడు పాటించు అస్పృశ్యత వారి సంకల్ప మున నైనను గలదను సూచన బుద్ధిమంతుని కెవనికైనను వెగటుగ దోపక మానదు. కాని ద్వేషభావములు, మూఢవిశ్వాసములు తేలికగా నశించవు. వివేకము నవి కప్పిపెట్టును. బుద్ధిని మందగిల జేయును. హృదయమును, శిలామయము గావించును. కావుననే పండిత ప్రకాం డులు సయితము అస్పృశ్యతను సమర్థింప గడంగుచుందురు.

ఈ నా సందేశమునకు వెనుక మఱొక ఘనతర సందేశ మమరి యున్నదని విద్యార్థులు గ్రహింతురుగాక. భారతదేశమందలి సమస్త సంఘములమీదికిని అస్పృశ్యతా పిశాచము దాడి వెడలుచున్నది. నా సందేశమునకు వెనుకనున్న భావము హిందువులకు హిందువులకు నడుమ అస్పృశ్యతయుండగూడ దనుటయెగాక హిందువులకు క్రైస్తవు లకు, ముసల్మానులకు పార్శీలకు మధ్యనుగూడ పరస్పరము అస్పృ శ్యత పాటింపదగదను సూత్రము నిరూపించుచున్నది. లక్షలాదిగనున్న సవర్ణహిందువుల హృదయములలో పరివర్తనము చేకూరజేయగల్గిన నాడు, వారి హృదయములు విధిగ పవిత్రీభూతములై పఱగునాడు, భారతదేశమునం దంతటను ప్రజ లొండొరులను ఆదరణతో జూచుకొనుచు పరస్పరము విశ్వాసముగాని, సంశయముగాని లేక కలిసి మెలిసి జీవింప గల్గుదు రనుటలో నా కిసుమంతయు ననుమానములేదు. మనల నిప్పుడు ఒండొరులనుండి నుండి విడదీసి వేఱుచేయునదియు, జీవితముల దుస్స హముగ జేయునదియు అస్పృశ్యతయే.

# ౩ ఆంగ్ల విద్యార్థులకు

ఆంగ్లవిద్యార్థులారా!

ఆంగ్లవిద్యార్థులకు ఇంగ్లాండులో సముచితస్థానము గలదు. మీలో కొందఱు భావికాలమున ప్రధానామాత్యులు కాగలరు. సైన్యాధిపతులు కాగలరు. మీ శీలములు నిర్మాణము లగుచుండు తరుణమున, మీ హృదయములలో చొఱబడుట సులభముగా నుండుకాలమున, నేనందు చేర నువ్విళ్లూరుచున్నాను. పరంపరాగతముగ మీకు నేర్పబడుచున్న బూటకపు చరిత్రకు భిన్నముగా కొన్ని యథార్థ విషయములను మీకు దెలుపగోరుచున్నాను. ఉన్నతాధికారులందు అజ్ఞానము ద్యోతకమగు చున్నది అనగా జ్ఞానశూన్యతకాదు. బూటకపుటాధారములపై కూర్చ బడిన మిథ్యాజ్ఞానము. నేను మిమ్ము సామ్రాజ్యనిర్మాతలనుగా గాక, మఱియు స్వార్థమునకై ఇతర జాతుల పీడించుటమాని ఆయుధ ప్రయోగ మునకు బదులుగా నైతిక బలమును వినియోగించి ప్రపంచజాతుల శాంతిరక్షణకు పూనగల మహాజాతికి చెందిన పురుషులనుగా భావించి కొన్ని యథార్థవిషయములను మీ యెదుట బెట్టుటకు ఆశించుచున్నాను.

భారతదేశమున హిందువులపక్ష మనునది ఏమియులేదు. నామట్టుకు నేను నా దేశ స్వాతంత్ర్య సందర్భమున మిమ్మును మించిన హిందు వును నేను కాజాలను. హిందూమహాసభ ప్రతినిధులు తెలుపువిధమున హిందువులపక్ష మొకటి కల దందురు. వారు హిందువుల యభిప్రాయ మును తెలుపబూనితి మందురు. కాని వా రటుల చేయజాలకున్నా రని నా యభిప్రాయము. జాతీయవాదు లగుటనలనగాక, తమ కనుకూల ముగా నుండునను కారణమున, తమ సమస్యకు జాతీయపరిష్కార మొకటి వారు కావలయు ననుచున్నారు. అయ్యది వినాశకరమగు తంత్రమని నేను చెప్పుచున్నాను. తాము అధిక సంఖ్యాకుల ప్రతినిధు లగుచో తామొకప్రక్కకు తొలగి చిన్నచిన్న సంఘములవారు కోరు కొను దానిని వారి కొసంగు డని నేను బ్రతిమాలుచున్నాను. ఇప్పుడు ఇంద్రజాలము వలననో అనునటుల వాతావరణము వినిర్మలమై పోగలదు. హిందువులలో అధిక ప్రజా సమూహము యొక్క భావము ఎవరికిని తెలి

యదు. ఎన్నియో సంవత్సరములుగ వారితో కలసిమెలసి వారిమధ్య వర్తించుచున్న నేను, ఎన్నికస్థానాల సందర్భములోగాని, ఉద్యోగపదవుల సందర్భమునగాని, స్వప్రయోజన, స్వలాభముల సమస్య వారిని బాధించదని ఎఱుగుదును. సాంఘిక వివాద మను పీడ భారతదేశ సంప్రదాయమునకు విరుద్ధమును. లండను మున్నగు పాశ్చాత్య నగరములకు క్షుద్రానుకరణము లనదగు కొన్ని భారతదేశ నగరమునకు మాత్రమే సంబంధించినదియునై యున్నది. కొలదిపాటి మా నగరములందలివారు అత్యధికముగ నున్న మా గ్రామములందలివారిని బుద్ధిపూర్వకముగా పీడించి బ్రతుకనెంచుచు, ఇంగ్లాండు తరపున కమీషన్ ఏజంట్లుగానిలిచి, మా గ్రామీయుల పీడించుటచే సంపాదించిన లాభములను మీతో (ఆంగ్లేయులతో)ఁ గూడి పంచుకొనచూచుచున్నారు.

ఏ భారతస్వాతంత్ర్య సమస్యనుగుఱించి బ్రిటిషుమంత్రులు సతతము తప్పించుకొని వర్తించుచున్నారో, అటువంటి సమస్య ముందు మా సాంఘికపు తగవు చెప్పుకోతగిన ప్రాధాన్యత గలదేకాదు. అసంతృప్తిచెంది తిరుగుబాటుచేసిన భారతదేశముతో పొత్తు చిరకాలము నిలువజాల దనుటను మీరు మఱచుచున్నారు. మాయది దౌర్జన్యరహితమగు తిరుగుబా టనుట తథ్యమే. అయినను అదియు తిరుగుబాటేగదా! మా సంఘమున కొన్ని భాగములను నేడు తినివేయుచున్న వ్యాధికన్న భారతస్వాతంత్ర్య సమస్య మాకు హెచ్చు ప్రాముఖ్యతగలది. రాజ్యాంగ నిర్మాణ సమస్య తృప్తికరముగా పరిష్కరింపబడుచో సాంఘికవ్యాధి తక్షణమే అదృశ్యమై పోగలదు. విదేశీయుల అవరోధము తొలగిన క్షణముననే విడిపోయియున్న మాసంఘ భాగములు కూడి కలిసికొన గలవు. కాబట్టి హిందూపక్ష మనునదియే లేదు. ఒకవేళ నున్నదన్నను సులభముగా రూపుమాసిపోగలదు. ఈ సమస్యను విచారణలోనికి తీసికొనుట వలన మీకేలాటి లాభము నుండదు. అనవసరముగ విసిగించు స్వల్పపు సాంఘిక వివాదముల గొప్పచేసి చేపట్టితిరా మీరు మమ్ము గంగలో కలిపినవారే యగుదురు. సాంఘిక సమస్య మమ్ముల బాధించదనియు; దానింగూర్చి మీరు ప్రమేయము పెట్టుకొను నవసరములేదనియు నేను దైవముఖమునుచూచి సత్యమును చెప్పుచున్నాను.

## మా స్వాతంత్ర్యోద్యమము

మీరు యథార్థపు చరిత్రను తెలియగోరు నెడల లక్షలాది ప్రజలు సమిష్టి దౌర్జన్య రాహిత్యవిధానమును అవలంబించుటకు ఎటుల మన స్ఫూర్తిగా పూనుకొనిరో, ఎటులదాని నంటిపట్టుకొనియుండిరో ఆ సంఘటనముయొక్క విచారణకు పూనుకొనుడు. నరుని అరణ్యావాప దశయొక్క మూర్ఖధర్మమును నేడును పూనుకొను మానవుల పశుస్వభావమును పాటింప గడంగకుడు. నరుని పూర్ణదశయొక్క ప్రభావమును పాటించుడు. సంఘముపేర పిల్లితగవులకు దిగుజనులు ఉన్మాద శరణాలయముల నలంకరింపదగిన జీవులవంటివారు. అట్టివారిని విడిచి, తమ దేశస్వాతంత్ర్యోద్యమమును శిరసావహించి, పరుని కొక్కనికేని హాని సలుపక, తమ జీవితములం దర్పణముగావింప సమకట్టిన పురుషుల నవలోకింపుడు. మీరు పెరిగి పెద్దవా రగునప్పుడు, పారంపర్యముగా వచ్చు మీ ఘనతకు వికాసము చేకూర్చు విధమున, ప్రేమ ధర్మమనెడు పరాకృతిని అనుసరించెడు పురుషవరుల చరిత్రను పఠించుడు. మీజాతి మా జాతిపైని రాజ్యాధిపత్యము సాగించుచున్న దనుట మీరు గర్వింపదగిన విషయముకాదు. ఎవడును తననుతాను బంధించుకో నెంచతగదు. తాను దాస్యమున మునిగిపోకుండ ఏజాతియు మఱొకజాతిని దాస్యమున నడంచిపట్టి యుంచజాలదు. ఇంగ్లాండునకును, ఇండియాకును మధ్య నేడుగల సంబంధము బహు పాపభూయిష్ఠమైనది. అది మిగుల నసహజమగు సంబంధము. మాకు జన్మస్వామ్య మైనట్టియు, మే మనుభవించుచున్న క్లేశముల మూలముననను, మేము పూనిన తపశ్చర్యవలనను ఇనుమడించిన న్యాయముతో మా అర్హతను ప్రకటించునట్టియు మా స్వాతంత్ర్యమునకు స్వభావసిద్ధమగు పాత్రత మాకుగలదు. కావున మా రాయబారమును మీరు దీవింతురని కోరుచున్నాను. మీరు పెద్దవారగుతరిని మీజాతి కాపాదించియుండు పరపీడన పాదిత్యమును తొలగించుకొని, తన్మూలముగా మానవజాతి పురోవృద్ధికి తోడ్పడుచు, మీ జాతియొక్క ప్రతిభను దశదిశల ప్రసరింపజేయ గడంగుదని మిమ్ము కోరుచున్నాను.

మా జాతీయుల ఇక్కట్టుల బాపుకొనుకొఱకుకంటె, మానవ స్వభావము పశుసైజముగ పరివర్తనము చెందిపోకుండ నాపుటకొఱకైయే హెచ్చుగా నేను పరితపించుచున్నాను. నా జాతివార లనుభవించు బాధలం గూర్చి నే నెంతయో గర్వపడుచున్నాను. ఐచ్ఛికముగా బాధల ననుభవించు పురుషులు తమనుమాత్రమే గాక మానవజాతి నంతను నుద్ధరింప గల్గుదురని నే నెఱుగుదును. మఱియు వైరుల నడంచి విజయముల సాధించుకొఱకును, తమకన్న దుర్బలురగు జాతివారలనో, వ్యక్తులనో పీడించి శోషిలచేయుకొఱకును ప్రబల ప్రయత్నముల సాగించు పశుప్రాయులగు ప్రజలు తమనేగాక, మానవజాతి నంతను అథఃపతనము గావించువా రగుదురు. మానవ జాతియంతయు మట్టిగొట్టికొనిపోవ జూచుచుండుట నాకుగాని, మఱేనరునకుగాని ఆనందప్రదము కాజాలదు. మన మెల్లఱము ఒకే భగవంతుని బిడ్డల మగుచో, ఒకే ఆత్మ తేజమును బంచుకొనువార మగుచో మనజాతివాడుగాని, వేఱొండుజాతివాడుగాని ప్రతి నరుడును సలుపు పాతకములను మనము పంచుకొనక తప్పదు ఎట్టి నరజీవియందైనను పశువృత్తిని ప్రకోపింపజేయు టనగా నెంతటి హేయమగు కర్మయో మీరు గ్రహింతురుగాక!

కావున ఏ జాతివారలలో నాకు పెక్కండ్రు మిత్రులు గలరో అట్టి ఆంగ్ల ప్రజలలో పశువృత్తి ప్రకోపింపజేయు టనిన ఇంకను నెంత హేయమగు కర్మగా నే నెంతునో మీరు గ్రహింతురు గాక!

## ప్రశ్నోత్తరములు

ప్రశ్న:— భారతదేశమును పారిశ్రామిక దేశముగా మార్చుటం గూర్చి మీ అభిప్రాయ మేమి ?

సమాధానము:— పారిశ్రామిక తత్వము మానవజాతికి ఒక శాపముగా పరిణమించనున్నది. ఒకజాతి మఱొకజాతిని స్వార్థమునకై శోషిల జేయుట సర్వకాలము సాగిరాజాలదు. పారిశ్రామిక తత్త్వము ఇతరుల శోషింపజేయుటలో మీ సమర్థతపైనను, విదేశవ్యాపార స్థానములను సంపాదించుటపైనను, పోటీదారులు లేకుండ చేసికొనుటపైనను ఆధారపడి నడచును. ఈ వసతులు రానురాను ఇంగ్లాండునకు తఱిగిపోవుచున్నవి. అందువలన ఇంగ్లాండునందు నిరుద్యోగుల సంఖ్య నానాటికి

పెరిగిపోవుచున్నది. భారతీయులు సాగించిన బహిష్కారోద్యమము దోమకా టంతదికూడ కాదు. అయినను ఇంగ్లాండు స్థితియే యిట్లుండగా మహా విశాలదేశ మగు ఇండియా పారిశ్రామిక దేశముగా మారి లాభము నొందనేజాలదు. ఇండియాయే పారిశ్రామిక దేశముగా మారునెడల అన్య దేశములను పీడించి శోషిలచేయవలసివచ్చును. అట్లగుట అన్యజాతులకు పీడాకరమును, శాపమును నగును. కావున ఇతర జాతులను శోషింపజేయు కొఱకై ఇండియా పారిశ్రామికదేశము కావలయునని నే నెట్లు వాంఛింపగలను. ఆ అపాయకరస్థితిని మీ రిప్పుడే గ్రహించుచుండుట లేదా ? నిరుద్యోగులగు ముప్పదికోట్ల జనులకు మేము పని గల్పింపగల్గుచుండగా ఇంగ్లాండులోని ముప్పదిలక్షులమందికి మీరు పని కల్పింపజాలకున్నారు గదా ! ఈ సమస్య ఇంగ్లాండులోని మహా మేధావులనే తబ్బిబ్బు చేసివేయుచున్నది. పారిశ్రామిక తత్త్వమువలన భావికాలమున నేమి మూడనున్నదో అంతయు నంధకారమయముగ నున్నది. అమెరికా, జపాన్, జర్మనీ, ఫ్రాన్సు దేశములు ఇంగ్లండుతో సమర్థముగ పోటీ చేయుచున్నవి. ఇండియాలోని కొలది మిల్లులు సయితము ఇంగ్లండుతో పోటీకి నిలుచున గ్గొంచబడు చున్నవి. ఇండియాలో ప్రబోధము కలుగుచున్న తీరుననే దక్షిణాఫ్రికాలో గూడ ప్రబోధము కలుగ సాగినది. ఖనిజ సంపత్తిలోను, ప్రజాబాహుళ్యములోను దక్షిణాఫ్రికాకు నైసర్గికమగు ఆధారములు మిక్కుటముగ కలవు. ఆఫ్రికాలోని బలయుతజాతుల మ్రోల ఇంగ్లండు ప్రజలు పిట్టలైపోదురు. వారు పుష్టివంతులైనను మోటువారు గదా యని మీ రనవచ్చును. వారు సమర్థులనుట సత్యము. కాని వారిని మోటువా రనదగదు. కొలది సంవత్సరముల కాలములోనే పాశ్చాత్యులు తయారుచేయు సరకులను మితిలేకుండ దిగుమతిచేయగల క్షేత్రము లక్కడ దొఱకక మీరు ఇక్కట్టులపా లగుదురు. మీ పాశ్చాత్యులకే పారిశ్రామికతత్త్వము అంధకారమయ మైపోవుచుండ ఇండియాకది అత్యంతము అంధకారమయము కాగలదు. ఆ ఆపద పై బడకుండు గాక !

ప్ర:— అన్యదేశ వస్తువులను బహిష్కరించుట మేలా ?

సమాధానము:— వస్త్రము వినా తక్కిన విదేశవస్తువుల వర్తకమును గుఱించి నే నంతగా పట్టించుకొనుటలేదు. విదేశీ వను మాత్రాన

అన్ని వస్తువులను బహిష్కరింపవలయు నని నేను ప్రచారము చేయుట లేదు. భారతదేశపు స్వదేశీ వ్యవహారములకు హానికరము లగు అన్ని విదేశవస్తువుల సందర్భమునను నా ఆర్థికసిద్ధాంతము దిగుమతులకు వ్యతిరేకముగనే యుండును. భారతదేశమున లభింపజాలు ఏ సరకునైనను పరదేశములనుండి ఎట్టి పరిస్థితియందైనను దిగుమతిచేయుట తగదని నా అర్థము. ఆస్ట్రేలియా గోధుమలు ఇండియాలో పండు గోధుమలకన్న ధరలో చౌకయగుగాక, రకములో మేలైన వగుగాక! ఏ కారణము చేతను వానిని ఆస్ట్రియానుండి దిగుమతిచేయుట పాపకార్యమే యగును. కాని భారతదేశములో పండించని ఓటు ధాన్యపుపిండి విషయమున, అది అత్యంతము అవసరమని తేల్చుపక్ష, ఆ ఓటుపిండిని స్కాట్లాండునుండి దిగుమతి చేయుటకు నా అభ్యంతర ముండదు. దీని అర్థ మేమన: విదేశవస్తు బహిష్కారమును కేవలము అసూయచేతగాని, ద్వేషముచేతగాని నేను ప్రోత్సాహము చేయజాలను. ఇందుకు బిన్నమగు పరిస్థితిని విచారించుడు. భారతదేశములో కావలసినంతచర్మము సిద్ధముగా దొఱకుచున్నది. కాబట్టి ఆ చర్మముతో తయారైన పాదరక్షలను, అవి విదేశీకర్మముతో తయారైన పాదరక్షలకన్న నాణెములో తక్కువగ నున్నను వాడుకొనుట నా విధి. అటులనే నా కవసరమగు బెల్లము స్వదేశమున దొఱకునప్పుడు విదేశ పంచదారనుగాని, బెల్లమునుగాని దిగుమతి చేయుటకును నేను ఆక్షేపింతును. ఈ విషయములను విచారించిన పిమ్మట చూచినయెడల, ఇండియాలోనికి దిగుమతికాకుండ నిషేధింప వలసిన సరకుల పట్టీని అపారముగా పెంచుట కవకాశమున్న దని స్పష్టపడగలదు. ఇట్టి విషయములలో మార్గము చూపదగిన సామాన్య సూత్రములను సూచనగా పేర్కొంటిని. భారతదేశ పరిస్థితులు ప్రస్తుతదశయం దున్నంత కాలమును, భవిష్యత్కాలమున సయితము ఈ సూత్రములు ప్రయోగార్హములే యగును.

ప్ర:— మీరు యంత్ర ప్రయోగమునకు విరోధులా?

స:— నేను శరీరమును సయితము సున్నితమగు నొక యంత్రముగా పరిగణించువాడను. కావున యంత్రప్రయోగమునకు విరోధిని కాజాలను. నా రాటము సయితము ఒక యంత్రమే గాదా! నేను యంత్ర

ప్రయోగమును ఖండించువాడను కాను. అయినను యంత్రజాలమును మితిలేకుండ వెఱ్ఱి యావేశముతో వినియోగించుటను ధిక్కరింతును.

శ్రమనివారక మనుమిషతో యంత్రప్రయోగమును పెంపుచేయుట వెఱ్ఱితనముకాదా? శ్రమను తగ్గించు నెపమున వేలకొలది జనులను పనిపాటులు లేనివారిగజేసి, వారు నడివీధిలోపడి చచ్చునంతటి అవస్థను తెచ్చి పెట్టుటను నేను గర్హింతును. నేనును కాలమును, శ్రమను తగ్గింప గోరుదును. కాని అందువలన కొలదిమంది జనులకు మాత్రమేగాక సర్వప్రజలకును శ్రమను తగ్గింప వాంఛింతురు. కొలదిమంది చేతులలో మాత్రము ధనము పేరుకొనుట నాకు సమ్మతముకాదు. అది అందఱి కిని అందుబాటులో నుండవలయును. ఈనాడు యంత్ర సమృద్ధి కొందఱుమాత్రము ధనరాసులపై నోలలాడుట కుపకరించుచున్నది. దీని వెనుకనుండి ప్రేరణచేయుచుండు మహాశక్తి శ్రమనివారణ కారణమగు పరోపకార భావముగాదు. మఱేమన్న అది దుష్టతృష్ణయే. అట్టి తంత్ర మునే నే నెదుర్కొని పోరాడ నిశ్చయించినది.

సింగర్సు కుట్టుయంత్రములయెడ నా యాక్షేపణ యంతగా లేదు. ఏ యంత్రములు వ్యక్తికి సహాయకరములుగా నుండి వాని వ్యక్తిత్వ మును భంగపఱచవో అట్టి యంత్రములు ఆదరణీయములగును. యంత్ర ములు నరుని అవయవములను వ్యర్థము చేయునవిగ మాత్ర ముండ తగదు.

బైసికిళ్ళు, మోటారుకార్లు అట్టివికావు. అవి నరుని ప్రాథమికావ సరములలో చేరవు. ఏలయన : మోటారుకారుతో సమానమగు వేగముతో గమనము చేయుచుండుట ప్రాథమికావసర విషయముకాదు. సూదియో ప్రాథమికావసర వస్తువులలోచేరును. ఊరక ఆదర్శవాదమునకు దిగినచో సకల యంత్రములను త్రోసివేయవలసినదే. మోక్షమున కవరోధమగుపట్ల నే నీ శరీరమును సయితము నిషేధింతును. నాకు పరమార్థము జీవుని పరమముక్తి. అయినను శరీరమువలెనే కొన్నియంత్రములు అనివార్యము లగును. వానిని సామాన్యావస్థలో తొలగించుకోజాలను.

# ౬. విద్యార్థుల ధర్మము

భావనగరమునందలి శ్యామలదాస కళాశాలయం దొసగిన యుపన్యాసముయొక్క సారాంశము:—

నే నీ దినమున విద్యార్థుల ధర్మమును గుఱించి ఉపన్యసింపవలసియున్నాను. ధర్మమనునది యెంత సులభమైనదో అంత కష్టమైనది కూడ నగును. హిందూమతమున విద్యార్థి అనగా బ్రహ్మచారి. విద్యార్థి దశకు బ్రహ్మచర్యాశ్రమ మని పేరు. వివాహము లేకుండుట యనునది బ్రహ్మచర్యమున కొసగబడుచున్న సంకుచితార్థము మాత్రమే. విద్యార్థియొక్క జీవితము లేక దశ అని దాని కొసగబడిన మొదటి అర్థము; అనగా ఇంద్రియముల నిగ్రహ మన్నమాట. కాని ఇంద్రియముల నిగ్రహించుట ద్వారా గ్రంథపఠనము చేయునట్టియు, జ్ఞానము నార్జించునట్టియు కాలము లేక దశకంతకును బ్రహ్మచర్యాశ్రమ మనియే భావము కలిగినది. అధికముగా స్వీకరించుట, అల్పముగా నొసగుట యని విధిగా ఈ జీవితదశ కర్థ మేర్పడుచున్నది. ఈ దశను మనము ముఖ్యముగా స్వీకరించువారముగా నుందుము తలిదండ్రులనుండి, ఉపాధ్యాయుల నుండి, లోకులనుండి మన కవకాశ మున్నంతవఱకును గ్రహించుకొనుచుందుము. అయినను, ఈ స్వీకరణముతోపాటు పూర్వమువలె ప్రతిదానము చేయువిధి మనపైని వెంటనే పడుట లేకున్నను ఉచిత సమయమున వడ్డీకి వడ్డీకట్టి లెక్కవేసి ఋణము తీర్చవలసిన బాధ్యత తప్పక మనపై బడుచునేయున్నది. ఆ కారణము చేతనే హిందువులు బ్రహ్మచర్యాశ్రమము నొక మతధర్మముగా పోషించుచున్నారు.

బ్రహ్మచారియొక్క జీవనమును, సన్న్యాసియొక్క జీవనమును ధర్మస్వరూపమున సమానముగా నెంచబడుచున్నవి. బ్రహ్మచారి తాను యథార్థముగా బ్రహ్మచారియై మనగోరునేని సన్న్యాసివలె మెలగవలెను. సన్న్యాసి తా నా ధర్మమును ఏర్చుకొని తీసికొనుచున్నాడు. హిందూ ధర్మమునందలి నాలుగాశ్రమములును ఈనాడు పవిత్రతను గోల్పోయి నామమాత్రముగా నిలిచి యున్నవి. విద్యార్థియగు బ్రహ్మచారియొక్క జీవనము ఆదియందే విషలిప్తమై పోవుచున్నది. ఈ తరమువారికి ఎదు

రుగాబెట్టి చూపి, 'అవిగో, వానినుండి పాఠములను నేర్చుకొనుడు. వాని ననువర్తింపుడు' అని చెప్పుటకు తగిన ఆశ్రమము లేవియు మిగిలి యుండకున్నను, ప్రప్రథమమునం దీ ఆశ్రమముల ప్రేరేపణ చేసియున్న దివ్యభావములగుఱించి మనమింకను స్తుతిపాఠముల జేయగల్గుచున్నాము.

విద్యార్థుల ధర్మమును గుఱించి మన మీనాడు తెలిసికొనజాలు టెట్లు? ఆ ఆదర్శమునుండి మన మెంతయో పతనము గాంచియున్నాము. తలిదండ్రు లా పెడత్రోవల బెట్టుటకే మార్గదర్శకు లగుచున్నారు. వారు తమ బిడ్డలు ధనమును, పదవులను సంపాదించు నిమిత్తమే చదువులు చదువ వలసినవా రనుకొనుచున్నారు. చదువు, జ్ఞానము అనునవి అ తీరున భ్రష్ట మైపోవుచున్నవి. విద్యార్థి జీవితమున వికాసము గాంచవలసిన శాంతి, నిష్కాపట్యము, ఆనందమునను వానికై యే యెడను వెదకినను కనుగొనలేక వ్యర్థప్రయత్ను లగుచున్నాము. దేనిం గుఱించియు పరితాప మిసుమంతయేని లేకుండ మెలగదగిన మన విద్యార్థులు పుట్టెడు దిగుళ్ళ తోను, ఆందోళనలతోను క్రుంగిపోవుచున్నారు. వారు జ్ఞాన సముపార్జ నము చేయుటయు, దానిని జీర్ణింప చేసికొనుటయునే పనిగా గలిగి యుండ దగిన దశ ఇది. దేనిని స్వీకరించుటో, దేనిని త్రోసిపుచ్చుటో యను విచక్షణతను మాత్రమే వారు తెలియవలసియుందురు. ఈ విచ క్షణతను శిష్యగణమునకు నేర్పుటయే ఉపాధ్యాయునికి విధి. విచక్షణ లేకుండ ప్రతిదానిని స్వీకరించుచుపోతిమా, మనము జడయంత్రములకు మించిన యోగ్యులము కాజాలము. మనము ఎఱుక గలట్టియు, యోచన చేయగలట్టియు జీవులము. ఈ కాలముననే మనము సత్యమును, అసత్య మును, హిత భాషణమును, అహిత భాషణమును, పవిత్ర విషయము లను, అపవిత్ర విషయములను వివేకించుటను నేర్వవలయును. కాని యీ నాటి విద్యార్థియొక్క మార్గములో సదసద్వివేకము చేయుటయందు గలుగు చిక్కులను మించిన చిక్కు లెన్నియో వెదజల్లబడుచున్నవి. అతడు తన చుట్టు క్రమ్ముకొనిన విషమవాతావరణముతో పోరుసలుప వలసినవా డగుచున్నాడు. పవిత్రఋష్యాశ్రమ పరిసరములకు మారుగా, జననీజలకుల యాదరణకు బదులుగా విచ్ఛిన్న మైపోయిన గృహ వాతా వరణమును, నవీన విద్యాపద్ధతిచే కల్పింపబడిన కృత్రిమ పరిసరము

లును వాని నలముకొనుచున్నవి. ఆ ఋషిసత్తములు పొత్తములజోలి లేకుండగనే విద్యల నేర్పెడివారు. వారు తమ శిష్యగణమునకు కొలది మంత్రముల నుపదేశించెడివారు. ఈ శిష్యులా మంత్రములను పెన్నిధుల వలె తమ స్మృతియందు భద్రపఱచుకొని, వానిని తమ జీవితాచరణము నందు ప్రతిబింబింప చేసెడివారు. ఇప్పటి విద్యార్థియో, తన కూపిరాడ కుండ పూడ్చిపెట్టనోపు మోపెడు పొత్తముల యడుగున పడి బ్రతుకవలసి వచ్చుచున్నది. నేను చదువుకొను దినములలో రేనాల్డ్సు నవలలు చదువుట విద్యార్థుల కలవా టైపోయినది. కాని నేను చుఱుకైన విద్యార్థిని కాకుండుటచేతను, పాఠ్యగ్రంథములు కాక ఇతర పొత్తముల గొడవ పెట్టుకో నెంచనివాడ నగుటచేతను, నా కా నవలల బెడద తప్పినది. నేను ఇంగ్లాండుకు పోయినప్పుడు మాత్రము అచ్చటి మర్యాదగల సమాజములలో ఈ పుస్తకములు నిషేధింపబడినవనియు, వానిని జదువని కారణముచేత నాకు నష్టమైన దేమియు లేదనియు తెలిసికొంటిని. అటులనే విద్యార్థి దూరముగా నెట్టివేయవలసిన యితర విషయము లనేకము గలవు. అట్టి యంశములలో నొకటి పదవీసముపార్జన వ్యామోహము। దాని గొడవ గృహస్థున కుండదగును. అది విద్యార్థియగు బ్రహ్మచారికి తగనిపని. అతడు తన దేశపరిస్థితులెట్లున్నవో గ్రహింపవలయును. తన దేశము నెదుర్కొనిన బెడద యెంత పెద్దదో గుర్తుతెలియ యత్నించ వలయును. తా నేమి చేయవలసియుండునో, తెలిసికొన వలయును. మీలో చాలమంది వార్తాపత్రికల చదువువారే నని చెప్పగలను. వానిని పూర్తిగా విడచివేయుడని మీకు చెప్పజాల ననుకొందును. అయినను క్షణభంగుర మగు అభిరుచుల దెలుపు సర్వమును విసర్జించివేయు డని సలహా యిచ్చుచున్నాను. మఱియు స్థిరతర లాభమును చేకూర్చున దేమియు వార్తాపత్రికలందు గానరాదని చెప్పగలను. శీల నిర్మాణమునకు తోడ్పడ జాలున దేమియు నందుండదు. కాని వార్తాపత్రికల వ్యామోహ మెటు వంటిదో నే నెఱుంగుదును. అయ్యది శోచనీయము; మహా ఘోరము. విద్యా ప్రచారమున నేనును కొన్ని ప్రయోగముల గావించిన వాడను గాన ఈ తీరున మాటలాడుచున్నాను. ఆ నా ప్రయోగము వలననే 'విద్య' యనగా నర్థ మేమొ తెలిసికొంటిని. సత్యాగ్రహమును, అసహాయ యోగమును గనుగొంటిని. మఱియు ఆ నవ్యతర ప్రయోగములను

ఉపక్రమించితిని. ఈ తుది ప్రయోగములను సాగించినందుల కెన్నడును నేను పశ్చాత్తాపము చెందియుండలేదు. మఱియు కేవలము రాజకీయ ముగ స్వరాజ్యమును మాత్రమే సాధించుకొఱకును వానిని వినియోగము చేసియుండలేదు. వానిని విద్యార్థుల యెదుట నుంచుటకు సాహసించి యుంటిని. ఏమందురా ? అవి నిరపాయమైనవి. అవియె యీనాడు నూలు వడుకు నుద్యమము నందు మూర్తివంతమైనవి. ఆ యుద్యమము మొట్ట మొదట హేళనకు గుఱియైనది. పిమ్మట తిరస్కారమునకు లోనైనది; అనతికాలములో నదియే అదరాభిమానములతో స్వీకరింపబడనున్నది సుడీ ! కాంగ్రెసు దానిని చేపట్టినది. రాజప్రతినిధియగు రీడింగు ప్రభు నికి సయితము నేను దానిని సగౌరవముగా సమర్పించుటకు వెనుదీయను. అటుల సమర్పణము చేయుటలో నాకు నష్టమేమియు నుండదని యెఱుంగుదును. కావుననే అందుకు నేను వెనుదీయను. దానిని నిరాకరించుచో నష్టపడునది రీడింగు ప్రభువే. కలకత్తా బిషప్పుగారితో ఢిల్లీలో నాకు పరిచయము గలిగినప్పుడు, వాని కీ రాట్న సందేశము నొసంగుటకు నేను జంకియుండలేదు. కర్నల్ మాడక్‌గారి సందర్భము నను నటులనే చేసినాను. మఱియు మాడక్ సతి ఇంగ్లాండునకు వెడలు సందర్భమున నే నామెకొక ఖద్దరు రుమాలును కానుకగా నొసగి, దాని సందేశమును ఇంటింటికిని నచట ప్రచారముచేయు డంటిని.

ఈ రాట్నసందేశము మిగుల నిరపాయమైన దగుటయేగాక కడు ప్రయోజనకారియు నగుటచేత, సర్వకాల సర్వావస్థల యందును దాని సందేశమును వ్యాపకము చేయుటన నాకు విసుగు జనించుటలేదు. దానియందు రుచిగాన్పింపక పోవచ్చును. ఆరోగ్యప్రదమగు నే యాహార మందును ఆరోగ్య భంగకర మగు మసాలాద్రవ్యములందు జూపట్టురుచి గోచరించుటలేదు. కావుననే మొదట వెగటుగానుండి తుదిని అమృత ప్రాయముగ పరిణమించగల విషయముల నవలంబనము చేయుడని గీతలోని యొక సుప్రసిద్ధశ్లోకము నుడువుచున్నది. రాట్నచక్రమును, దానిచే లభించు ఉత్పత్తియు ఈ నా డటువంటివిగ నున్నవి. విద్యార్థుల యాత్మకు శాంతిగొలుపుటకును, చెదఱియున్నవారి యుల్లమునకు ఉప శమనము చేకూర్చుటకును, వారి జీవితమునకు ఆధ్యాత్మిక తేజము

నొసగుటకును సమర్థమగు యజ్ఞము, రాట్నచక్రమును మించిన దీనాడు వేఱొకటి లేదు. సత్వర ఫలప్రాప్తిని ఆకాంక్షించు కర్మ ప్రధానమ్మౌ ఇక్కాలమున దీనిని మించిన అనుష్ఠానమును నేను దేశమునకు చూపజాలకున్నాను. గాయత్రి సయితము అటువంటిదికాదు. గాయత్రిని ప్రతిపాదించుట నాకు సమ్మత మైనదే. కాని దానివలన సత్వర ఫలప్రాప్తిని నేను వాగ్దానము చేయజాలను. కాని మీ పెదవులపైని భగవన్నామోచ్చారణ జరుగుచుండ ననుష్ఠానము సాగించి, సత్వర ఫలితముల సాధించుట కనువగునది నే నిప్పుడు చేయు ప్రతిపాదనమే. ఒక ఆంగ్లమిత్రుడు నూలు వడకుట పరమోత్తమ మగు క్రీడగా తన ఆంగ్ల జాతికి సహజమౌ యింగితజ్ఞానమునకు దోచుచున్నదని నాకు వ్రాసియున్నాడు. 'అది నీకొక యనుంగుక్రీడ కానోపును. కాని మాకది కల్పద్రుమమే' యని నేనంటిని. పాశ్చాత్య సంప్రదాయములు చాల నాకు గిట్టనివి కలవు. కాని వానిలో కొన్నింటినిగూర్చి నా ప్రశంసను దెలుపక దాచజాలను. 'క్రీడ' అనుదానికి గంభీరార్థమున్నది. శస్త్రకర్మయందు నిపుణుడగు కర్నల్ మాడక్‌గారు తన వృత్తియం దత్యంతము అనురాగము గలవా డైనను యావత్కాలము తన పనియందే గడుపువాడు కాడు. రెండుగంటల కాలము తన యభిమాన క్రీడా కార్యమగు ఆరామకృషియందు వినియోగించెడివాడు. ఆ తోటపని వాని జీవితమునకు ఉత్సాహమును, అభిరుచిని చేకూర్చెడిది.

కాబట్టి క్రీడగానైనను సరియే నూలువడుకుటను మీ రవలంబింపుడని ప్రతిపాదించుటకు నేను కుతూహలపడుచున్నాను. మీ జీవిత మందువలన ఉత్సాహవంతమైనదిగను, అభిరుచికరమైనదిగను మారి, మీరు శాంత్యానందములు బడయజాలుదురు. మీరు బ్రహ్మచర్య జీవనమును గడపుటలో అది మీకు తోడ్పడగల్గును. విద్యార్థిదశయందు విశ్వాసమను నది గొప్ప విషయము. యథార్థములని యూరక మీ రంగీకరించు నంశములు చాల గలవు. మీ యుపాధ్యాయులు చెప్పుదురని మాత్రమే మీరు వాని నామోదించుచున్నారు. ఉదాహరణకు క్షేత్రగణితమునందలి సమస్య లనేకము నా బుద్ధికి అవగాహమగుట చాల దుర్లభముగ నుండెడివి. కాని యొప్పుకొనెడివాడను. ఈనాడు నేను వానిని గ్రహింపగల్గు చే

గాక, నా ప్రస్తుతపు టుద్యమము నెంతటి యభిమానముతో నిర్వహించు చున్నాడనో, అంత తేలికగా క్షేత్రగణిత పఠనమునందినపుడు నిమగ్నము కాగల్గుదును. మీరు విశ్వాసము పూని, రాట్నచక్రమును త్రిప్పుదురేని ముందొక దినమున ఈ ముసలివాడు చెప్పినది అక్షరాలా సత్యమేనని మీరు అంగీకరింతురను ఈ నామాట నిశ్చయము. శాస్త్రవిశారదు డొకడు గీతలోని ఈ క్రింద శ్లోకమును రాట్నచక్రమున నన్వయించియుంటలో ఆశ్చర్యము లేదు.

శ్లో॥ నేహాభిక్రమ నాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతోభయాత్ ॥

(ఇందు చేసిన సాధన వ్యర్థముకాదు; అపాయమురాదు. ఈ ధర్మమును కొలదిగ నిర్వహించినను పెద్ద భయమునుండి రక్షణ సమకూరగల్గును.) •



ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి.